# రసమఞ్జరీ.



వేదము వేంకటరాయశాస్త్రిచే

స్వవిరచిత సంపూర్ణాంధ్రటీకతో

స్వకీయ

జ్యోతిష్మతీ

ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

MADRAS.



1909.

వెల 12 అ.

# రసమంజరి.

## విషయసూచిక.

శ్రీ

# రసమఞ్జరీ.

ఆత్మీయం చరణం దధాతి పురతో నిమ్నోన్నతాయాం భువి,
స్వీయేనైవ కరేణ కర్షతి తరోః పుష్పం శ్రమాశఙ్కయా,
తల్పే కిం చ మృగత్వచా విరచితే నిద్రాతి భాగై ర్నిజై,
ర న్తఃప్రేమభరాలసాం ప్రియతమా మఙ్గే దధానో హరః. ౧.

శ్రీభానుమిశ్రకవి శృంగారరసస్వరూపప్రతిపాదకంబుగా రసమంజరి యనునీ ప్రబంధమును రచింపం గడంగినవాఁడై లోకోత్తరశృంగారాలంబనభూతుఁ డగునర్ధనారీశ్వరుని మంగళార్థమై ప్రస్తుతించుచున్నాఁడు:—

అన్త...సామ్—అన్తః = హృదయములో - ప్రేమభర = ప్రీత్యతిశయముచేత - అలసామ్ = డస్సిన దైన, ప్రియతమామ్ = అత్యంతప్రియయగు (పార్వతిని), అఙ్గే = (తన) దేహమందు, దధానః = ఉంచుకొన్నవాఁ డైన, హరః = శివుఁడు, శ్రమాశఙ్కయా—శ్రమ = ఆయాసముయొక్క - ఆశఙ్కయా = భయముచేత (పార్వతికి శ్రమ గలుగు నేమో యనుభయముచేత), నిమ్న ఉన్నతాయామ్ = ఎగుడు దిగుడయిన, భువి = నేలయందు, పురతః = ముందు, ఆత్మీయమ్ = తన దైన, చరణమ్ = అడుగును, దధాతి = పెట్టును; తరోః = చెట్టుయొక్క, పుష్పమ్ = పువ్వును, స్వీయేన ఏవ కరేణ = తనదైన చేతితో నే (ఆమెచేతితోఁ గాదు), కర్షతి = కోయును; కించ = మఱియు, మృగ త్వచా = లేడి తోలుతో, విరచితే = చేయఁబడిన, తల్పే = పడకయందు, నిజైః భాగైః = తన యవయవములమీఁదను, నిద్రాతి = శయనించును, (తనయరమే నే క్రిందుగా నుండునట్లు శయనించును, ఆపడక ఆమె మేనికి ఒత్తుకొనకుండ తనయరమేనిబరువు ఆమెయరమేనికి తగులకుండ పవళించు నని భా.)

'అఙ్గే దధానః' అనుటచే ఎవఁ డయినను అత్యంతకాముకుఁడు కాంతను ఉద్యానవనక్రీడాశైలాదులయందు ఎత్తుకొని తిరుగునట్లు అని ధ్వని. ఇట్లు అతఁడు ఆమెయందు ప్రేమాతిశయమును చూపుటచేత ఆమెయు 'ప్రేమభరాలస' పట్టరానంతహర్షముచే పరవశురాలు అయినది. 'అన్తః' అనుట యేల యన ఆమెప్రేమ ఆయన ప్రేమవలె కార్యరూపమున పరిణమింపలేదు గావున. 'అలసామ్' - (ఆప్రేమ) భరమును మనస్సులో నే యుంచుకొని యున్నందున అలసత.

కవి తననామమును తనగ్రంథనామమును తెలుపుచున్నాఁడు:—

విద్వత్కులమనోభృఙ్గరసవ్యాసఙ్గహేతవే
ఏషా ప్రకాశ్యతే శ్రీమద్భానునా రసమఞ్జరీ. ౨.

విద్వ... వే—విద్వత్ = పండితులయొక్క - కుల = సమూహముయొక్క - మనః = చిత్తములనెడు - భృఙ్గ = తుమ్మెదలకు - రస = శృంగారరసముయొక్క - వ్యాసఙ్గ = అనుభవమనెడు - హేతవే = ప్రయోజనముకొరకై, శ్రీ... నా—శ్రీమత్ = ప్రతిభాసంపద గలవాఁడైన (అని కవిపరము) (శోభావంతుఁడైన అని సూర్యపరము) - భానునా = భానుమిశ్రకవిచేత (సూర్యునిచేత అని యర్థాంతరము), రసమఞ్జరీ - రస = శృంగారరసముయొక్క (మకరందముతోడి అని సూర్యపరము) - మఞ్జరీ = పూగుత్తి (పూగుత్తివంటిగ్రంథ మని కవిపరము), ప్రకాశ్యతే = వెల్లడిసేయఁబడుచున్నది. ఎట్లు తుమ్మెదలకు తేనె యానుటకొఱకు తేనె గలపూగుత్తిని సూర్యుఁడు కంటికగపడఁజేయునో, అట్లే పండితులకు శృంగారరసమును ఆస్వాదించుటకై భానుమిశ్రకవి రసమంజరి యనునీకావ్యమును వెల్లడిసేయుచున్నాఁడు, అని భా. స్వయము జ్ఞానియై ఇతరులకు జ్ఞాన మొసంగుకవికి స్వయము ప్రకాశమానుఁడై ఇతరులకు ప్రకాశ మొసంగుసూర్యునితోను, శృంగారాది రసముకై ప్రతిగ్రంథమును వెదకు పండితమనస్సులకు మకరందరసముకై ప్రతిపుష్పమును వెదకుతుమ్మెదలతోను, అత్యంతమనోహరమైన శృంగారరసమునకు అత్యంతమధురమైనతేనెతోను, అట్టిమారసముతో నిండియున్న యీప్రబంధమునకు అట్టితేనెతో నిండినపూగుత్తితోను, సామ్యము ఎంతయు సొంపారుచున్నది. ఇందు శృంగారరసముమాత్రమే తెల్లముసేయఁబడుటచే దీనికి 'శృంగార రసమంజరి' యని పేరు ఇడవలసియుండఁగా దాని నిడక 'రసమంజరి' యని పేరిడుటకు కారణము ఏ మనఁగా, రసములలో నెల్ల శృంగారమే ప్రధాన మగుటయు నా స్యలోకయముచే రసశబ్దము శృంగారమునే చెప్పుటయు.

## అథ ప్రథమప్రకరణమ్.

తత్ర రసేషు శృఙ్గారస్యాభ్యర్హితత్వేన తదాలమ్బనవిభావత్వేన
నాయికా తావ న్నిరూప్యతే.

తత్ర = రసమంజరీగ్రంథమందు, రసేషు = (శృంగార వీర కరుణ అద్భుత హాస్య భయానక బీభత్స రౌద్ర శాంతము లనెడుతొమ్మిది) రసములలోను, శృఙ్గారస్య = శృంగారరసముయొక్క, అభ్యర్హితత్వేన = శ్రేష్ఠత్వముచేత, (శృంగారరసము ప్రధానము గావున), త... త్వేన—ఆశృంగారరసమునకు ఆలంబనవిభావ మగుటచే, తావత్ =

ముందుగా, నాయికా నిరూప్యతే = నాయిక నిరూపింపఁబడుచున్నది. శృంగారశాస్త్రమందు నాయికయే ముఖ్య గావున నాయకనిరూపణముకన్న ముందుగా నాయికా నిరూపణము చేయుట యని యెఱుఁగవలయు.

సా చ త్రివిధా - స్వీయా పరకీయా సామాన్యా చేతి.

ఆనాయికయు ముత్తెఱఁగులు - స్వీయ పరకీయ సామాన్యయు నని.

---

## స్వీయానిరూపణమ్.

తత్ర స్వామి న్యే వానురక్తా స్వీయా.

ఆమువ్వురు నాయికలలో, భర్తయందు మాత్రమే ప్రేమగలది స్వీయ.

స చ పరిణీతాయాం పరగామిన్యా మవ్యాప్తిః; అత్ర పతివ్రతాయా ఏవ లక్ష్యత్వాత్; తస్యా శ్చ పరగామితయా పరకీయాత్వ మపి సమాయాతి.

వివాహితయై పరపురుషాసక్త యగువానికి నీలక్షణము చెల్లదని యాక్షేపింపవలదు; (ఏల యన) ఈలక్షణమునకు పతివ్రత మాత్రమే ఉద్దేశ్యమై యుండుటచేత. వివాహితకును పరగామితచే పరకీయాత్వము సయితము సంభవించును.

అస్యా శ్చేష్టా - భర్తృశుశ్రూషా, శీలసంరక్షణ, మార్జవం, క్షమా చ. యథా.

స్వీయయొక్క వ్యాపారములు (ఏవనఁగా) పతిసేవ, (తన) సదాచారమును కాపాడుకొనుట, మనోవాక్కాయములందు ఏకరూపముగా నుండుట, ఓర్పును. ఉదా.

గతాగతకుతూహలం నయనయో రపాఙ్గావధి,
స్మితం కులనతభ్రువా మధర ఏవ విశ్రామ్యతి,
వచః ప్రియతమశ్రుతే రతిథి రేవ, కోపక్రమః
కదాచి దపి చేత్ తదా మనసి కేవలం మజ్జతి. 3.

కులనతభ్రువామ్ = కులసుందరులయొక్క (కుల = వంశము, నత భ్రూః = వంగిన కనుబొమలుగలది) (ప్రతివ్రతలయొక్క యని యభిప్రాయము), నయనయోః = నేత్రములయొక్క, గత ఆగత కుతూహలమ్ = పోకయొక్కయు రాకయొక్కయు కోరిక (చూచుటకై దృష్టిప్రసారము సేయుటయు, చూచినయనంతరము దృష్టిని మదియించుటయు, ఏతద్విషయకమగు నభిలాష), అపాఙ్గావధి—అపాఙ్గ = కంటి

తుదయే - అవధి = హద్దుగాఁగలది, (చూపు కనుఁగొనలను దాఁటి పో దని భా.); స్మితమ్ = నవ్వు, అధరే ఏవ = మోవియందే, విశ్రామ్యతి = విశ్రాంతిని బొందును, (నవ్వు పెదవిని దాఁట దని, అనఁగా - చిఱునవ్వే నవ్వును పకపక నవ్వ దని, భా.); వచః = మాట, ప్రియతమ శ్రుతే రేవ = ప్రియతముని చెవికి మాత్రమే, అతిథిః = అతిథి, (పరపురుషులతో సంభాషింప దనియు బిగ్గరగా పలుక దనియు అర్థము; మఱియు, శ్రుతేః అను నేకవచనప్రయోగముచే ఈచెవివైపు చెప్పినమాట ఆచెవికి వినఁబడనట్లు పలుకును అని అతిసౌకుమార్యము ధ్వనించుచున్నది.); కోప క్రమః = కోపము వచ్చుట, కదాచిత్ అపి = ఎప్పుడేనియు, (స్యాత్) చేత్ = (కలుగు) నేని, మనసి కేవలమ్ = మనస్సులో నే, మజ్జతి = మునుఁగును, (కోపము రానే రాదు, వచ్చినను మనస్సులోనే అణఁగిపోవును గాని బయటికి తెలియదు, అని యర్థము.) ఇట పూర్వార్థమున శీలకథనంబును, పతితో మెల్లగా భాషించు ననుటచే (అతనిసమీపమందే ఉండు నని సూచనయు, దానిచే) భర్తృశుశ్రూషయు, కోపము రాదు వచ్చిన నణఁచికొను ననుటచేత ఓర్పును, స్ఫురించుచున్నవి.

స్వీయా త్రివిధా - ముగ్ధా, మధ్యా, ప్రగల్భా చ.

స్వీయ ముత్తెఱఁగులు - ముగ్ధ, మధ్య, ప్రగల్భయు (నని).

## ముగ్ధ.

తత్రాఙ్కురితయౌవనా ముగ్ధా.

స్వీయలు మువ్వురలో పొటమరించినయౌవనము గలది ముగ్ధ యనఁబడును.

సా చ ద్వివిధా - జ్ఞాతయౌవనా, అజ్ఞాతయౌవనా చేతి.

ముగ్ధయు ఇరుదెఱఁగులు - ఎఱుకపడినయౌవనము గలది, ఎఱుకపడనియౌవనముగలది యు, అని.

సైవ క్రమశో లజ్జాభయపరాధీనరతి ర్నవోఢా; సైవ సప్రశ్రయా విస్రబ్ధనవోఢా.

ముగ్ధయే కాలక్రమముగా లజ్జాభయములకు లోఁబడినరతి గలది నవోఢ. ముగ్ధయే బెదరు తీఱి విశ్వాసవంతురా లై వ్యవహరించు నేని విస్రబ్ధనవోఢ.

అస్యా శ్చేష్టాః - క్రియా హ్రియా మనోహరా, కోపేఽపి మార్దవం, నవభూషణే సమీహా.

ముగ్ధయొక్క చేష్టలు (ఏ వనఁగా) - హ్రియా = లజ్జచేత, మనోహరా = హృద్యమయిన, క్రియా = సంభోగకాలికవ్యాపారము; కోపేఽపి = కోపమునందు సయితము, మార్దవమ్ = మెత్తఁదనము; నవభూషణే = నూతనాలంకారమందు (ఇది వస్త్రాదికమునకు ఉపలక్షణము), సమీహా = కోరిక.

సామాన్యముగా ముగ్ధకు ఉదా.

ఆజ్ఞప్తం కిల కామదేవధరణీపాలేన కాలే శుభే
వస్తుం వాస్తువిధిం విధాస్యతి తనౌ తారుణ్య ఏణీదృశః,
దృష్ట్యా ఖఞ్జనచాతురీ, ముఖరుచా సౌధాకరీ మాధురీ,
వాచా కిం చ సుధాసముద్రలహరీలావణ్యమామన్త్ర్యతే. ౪.

కామ దేవ ధరణీ పాలేన ఏణీ దృశః తనౌ శుభే కాలే వస్తుమ్ ఆజ్ఞప్తం వాస్తు విధిం తారుణ్యే విధాస్యతి(సతి)=మదన దేవుఁడనెడు భూ నాయకునిచేత లేడి కనుల (వంటికన్నులుగల)దానియొక్క (సుందరియొక్క) మేనియందు మంగళమగు (యౌవనారంభ) సమయమందు నివసించుటకుఁగాను ఆజ్ఞాపింపఁబడిన వాస్తుదేవతాపూజను యౌవనము (అనెడి యమాత్యుఁడు) చేయఁబోవునది(-బోవువాఁడు) (కానుండఁగా), దృష్ట్యా ఖఞ్జన చాతురీ - ముఖ రుచా సౌధాకరీ మాధురీ - కించ వాచా సుధా సముద్ర లహరీ లావణ్యమ్-ఆమన్త్ర్యతే = చూపుచేత కాటుకపిట్టయొక్క సొంపు - మోముయొక్క కాంతిచేత అమృతకిరణ (చంద్ర) సంబన్ధమైన సౌందర్యము-మఱియు మాటచేత అమృత సాగర తరంగములయొక్క కాంతివిశేషంబును - పిలువఁబడుచున్నది (పిలువఁబడుచున్నవి); దృష్ట్యాదులకు ఖంజనచాతుర్యాదిగుణములు కలుగసాగిన వని భా. మదనుఁడు నివసించె ననక నివసింపఁగోర ననుటచేతను, ఈచాతుర్యాదులు వచ్చిన వని చెప్పక పిలువఁబడుచున్న వనుటచేతను, ఇంక రాలే దనియు రా సమయ మనియు అభిప్రాయము. దానిచే యౌవనారంభము సూచితము గాన నాయిక ముగ్ధ.

అజ్ఞాతయౌవనా యథా:

నీరాత్ తీర ముపాగతా శ్రవణయోః సీమ్ని స్ఫురన్నేత్రయోః
శ్యామం లగ్న మిదం కి ముత్పల మితి జ్ఞాతుం కరం న్యస్యతి,
శైవాలాఙ్కురశఙ్కయా శశిముఖీ రోమావళిం ప్రోఞ్ఛతి,
క్షౌమం క్వాస్తీతి ముహుః సఖీ మవిదితశ్రోణీభరా పృచ్ఛతి. ౫.

శశి ముఖీ = చంద్ర వదన, నీరాత్ = (సరో) జలమునుండి, తీరమ్ ఉపాగతా (సతీ) = గట్టునకు వచ్చినదై, స్ఫుర...త్రయోః—స్ఫురత్ = ప్రకాశించుచున్న -

నేత్రయోః = కన్నులు గలవైన, శ్రవణయోః = చెవులయొక్క, (యౌవనోదయముచే కన్నులు దీర్ఘము లై చెవులవఱకు విస్తరిల్లిన వని భా.), సీమ్ని = పర్యంతమందు, శ్యామమ్ = నల్లనిది, ఇదమ్ = ఇది (కడగంటినల్లకాంతిమొత్తము, చెవిచెంతఁ గూడు కొన్నట్టిది), లగ్నమ్=(అట) అంటుకొన్న, (శ్యామమ్) ఉత్పలం కిమ్ ఇతి = (నల్ల) కలువ యో అని, జ్ఞాతుమ్ = ఎఱుంగుటకు, కరమ్ = చేతిని, న్యస్యతి = పెట్టుచు న్నది; రోమ ఆవలిమ్ = నూగారును, శైవా...యా.— (తనకు నూగారు ఏర్పడిన దని యెఱుఁగని దై) శైవాల = నాఁచుయొక్క - అఙ్కుర = మొలకయొక్క (మొలక యనెడు)-శఙ్కయా = భ్రమచేత (జలకేళిలో కడుపుమీఁద అంటుకొన్న నాఁచుమొలక యనుకొని), ప్రోఞ్ఛతి = తుడిచివేయుచున్నది; అవి...రా—అవిదిత =ఎఱుఁగఁబడని - శ్రోణీ భరా (సతీ)=పిఱుఁదుల పెంపు గల (దై) (తనపిఱుఁదులు పెంపుఁ జెందిన వని యెఱుంగనిదై), ముహుః = పలుమాఱు, సఖీమ్ = చెలికత్తెను, శాన్తా అస్మి ఇతి = డస్సిన దానను అని (నాకేల యిట్లు బడలిక కలిగినది అని), పృ చ్ఛతి = అడుగుచున్నది. ఇందు, నేత్రములు ఆకర్ణాంత విశాలములుగా నగుట, నేత్రములకు నీలోత్పలచ్ఛవి ప్రాదుర్భవించుట, నూగారేర్పడుట, శ్రోణీభారము, అను యౌవనధర్మములును అవి యెఱుంగఁబడమియు నుపన్యస్తములు.

జ్ఞాతయౌవనకు ఉదా.

స్వయంభూః శమ్భు రమ్భోజలోచనే, త్వత్పయోధరః ।
నఖేన కస్య ధన్యస్య చన్ద్రమౌళి ర్భవిష్యతి? ౬.

(హే) అమ్భోజలోచనే = తామరలవంటి కన్నులు గలదానా, త్వత్ పయోధరః = నీయొక్క స్తనము, స్వయం భూః = తానుగానే పుట్టినట్టిది (కారణము ఎఱుకపడనిది, శివుఁడును స్వయంభువే గదా), శమ్భుః = సుఖమును కలిగించునది (శమ్ = సుఖమ్ - భావయ తీతి శమ్భుః) (శివుఁడును శమ్భుఁడే గదా), కస్య ధన్యస్య నఖేన = ఏ కృతార్థునియొక్క గోటిచేత (నఖక్షతముచేత), చన్ద్రమౌళిః = చంద్రుఁడు శిగయందుఁ గలదిగా (శివుఁడును చంద్రమౌళుఁడే గదా), భవిష్యతి = అగును? ఏయు దృష్టవంతునినఖక్షతము నీపయోధరముపై చంద్రరేఖకలె భాసిల్లును? నిన్ను పొందఁ నోఁచినపుణ్యాత్ముఁ డెవఁడు అని ప్రశ్న. ఇట నాయికయొక్క యౌవనోద యము సఖికి విదిత మని ఆమె యడిగిన ప్రశ్నచేతనే తెలియుచున్నది.

నవోఢకు ఉదా.

హస్తే ధృతాఽపి శయనే వినివేశితాఽపి
క్రోడే కృతాఽపి, యతతే బహి రేవ గన్తుమ్;

జానీమహే నవవధూ రథ తస్య వశ్యా
యః పారదం స్థిరయితుం క్షమతే కరేణ. ౭.

నవోఢా = క్రొత్తపెండ్లికూఁతురు, హస్తే ధృతా అపి = చేత పట్టుకొనఁబడిన దైనను, శయనే వినివేశితా అపి=పాన్పునందు ఉంపఁబడిన దైనను, క్రోడే కృతా అపి = రొమ్మున పెట్టుకొనఁబడిన దైనను (కవుంగిట బిగింపఁబడిన దైనను), బహిః గన్తుమ్ ఏవ యతతే = (పడకగదినుండి) బయటికి పోవుట కే యత్నించును; యః కరేణ పారదం స్థిరయితుం క్షమతే = ఎవఁడు (తన) చేతితో పాదరసమును (జాఱనీక) నిలుపుటకు నేర్చునో, తస్య = వానికి, నవ వధూః = క్రొత్త పెండ్లాము (పెండ్లికూఁతురు), వశ్యా ఇతి = స్వాధీన అని, జానీమహే = తలంచెదము (తలంచెదను). ఇట నాయకుఁ డెన్నియుపాయములు పన్నినను నాయిక గదినుండి వెడలుటకే యత్నించు ననుటచే లజ్జాభయపరాధీనరతిత్వము ధ్వనితము గాన లక్షణసంగతి.

విస్రబ్ధనవోఢకు ఉదా.

దరముకుళితనేత్రపాళి, నీవీ
నియమితబాహు, కృతోరుయుగ్మబన్ధమ్,
కరకలితకుచస్థలం, నవోఢా
స్వపితి సమీప ముపేత్య కస్య యూనః. ౮.

నవోఢా = (ఒకానొక) నవోఢ, కస్య(చిత్) యూనః సమీపమ్ ఉపేత్య= ఒకానొక ప్రాయపువానియొక్క చెంతను చేరి, దర ముకుళిత నేత్ర పాళి = ఇంచుక మూయఁబడిన కనుఁ గొనలు (కలుగునట్లుగాను = కలదిగాను), నీవీ నియమిత బాహు = పోఁకముడియందు ఉంపఁబడిన (కాంతునియొక్క) చేయి (కలుగునట్లుగాను= కలిగియు), కృత ఊరు యుగ్మ బన్ధమ్ = చేయఁబడిన తొడల జంటయొక్క కలయిక (కలుగునట్లుగాను, అనఁగా ఒకరితొడలతో ఒకరితొడలను మెలివైచికొని), కర కలిత కుచ స్థలమ్ = (కాంతుని)చేతిచే పట్టుకొనఁబడిన స్తన ప్రదేశము (కలుగునట్లుగాను= కలిగియు), స్వపితి = పరున్నది. ఇట నాయకునితో పరున్న దనుటచే విస్రబ్ధనవోఢ యని స్ఫుటముగా తెలియుచున్నది.

## మధ్య.

సమానలజ్జామదనా మధ్యా; సైవ నాతిప్రశ్రయా దతివిస్రబ్ధనవోఢా; అస్యాశ్చేష్టా - సాగసి ప్రేయసి ధైర్యే వక్రోక్తిః,

అధైర్యే పరుషవాక్.

లజ్జయు మదనుండును సమానముగాఁ గలది మధ్య; మధ్య యే అతివిశ్వాసము చేత అతివిస్రబ్ధనవోఢ (యగును); మధ్యయొక్క చేష్ట - అపరాధి యగువల్లభునివిష యమై ధైర్య మున్నచో కుటిలభాషణము, ధైర్యము లేనిచో పరుషభాషణము.

మధ్యకు ఉదా.

స్వాపే ప్రియాననవిలోకనహాని రేవ,
స్వాపచ్యుతౌ ప్రియకరగ్రహణప్రసక్తిః,
ఇత్థం సరోరుహముఖీ పరిచిన్తయన్తీ
స్వాపం విధాతు మపి హాతు మపి ప్రపేదే. ౯.

సరోరుహ ముఖీ = (ఒకానొక) కమల వదన, స్వాపే = నిద్రయందు (తాను నిద్రపోయినయెడల), ప్రియ ఆనన విలోకన హానిః ఏవ = వల్లభుని ముఖముయొక్క (ముఖమును) చూపుయొక్క (చూచుటయొక్క) లోపమే (ఆతనిముఖమును చూచుచుండుభాగ్యము లేకపోవుట తప్ప వేఱు ప్రయోజనము ఉండదు), స్వాప చ్యుతౌ = నిద్ర యొక్క మానుటయందు (తాను నిద్ర మానినయెడల), ప్రియ కర గ్రహణ ప్రసక్తిః = చెలువునియొక్క చేతితో పట్టుకొనుటయొక్క ప్రసక్తి (కలుగు నని శేషము) (తాను మేలుకొన్న దని అతనికి తెలియఁగానే తన్ను లేచిపోనీక యతఁడు చేతితో పట్టుకొను నని భా.), ఇత్థమ్ పరిచిన్తయన్తీ = ఇట్లు తలపోయుచున్నదై, స్వాపం విధాతుమ్ అపి హాతుమ్ అపి ప్రపేదే = నిద్రను చేయుటకును (నిద్రపోవుటకును) మానుటకును కడంగినది, (ఈరెండును పరస్పరవిరుద్ధకార్యము లగుటచేతను రెండును ఈప్సితములై యున్నందునను దేనినిగాని చేయలేక వ్యాకులపడుచుండె నని భా.) నిద్రింపఁగోరుట లజ్జచేత, నిద్రమానఁగోరుట మదనునిచేత, రెండును సమబలములుగా నున్నవి గావున ఈమె మధ్యనాయిక.

---

## ప్రగల్భ.

పతి మాత్ర విషయ కేళీ కలా కలాప కోవిదా ప్రగల్భా;
వేశ్యాయాం కులటాయాం చ పతిమాత్రవిషయకత్వాభావా
న్నాతివ్యాప్తిః; అస్యాస్తు చేష్టా రతిప్రీతి ర్యానన్దాత్ సమ్మోహః.

భర్త మాత్రమే విషయముగాఁగల సంభోగ వ్యాపారములయొక్క సమూహమందు నేర్పరి ప్రగల్భ (యనంబడును); వేశ్యయందును కులటాలియందును పతిమాత్ర

విషయకత్వము (పతియెడలమాత్రమే తమసురతనైపుణిని వినియోగించుట యనునియమము) లేనందున (పైలక్షణమునకు) అతివ్యాప్తి లేదు (అనఁగా - వేశ్యకు పతియే లేనందునను, స్వైరిణికి జారరతి యుండుటచేతను వారియం దీలక్షణము ప్రవర్తిల్లదు.); ఈమె యొక్క చేష్ట అన్నను రతిప్రీతియు, రత్యానందముచేత ఒడలు మఱచుటయు.

రతిప్రీతిమతికి ఉదా.

సంస్పృశ్య స్తన, మాకలయ్య వదనం, సంశ్లిష్య కణ్ఠస్థలం,
నిష్పీ డ్యాధరబిమ్బ, మమ్బర మపాకృష్య, వ్యుద స్యాలకం,
దేవ స్యామ్బుజినీపతేః సముదయం జిజ్ఞాసమానే ప్రియే,
వామాక్షీ వసనాఞ్చలైః శ్రవణయో ర్నీలోత్పలం నిహ్నుతే.

ప్రియే = చెలువుఁడు, స్తనం సంస్పృశ్య = కుచమును తాఁకి, వదనమ్ ఆకలయ్య = (నాయికయొక్క) ముఖమును చక్కఁగాఁ గాంచి, కణ్ఠ స్థలం సంశ్లిష్య = కంఠ ప్రదేశమును కవుఁగిలించి, అధర బిమ్బం నిష్పీడ్య = దొండపండువంటి మోవిని చిక్కఁగా పంటనొక్కి, అమ్బరమ్ అపాకృష్య = వస్త్రమును లాగివైచి, అలకమ్ వ్యుదస్య = ముంగురులను ఎగఁద్రోచి (ప్రియాముఖము సంపూర్ణముగా తనకు నేత్రోత్సవము చేయునట్లుగా దానిమీఁదిముంగురులను ఎగఁద్రోచి), అమ్బుజినీ పతేః దేవస్య సముదయం జిజ్ఞాసమానే (సతి) = తామరతీఁగకు నాయకుఁడైన వేల్పుయొక్క (సూర్యునియొక్క) ఉదయమును విచారించుచు (ఉండఁగా) (సూర్యోదయ మయిన యనంతరము సురతము నిషిద్ధముగాన సూర్యోదయ మాయెనా యని తెలిసికొన నుండఁగా), వామాక్షీ = సుందరనేత్ర, శ్రవణయోః = (తన) చెవులయందలి, నీల ఉత్పలమ్ = నల్ల గలువను, వసన అఞ్చలైః = వస్త్రముయొక్క అంచులతో, నిహ్నుతే = కప్పివైచుచున్నది. సూర్యోదయమునకు కలువ ముకుళించును గాన అట్లు ముకుళించిన తన (నాయికయొక్క) యవతంసోత్పలముం గనునేని నాయకుఁడు సంభోగము మాను నని నాయిక యాయుత్పలమును అతని కగపడనీక దాఁచినది. రతిభంగభయముచేత కలువను దాఁచినది గావున ఈనాయిక రతిప్రీతిమతి.

సురతానందసమ్మోహవతికి ఉదా.

నఖక్షత మురఃస్థలే, ఒధరతలే రదస్య వ్రణం,
చ్యుతా వకుళమాలికా, విగళితా చ ముక్తావళిః,
రతా న్తసమయే మయా సకల మె తదాలోకితం,
స్మృతిః క్వ చ, రతిః క్వ చ, క్వ చ త వాపి శిక్షావిధిః? ౧౧.

రాత్రి చెలువునితో ఇట్టిట్లు మెలఁగవలసిన దని తన కుపదేశించినచెలితో నాయిక మఱునాఁడు చెప్పువృత్తాంతము.—హే ఆలి = ఓ చెలీ, మయా = నాచేత, ఉరః స్థలే = వక్షః ప్రదేశమందు (చనుదోయియందు), నఖ క్షతమ్ = (అతని) గోటి నొక్కు (లును), అధర తలే = మోవి మీఁద, రదస్య వ్రణమ్ = దంత క్షతము (లును), చ్యుతా వకులమాలికా = జాఱిపోయిన పొగడదండయు, విగళితా ముక్తా ఆవళిః చ = ఊడిపోయిన ముత్యాల పేరు ను, ఏతత్ సకలమ్ = ఇది యెల్ల, రత అన్త సమయే = మదనక్రీడయొక్క కడపటి వేళ, ఆలోకితమ్ = చూడఁబడినది, (క్రీడాకాలమం దన్న నో), స్మృతిః క్వ (చ) = (ఒడలిపై) జ్ఞప్తి యెక్కడిది! రతిః క్వ (చ) = క్రీడ యెక్కడిది! తవ శిక్షా విధిః చ క్వ = నీవు నేర్పిన చేఁత యు ఎక్కడిది! సురతానందపరవశురాల నై ఏమియు నెఱుఁగ కుంటి నని భా.

## మధ్యాప్రగల్భల యవాంతరభేదములు.

మధ్యాప్రగల్భే మానావస్థాయాం ప్రత్యేకం త్రివిధే - ధీరా, అధీరా, ధీరాధీరా, చేతి. వ్యఙ్గ్యకోపప్రకాశికా ధీరా, అవ్యఙ్గ్యకోపప్రకాశికా అధీరా, వ్యఙ్గ్యావ్యఙ్గ్యకోపప్రకాశికా ధీరాధీరా. ఇయాంస్తు విశేషః—మధ్యాయా స్తు ధీరాయాః కోపస్య గీ ర్వ్యఞ్జికా, అధీరాయాః పరుషవాక్, ధీరాధీరాయా వచనరుదితే కోపప్రకాశకే; ప్రౌఢాయా స్తు ధీరాయా రత్యౌదాసీన్యమ్, అధీరాయా స్తర్జనతాడనాది, ధీరాధీరాయా రత్యౌదాసీన్యం తర్జనతాడనాది చ కోపస్య ప్రకాశకమ్.

మధ్యయు ప్రగల్భయు మానము (ప్రియునియపరాధమునకు కోపము) దాల్చినప్పుడు ఒక్కొక్కతెయు ముత్తెఱంగులు (అగుదురు) - ధీర, అధీర, ధీరాధీర యు నని. (అందు) వ్యంగ్యమయిన (వ్యంగ్యముగా - అనఁగా - గుఱుతులచేత ఊహించుకోవలసినట్లుగా) కోపమును వెల్లడించునది ధీర(యనంబడును), స్పష్టకోపప్రకాశిక అధీర (యనంబడును), స్పష్టాస్పష్టకోపప్రకాశిక ధీరాధీర (యనంబడును). అయినను (ఇరువురను) ఈపాటివిశేషము.— మధ్యధీరయొక్క కోపమును వాక్కు తెలుపును, మధ్యాధీరయొక్క (కోపమును) పరుష వాక్కు (తెలుపును), మధ్యధీరాధీరయొక్క కోపమును వచనరుదితములు తెలుపును; ప్రౌఢధీరయొక్క (కోపమును) రతియందు అసడ్డయు, ప్రౌఢాధీరయొక్క (కోపమును) బెదరింపులు కొట్టుట లోనగునవియు, ప్రౌఢధీరాధీరయొక్క (కోపమును) రత్యౌదాసీన్యంబును తర్జనతాడనాదికంబులును తెలుపును.

ఏతే ధీరాదిభేదాః స్వీయాయా ఏవ న పరకీయాయా ఇతి ప్రాచీనలేఖన మాజ్ఞామాత్రమ్; యతో ధీరత్వ మధీరత్వం త దుభయం హి మాననియతమ్, పరకీయాయా శ్చ మాన శ్చేత్ తస్యా అ ప్యావశ్యకత్వాత్, మాన శ్చ న పరకీయాయా ఇతి వక్తు మశక్యత్వాత్.

ఈ ధీరాదిభేదములు స్వీయ కే (గాని) పరకీయకు లే వని ప్రాచీనులు వ్రాయుట ఆజ్ఞామాత్రము (గాని యుక్తియుక్తము గాదు); ఏల యన—ధీరత్వము అధీరత్వము ఆరెండును నిశ్చయముగా మానముతోడివి, పరకీయకును మానము కల దేని పరకీయకును (ధీరత్వము అధీరత్వము తదుభయము) ఆవశ్యకము లగుటచేతను, మానము పరకీయకు ఉండ దని చెప్ప శక్యము గామిచేతను.

మధ్యధీరకు ఉదా.

లోలాళిపుఞ్జే వ్రజతో నికుఞ్జే
స్ఫారా బభూవుః శ్రమవారిధారాః,
దేహే సమీహే భవతో విధాతుం
ధీరం సమీరం నళినీదళేన. ౧౨.

సంకేతనికుంజమునందు అన్యకాంతతో సంభోగ మొంది చెమర్చుచు వచ్చిననాయకునితో నాయిక పలుకుచున్నది.—లోల ఆళి పుఞ్జే = తిరుగుచున్న తుమ్మెదల గుంపుగలదైన, నికుఞ్జే = పొదరింటియందు, వ్రజతః = పోవుచున్న: భవతః=నీయొక్క, దేహే = మేనియందు, శ్రమ వారి ధారాః = చెమట నీటి సోనలు, స్ఫారాః = మిక్కుటములు, బభూవుః = అయినవి, (వానిని ఆర్పుటకు), నళినీ దళేన = తామ రాకులతో, ధీరం సమీరమ్ = దట్టమయిన గాలిని, విధాతుమ్ = చేయుటకు (అనఁగా నీమేనికి తామరాకువీవనతో చక్కఁగా గాలిని విసరుటకు), సమీహే = కోరుచున్నాను. (నీవు నన్ను వంచించి ఆయింతిని ఇప్పుడే ఈపొదరింటఁ గూడి వచ్చినయాయోగ్యుఁడవు; ఈచెమట నీకు తత్సంభోగముచేత కలిగినది ఇంకను ఆఱలేదు; అని వ్యంగ్యము.) ఇట్లు వక్రోక్తిచే కోపము దెలిపినది గావున ఈనాయిక మధ్యధీర.

మధ్యాధీరకు ఉదా.

జాత స్తే నిశి జాగరో, మమ పున ర్నేత్రామ్బుజే శోణిమా;
క్షీబత్వం భవతా మధు ప్రపిబతా, వ్యాఘూర్ణితం మే మనః;

భ్రామ్యద్భృఙ్గఘనే నికుఞ్జభవనే లబ్ధం త్వయా శ్రీఫలం,
పఞ్చేషుః పున రేష మాం హుతవహక్రూరైః శరైః కృన్తతి.

రే యెల్ల అన్యకామినితోఁ గడపి వేకువ నింటికి వచ్చిననాయకుని నాయిక యుపాలంభించుట.—(హే ప్రియ = ఓ వల్లభుఁడా), తే నిశి జాగరో జాతః = నీకు రాత్రి జాగరము కలిగినది (తుణ మయినను వృథా పోనీయక రాత్రి యెల్ల అలదాని పొందునం గడపితివి అని భా.), పునః = ఆశ్చర్యము! మమ నేత్ర అమ్బుజె శోణిమా (జాతః) = తామరవంటి నా కంట ఎఱుపు (కలిగినది); (జాగరముచేసినవారికంట ఎఱుపు గలుగుట న్యాయ్యము గాని ఒకరు జాగరముచేసిన మఱియొకరికంట ఎఱుపు గలుగుట ఆశ్చర్యము గదా. తాను రాత్రి యెల్ల ఏడ్చుచుండుటచే తనకన్నులు ఎఱుపెక్కిన వని గూఢాభిప్రాయము.); భవతా ప్రవితతం మధు నిష్పీతమ్=నీచే విస్తారమైన సారాయి నిండుగా త్రాగఁబడినది, (పునః = ఆశ్చర్యము), మే మనః వ్యాఘూర్ణితమ్ = నా మనస్సు తబ్బిబ్బుపడుచున్నది, (నీవు చేసినవంచనవలనిదుఃఖముచేత నని గూఢాభిప్రాయము.); భ్రామ్యత్ భృఙ్గ ఘనే నికుఞ్జ భవనే త్వయా శ్రీఫలం లబ్ధమ్ = సుడిదిరుగుచున్న తుమ్మెదలచే దట్టమయిన పొదరింట నీచేత మారేడుఁబండు (అలదానికుచము) పొందఁబడినది, (పునః = ఆశ్చర్యము), ఏష పఞ్చేషుః మాం హుతవహక్రూరైః శరైః కృన్తతి = ఈ యైదుబాణములవాఁడు (మన్మథుఁడు) నన్ను అగ్నివలె కఠోరములయిన (కాల్చునవైన) బాణములతో చక్కాడుచున్నాఁడు; [ఆ మారేడుఁబండ్లతోఁటకు కాపరి యైన యాభోతు (మరుఁడు) పండు దొంగిలిననిన్ను మాని నిరపరాధను నన్ను దండించుట ఆశ్చర్య మని భా.; నీ విట్టి ధూర్తుఁడ వైనను నీకై నేను మరుబారిం బడుచున్నాను అనియు భా.] పరుషవాక్కుచేత మధ్యాధీర.

మధ్యాధీరకు ఉదా.

'కాన్తానురాగచతురోఽసి, మనోహరోఽసి,
నాథోఽసి, కిం చ నవయౌవనభూషితోఽసి,'—
ఇత్థం నిగద్య సుదృశా వదనే ప్రియస్య
నిశ్వస్య బాష్పలులితా నిహితా దృగన్తాః. ౧౮.

కాన్తా అనురాగ చతురః అసి=కాంతలను వలపించుటయందు నేర్పరివి అగుదువు, మనోహరః అసి = మనస్సును హరించువాఁడవు (- రూపసంపద గలాఁడవు) అగుదువు, నాథః అసి = భర్తవు, కించ = ఇంతియగాక, నవ యౌవన భూషితః అసి = క్రొత్త జవ్వనముచేత అలంకరింపఁబడినవాఁడవు అగుదువు: ఇత్థం నిగద్య = ఇట్లని పల్కి, సు దృశా = అందమయిన కన్నులుగలయాచెలువచేత, నిశ్వస్య = ని

ట్టూర్పుపుచ్చి, ప్రియస్య వదనే = ప్రియుని మోమునందు, బాష్ప లలితాః దృగన్తాః నిహితాః = కన్నీళ్లచే క్రమ్మఁబడిన కటాక్షములు నిగుడ్పఁబడినవి (ఆచెలువ...కటాక్షములను నిగిడ్చెను - ఆచెలువ...కడగంట చూచెను). 'ఆయింతి నీరూపయౌవన సంపదలకు నిన్ను వలచినది, నీవును దానిని కోరి వలపించి పొందితివి. యుష్మద్రూప మయిన నాభాగ్యమును ఆగుబ్బెతపాలు సేసినవంచకుఁడవు.'- అనుసభిప్రాయముగల యీవక్రోక్తిచేతను అనంతరోక్త నిశ్వాసబాష్పములచేతను నాయిక మధ్యధీరాధీర.

ప్రగల్భధీరకు ఉదా.

> నో తల్పం భజసే, న జల్పసి సుధాధారానుకారా గిరో,
> దృక్పాతం కురుషే. న వా పరిజనే కోపప్రకాశచ్ఛలాత్,
> ఇత్థం కైతకగర్భగౌరి దయితే కోపస్య సంగోపనం
> తత్ స్యా దేవ, న చేత్ కుతః సహచరీ కుర్వీత సాచి స్మితమ్?

అలిగిననాయికను సాపరాధుఁడు నాయకుఁడు ఓదార్చుట.—కైతక గర్భ గాత్రి = మొగలిపువ్వుయొక్క లోపైపుఁటి మేనుగలదానా, దయితె = ప్రేయసీ, పరిజనే కోప ప్రకాశ ఛలాత్ = సేవకులమీఁద కోపము(యొక్క) చూపుటయను మిషచేత, తల్పం నో భజసే = పాన్పునకు రాకున్నావు, సుధా ధారా అనుకారాః గిరః న జల్పసి = అమృతంపు జాలును పోలునట్టి మాటలను పలుకవు, దృక్ పాతం వా న కురుషే=చూపుయొక్క సేయుట సేనియు చేయవు, (నన్ను పాన్పునం గూడవు గదా, పలుకరింప నైనఁ బలుకరింపవు, తుదకు చూడ నైనను చూడవు.), ఇత్థం తత్ కోపస్య సంగోపనమ్ స్యాత్ ఏవ = ఇట్లు అది (పూర్వోక్తప్రకారము) (నామీఁది) కోపమును దాఁచుట యే అగును, న చేత్ కుతః సహచరీ సాచి స్మితం కుర్వీత = కాదేని ఏల (నీ)చెలి వెడమొగమై చిఱునగవు నవ్వును? పాన్పు చేరమి రత్యౌదాసీన్యముచేతఁ గావున నాయిక ప్రౌఢధీర.

ప్రౌఢాధీరకు ఉదా.

> ప్రతిఫలన మవేక్ష్య స్వీయ మిన్దోః కలాయాం
> హరశిరసి పరస్యా వాస మాశఙ్కమానా
> గిరిశ మచలకన్యా తర్జయామాస కమ్ప్ర
> ప్రచలవలయవల్గత్కాన్తిభాజా కరేణ. ౧౬.

అచలకన్యా = పార్వతి, ఇన్దోః కలాయామ్ = (శివునితలమీఁది) జాబిల్లి రేఖయందు, స్వీయం ప్రతిఫలనమ్ అవేక్ష్య = (చంద్రుఁడు అద్దమువలె స్వచ్ఛుఁడు గా

వున) తనదైన ప్రతిబింబమును చూచి, హర-శిరసి పరస్యాః వాసమ్ ఆశఙ్కమానా=శివుని తలయందు మఱియొకతెయొక్క ఉనికిని ఊహించినదై (-మఱియొకతె కల దని తలంచినదై), గిరిశమ్=శివుని, కమ్ప్ర ప్రచల వలయ వల్గత్ కాన్తి భాజా కరేణ = (చేతి)చలనముచే కదలుచున్న గాజులనుండి దుముకుచున్న కాంతిని పొందిన(కాంతిగలదైన) చేతితో, తర్జయామాస = బెదరించెను. తర్జనముచే నాయిక ప్రగల్భాధీర.

ప్రగల్భధీరాధీరకు ఉదా.

తల్పోపాన్త ముపేయుషి ప్రియతమే వక్రీకృతగ్రీవయా
కాకువ్యాకులవాచి సాచిహసితస్ఫూర్జత్కపోలశ్రియా
హస్తన్యస్తకరే పున ర్మృగదృశా లాక్షారసక్షాళిత
ప్రోష్ఠీపృష్ఠమయూఖమాంసలరుచో విస్ఫారితా దృష్టయః.

(ఇట కర్త్రర్థకప్రయోగమును ఆంధ్రభాషామర్యాదానుసారముగ కర్త్రర్థప్రయోగముచే వివరించెద.) మృగదృశా = సుందరి, ప్రియతమె తల్ప ఉపాన్తమ్ ఉపేయుషి (సతి) = (సాపరాధుఁడైన) ప్రియతముఁడు పానుపు చెంతకు వచ్చినవాఁడు (కాఁగా), (అవంచకుని చూడ నొల్లక), వక్రీకృత గ్రీవయా (సత్యా)=వెడమొగము సేయఁబడిన మెడగలదై, కాకు వ్యాకుల వాచి (సతి) = (అతఁడు) స్వరవికారముతో (గద్గదస్వరముతో) కూడుకొన్న తొట్రుపడుచున్న మాటలుకలవాఁడు (కాఁగా) (-మాటలు పలుకఁగా), సాచి హసిత స్ఫూర్జత్ కపోల శ్రియా (సత్యా) = వంకర నవ్వుచేత ఉబ్బుచున్న చెక్కిళ్ల కాంతిగలదై, పునః = మఱియు, (అనవ్వుచే మన్నించిన దని తలఁచినవాఁడై), హస్త న్యస్త కరే (సతి)=(నాయిక)చేతియందు ఉంపఁబడిన చేయికలవాఁడు (కాఁగా), లాక్షా రస క్షాళిత ప్రోష్ఠీ పృష్ఠ మయూఖ మాంసల రుచః దృష్టయః విస్ఫారితాః = లత్తుక రసముతో కడుగఁబడిన వెంటిజేఁడియొక్క వెన్నుయొక్క వెలుఁగులచే బలిసిన కాంతిగలవైన చూపులను (కోపాధిక్యముచే ఎఱుపులను) నిగిడ్చినది. వెడమొగము రత్యౌదాసీన్యముచేత, కన్ను లెఱ్ఱజేయుట బెదరింపు, కాన ప్రగల్భధీరాధీర.

ధీరాదిభేదములకు అవాంతరవిభాగము.

ఏతే ధీరాదిభేదాః షట్ జ్యేష్ఠా కనిష్ఠా భేదా ద్ద్వివిధాః. పరిణీతత్వే సతి భర్తు రధికస్నేహా జ్యేష్ఠా, భర్తు ర్న్యూనస్నేహా కనిష్ఠా. భర్తు రధికస్నేహాసు న్యూనస్నేహాసు పరకీయాసు సామాన్యవనితాసు చ నాతివ్యాప్తిః, పరిణీతపదోపాదానాత్.

ఈధీరాదిభేదములు ఆఱును జ్యేష్ఠయు కనిష్ఠయు ననుభేదముచే రెండేసి (అగు ను). వివాహితయై పతియొక్క అధికస్నేహమునకు పాత్ర మగునది జ్యేష్ఠ, (వివాహిత యై) పతియొక్క అల్పస్నేహమునకు పాత్రమగునది కనిష్ఠ. పతియొక్క అధికస్నేహము నకును అల్పస్నేహమునకును పాత్రము లగుపరకీయాసామాన్యవనితలకు (ఈలక్షణము) చెల్లదు; పరిణీతపదముచే వారిని తొలఁగించుటవలన. [పరకీయాపదస్వారస్యముచే, ఎవని కవతె పరకీయనాయిక యౌ వానిచే నది పరిణీత కానందున వానివిషయమై ఆయింతికి ఈలక్షణము చెల్లదు. సామాన్యకు పరిణయము లేనేలేదు గదా.]

జ్యేష్ఠధీరకును కనిష్ఠధీరకును ఉదా.

ఏకస్మిన్ శయనే సరోరుహదృశో ర్విజ్ఞాయ నిద్రాం, తయో
రేకాం పల్లవితావగుణ్ఠనపటా ముత్కన్ధరో దృష్టవాన్;
అన్యస్యాః సవిధం సమేత్య నిభృతం వ్యాలోలహస్తాఙ్గుళి [వాన్.
వ్యాపారై ర్వసనాఞ్చలం చపలయన్ స్వాపచ్యుతిం క్లృప్త

(నాయకుఁడు) ఏకస్మిన్ శయనే సరోరుహదృశోః నిద్రాం విజ్ఞాయ = ఒక పడకయందే కమలనేత్రలిద్దఱియొక్కయు నిద్ర నెఱింగి (తనతామరసాక్షు లిద్దఱు నను ఏకశయ్యాగతలై నిద్రించుచున్నారని తెలిసికొన్నవాఁడై), ఉత్కన్ధరః = నిగి డిన మెడకలవాఁడై (తనమెడ యెత్తి), పల్లవిత అవగుణ్ఠన పటామ్ ఏకాం దృష్టవాన్ = చిగిర్చిన ముసుఁగు వలువ (కలదానిని) ఒకతెను చూచినవాఁడై (ఆయిద్దఱలో నొ కతె ఒడలంతయు ముసుఁగు కప్పుకొని నిద్రించుచుండుటం గాంచినవాఁడై), అన్యస్యాః సవిధం నిభృతం సమేత్య = రెండవదాని చెంతకు నిశ్శబ్దముగా వచ్చి, వ్యాలోలహస్త అఙ్గుళి వ్యాపారైః = చలించుచున్న చేతివ్రేళ్లయొక్క చేష్టితములచేత, వసన అఞ్చలం చపలయన్ = వస్త్రముయొక్క అంచును కదలించుచు, స్వాపచ్యుతిం క్లృప్తవాన్ = నిద్రయొక్క విరామమును కావించినవాఁడాయెను. నాయకుఁడు జ్యేష్ఠకై వచ్చి నాఁడు. 'పల్లవిత' - ఆనాయికలలో జ్యేష్ఠ మొగమును కప్పుకొనందున ఆమెను తెలిసికొన్నాఁడు. 'నిభృతమ్' - నిశ్శబ్దముగా మేలుకొల్పుట కనిష్ఠకు మెలఁకువ రాకుండుటకు, మాటచే పిలువమియు నందులకే. నాయిక లిద్దఱును నటించిపోయు మాని ఏకశయ్యాగతలగుట నాయకునిపై ఇద్దఱును అలిగి యౌదాసీన్యము వహించు టవలన, కావున ఇద్దఱును ప్రౌఢలు. ఆమె ముసుంగు వైచికొన్నదానిని గుర్తింపమై లేపమిచే అది కనిష్ఠ, రెండవదానిని గలిగి లేపినందున అది జ్యేష్ఠ.

జ్యేష్ఠాధీరకును కనిష్ఠాధీరకును ఉదా.

అన్తఃకోపకషాయితే ప్రియతమే పశ్యన్ ఘనే కాననే
పుష్పస్యాపచయాయ నమ్రవదనా మేకాం సమాయోజయన్,
అర్ధోన్మీలితలోచనాఞ్చలచమత్కారాభిరామాననాం
స్మేరార్ధాధరపల్లవాం నవవధూ మన్యాం సమాలిఙ్గతి. ౧౫.

అన్తః కోప కషాయితే ప్రియతమే పశ్యన్ (సన్) = మనస్సులో అలుకచేత కలఁగిన ప్రేయసులనిరువురను చూచినవాఁడై, ఘనే కాననే = దట్టమయిన (యుద్యాన) వనములో, ఏకామ్ = (ఆయిరువురలో) నొకతెను, నమ్ర వదనామ్ = (కోపముచే) మోము వంచుకొనియున్నదానిని, పుష్పస్య అపచయాయ సమాయోజయన్ (సన్) పువ్వులయొక్క ('పుష్పస్య' అని జాత్యేకవచనము) కోఁతకు (మంచిమాటలాడి) తగిలించినవాఁడై, అర్ధ ఉన్మీలిత లోచన అఞ్చల చమత్కార అభిరామ ఆననామ్ = సగము తెఱవఁబడిన కన్నుఁగొనల విలాసములచే మనోహరమైన ముఖముగలదియు, స్మేర అర్ధ అధర పల్లవామ్ = నవ్వుచున్న సగము మోవి చిగురు గలదియు (నైన), అన్యామ్ = రెండవదానిని, నవోఢామ్ = నవోఢను, సమాలిఙ్గతి = కవుఁగిలించికొనుచున్నాఁడు.

నాయకుఁడు ప్రథమను పువ్వులు కోయుచుండు మనుట తాను రెండవదానికడకు జరుగుటకు. కాననము 'ఘన' మయినందున రెండవదానియాలింగనమును మొదటిది చూడఁజాల దాయెను. ఆలింగనమునకు ప్రేమాతిశయము కారణము గావున, రెండవది జ్యేష్ఠ, మొదటిది కనిష్ఠ. ఇట పరుషవచనాదికము ప్రత్యక్షము లేదుగాని సులువుగా కోపశాంతి నొందినందున ఈనాయికల యధీరతయు దానిచేత పరుషవచనాదికమును ఊహనీయము.

జ్యేష్ఠధీరాధీరకును కనిష్ఠధీరాధీరకును ఉదా.

ధైర్యాధైర్యపరిగ్రహగ్రహిలయో రేణీదృశోః ప్రీతయే
రత్నద్వన్ద్వ మనన్తకాన్తిరుచిరం ముష్టిద్వయే న్యస్తవాన్,
ఏకస్యాః కలయన్ కరే ప్రథమతో రత్నం పరస్యాః ప్రియో
హస్తాహస్తిమిషాత్ స్పృశన్ కుచతటీ మానన్ద మావిన్దతి.

ప్రియః = వల్లభుఁడు, ధైర్య అధైర్య పరిగ్రహ గ్రహిలయోః ఏణీ దృశోః ప్రీతయే = ధైర్యము అధైర్యము అనువానియొక్క (ధైర్యాధైర్యములను) పూనుటయందు పట్టుదలగలవారైన హరిణీలోచనలయొక్క సంతుష్టికొఱకు (ఆ హరిణీలోచనలను రంజించుటకు), అనన్త కాన్తి రుచిరం రత్న ద్వయం ముష్టి ద్వయే న్యస్తవాన్ = తుదలేని జిగిచే ఒప్పిదమయిన మణుల జంటను తన పిడికిళ్ల జంటలో (ఒక్కొక్కమణి నొక్క

క్కుపిడికిటఁ ఉంచుకొన్నవాఁడై, ప్రథమతః ఏకస్యాః కరే ఏకం రత్నం కలయన్ = మొదట ఒకతె చేతియందు ఒక మణిని ఉంచి, పరస్యాః కుచ తటీం హస్తావాప్తి మిషాత్ స్పృశన్ = రెండవదానియొక్క చను గట్టును చేతిచేతి (తాను ఆమెతో తన చేతితోను, ఆమె తనతో ఆమెచేతితోను) పెనఁకువ నెపమున తాఁకుచు, ఆనన్దమ్ అవిన్దత్ = హర్షము పొందుచున్నాఁడు. మణిని మాత్రము పొందినది కనిష్ఠ, ఆలింగనము పొందినది జ్యేష్ఠ.

ఇతి స్వీయానిరూపణమ్.

(ఇతి = ముగిసినది.)

---

## ప ర కీ యా ని రూ ప ణ మ్.

---

అప్రకటపరపురుషానురాగా పరకీయా. సా చ ద్వివిధా - పరోఢా కన్యకా చ. కన్యాయాః పిత్రాద్యధీనతయా పరకీయతా; అస్యా గుప్తైవ చేష్టా.

(ఇతరులకు) తెలియకుండ జారునియం దనురాగముగలది పరకీయ. అది యు నిరు దెఱంగులు - పరోఢ (జారునికన్న నన్యునిచే పెండ్లియాడఁబడినది) కన్యయు (నని). కన్యకు (నాయకునికంటె పరులయిన) తండ్రి లోనగువారివశమందుండుటచేత పరకీయత. దీనిచేష్ట (జారునికన్న) ఇతరులకు తెలియనిదిగానే యుండును.

పరోఢా యథా.

అయం రేవాకుఞ్జః కుసుమశరసేవాసముచితః,
సమీరో ఽయం వేలావనవిదళదేలాపరిమళః,
ఇయం ప్రావృడ్ధన్యా నవజలదవిన్యాసచతురా,
పరాయత్తం చిత్తం సఖి కి మపి కర్తుం మృగయతే. ౨౧.

సఖి = ఓచెలీ, అయమ్ రేవా కుఞ్జః = ఈ నర్మద పొద (నర్మదయొడ్డున నున్న యీపొదరిల్లు), కుసుమ శర సేవా సముచితః = పూవు టమ్ములవాని కొలువునకు (కామకేళికి) మిక్కిలియనుకూలము (గానున్నది) (లోపలివృత్తాంతము వెలుపలికి తెలియనట్లు దట్టముగా నుండుటచేత నని భా.); అయం సమీరః = ఈ గాలి, వేలా వన విదళత్ ఏలా పరిమళః = (నర్మద) గట్టునందలి యడవియందు విరియుచున్న ఏలకికాయల యొక్క సుగంధముగలది (వేలా అనుటచే శైత్యము సూచిత మయినది. గాలి చల్లగా పరిమళించుచు మిక్కిలి ఆహ్లాదకరముగా వీచుచున్న దని భా.); ఇయం ప్రావృట్ ధన్యా

నత జలద విన్యాస చతురాః= ఈ వర్షర్తువు పుణ్యవంతము క్రొత్తమేఘముల రచనయం దు నేర్పరి (ధన్య యనుటచే ఉపకారి యనియు అందుచేత కామోద్దీపన మొనర్చి దీని యుపపతిని దీనికడకు ప్రేరేపించు ననియు భా.); చిత్తం పరాయత్తం (సత్) = (నా) మనస్సు అన్యాధీనమై (ఉపపత్యధీనమై), కిమపి కర్తుం మృగయతే=ఏమో (చేయుట కు కోరుచున్నది (ఆచెలువునితో కామక్రీడలం దేలుటకు అభిలషించుచున్నది). పోయి వానిం దోడి తెమ్ము అని భా.

## గుప్తాదులు.

గుప్తా విదగ్ధా లక్షితా కులటాఽనుశయానా ముదితా ప్రభృతీనాం పరకీయాయామే వాన్తర్భావః.

గుప్త, విదగ్ధ, లక్షిత, కులట, అనుశయాన, ముదిత-లోనగు వారు పరకీయయందే చేరుదురు. (లోనగువారు = పతివంచికయు, సాహసికయు.) [తనఱంకును దాఁచునది గుప్త. అంకుఁదనమందు నేర్పరి విదగ్ధ, ఎట్లని సఖ్యాదులచేత కనిపట్టఁబడినఱంకుగలది లక్షిత, జారులకై వారియిండ్లకు సంచరించునది కులట, కోర్కె నెఱవేఱమియు చెలువు గల్గుటయును కారణములుగా దుఃఖించునది అనుశయాన, కోర్కె నెఱవేఱుటచే హర్షించుచుండునది ముదిత.]

గుప్తా త్రివిధా - వృత్తసురతగోపనా, వర్తిష్యమాణసురతగోపనా, వృత్తవర్తిష్యమాణసురతగోపనా చేతి.

(అందు) గుప్త మూఁడు తెఱఁగులు గలది - జరిగినసురతమును దాఁచునది, జరుగఁబోవుసురతమును దాఁచునది, ఉభయసురతములను దాఁచునదియు, నని.

త్రివిధా యథా.

శ్వశ్రూః క్రుధ్యతు విద్విషన్తు సుహృదో నిన్దన్తు వా యాతర,
స్తస్మిన్ కిం తు న మన్దిరే సఖి పునః స్వాపో విధేయో మయా;
ఆఖో ర్వాక్రమణాయ కోణకుహరా దుత్ఫాల మాతన్వతీ
మార్జారీ నఖరైః ఖరైః కృతవతీ కాం కాం న మే దుర్దశామ్.

సఖి = ఓచెలీ, శ్వశ్రూః క్రుధ్యతు = అత్త కోపగించునుగాక, సుహృదః విద్విషన్తు = చెలులు ద్వేషింతురుగాక, యాతరః వా నిన్దన్తు = తోడికోడండ్రు నుదూఱుదురుగాక, కింతు = ఏమైననగుఁగాక, పునః తస్మిన్ మన్దిరే మయా స్వాపః న విధేయః = ఇఁక ఆ యింట నాచేత నిద్ర చేయశక్యము కాదు (ఇఁకను ఆయింట పరుండఁజాలను); (ఏల యనః—) ఆఖోః ఆక్రమణాయ కోణ కుహరాత్ ఉత్ఫాలమ్

అతన్వతీ మార్జారీ ఖరైః నఖరైః మే కాం కాం దుర్దశాం న కృతవతీ = ఎలుక యొక్క (ఎలుకను) ఆక్రమించుటకై మూలలోని బొక్కనుండి దాఁటు (ఉరాము) పైచును ఆఁడుఁబిల్లి వాఁడి గోళ్లతో నాకు ఏమి యేమి దురవస్థను (గాయములను) చేసి నది గాదు! (మిక్కిలి గాయములు చేసిన దని యర్థము.) ఇందు జారునివలనినఖ క్షతములను పిల్లిగోళ్లవలనిగాయములనుగా బొంకుటచేత వృత్తసురతగోపనము. మ తియొకయింటఁ బరుండుట జారార్థ మైయుండఁగా పిల్లిభయముచేత నని బొంకుటచే వర్తిష్యమాణసురతగోపనము. అవియే యుభయసురతగోపనము.

విదగ్ధా ద్వివిధా - వాగ్విదగ్ధా, క్రియావిదగ్ధా చేతి.

విదగ్ధ యిరుదెఱఁగులది - వాగ్విదగ్ధ, క్రియావిదగ్ధయు, నని.

వాగ్విదగ్ధా యథా.

నిబిడతమ తమాల మల్లి వల్లీ
విచకిల రాజి విరాజి తోపకణ్ఠే
పథిక సముచిత స్త వాతితీవ్రే
సవితరి తత్ర సరిత్తటే నివాసః. ౨౩.

ఒకానొకతె బాటసారికి సంభోగేచ్ఛవై - దయామాత్రము చే మిడియెండవేళ కుఁ దగినయునికిపట్టును చెప్పిన దని ఇతరులు భ్రమపడునట్లుగా - సంకేతస్థానమును సూచించుచున్నది.—పథిక = ఓయిబాటసారీ, సవితరి అతి తీవ్రే సతి = సూర్యుఁ డు మిక్కిలి వేఁడి కాఁగా (ఎండ దుస్సహ మైనప్పుడు), తవ = నీకు, నిబి ...కణ్ఠే = మిక్కిలిదట్టమయిన చీఁకటిమ్రాఁకులు మల్లె తీఁగలు సన్నమల్లెలు (-వీని) వరుసల చేత అలంకరింపఁబడిన ప్రాంతముగలదైన, తత్ర = అల్లదిగో ఆ, సరిత్ తటే = ఏటి గట్టున, నివాసః సముచితః = ఉనికి మంచిది. 'నిబిడతమము' గావున (1) చ లువ యొక్కువ, (2) అందలికామక్రీడ బయటికి పడదు. 'తమాల' - పట్టపగలే అయినను చీఁకటిచెట్లచీఁకటిచేత రాత్రివలె నుండును గాన (1) నిద్రకును (2) సురత ములకును అనుకూలము. మల్ల్యాదికపరిమళము (1) విశ్రాంతికిని (2) కామక్రీడల కును అనుకూలము. సరిత్తటము - విజనముగాన (1) విశ్రమమునకును (2) సురత మునకును అనుకూలము. ఇట మాటనేర్పు స్పష్టమే.

క్రియావిదగ్ధా యథా.

దాస్యాయ భవననాథే బదరీ మపనేతు మాదిశతి,
హేమన్తే హారిణాక్షీ పయసి కుఠారం వినిక్షిపతి. ౨౪.

భవన నాథే = గృహ పతి, బదరీమ్ అపనేతుమ్ = రేఁగును కొట్టివైచుటకు (రేఁగుఁజెట్టును కొట్టివైవు మని), దాసాయ ఆదిశతి (సతి) = సేవకునికి ఆజ్ఞాపింపఁగా, హరిణాక్షీ = లేడికన్నులవంటికన్నులుగలయాచెలువ, హేమన్తే = హేమంత ఋతువునందు, కుఠారం పయసి వినిక్షిపతి = గొడ్డటిని నీటిలో వైచుచున్నది. హేమంత మగుటవలన ఎక్కుడుచలిచేత బావినీళ్లలోనికి దిగి గొడ్డటి నెత్తుట శక్యము గాదు. ఆహరిణాక్షి రేఁగుఁజెట్టుక్రింద నిత్యము జారునిపొందునం దేలుచు అతనివలనఁగలిగినసఖక్షతాదికమును రేఁగుకంపవలనిగాయములనుగా బొంకు మండుటచే గృహపతి రేఁగును కొట్టివైవ నాజ్ఞచేసినాఁ డని యూహ్యము. గొడ్డలి లేక ఆపని నెఱవేఱదు గావున నాయిక గొడ్డటిని తనసంకేతస్థలమునకు భంగ మగు ననుభయముచేత అలభ్య మొనర్చిన దని భా. ఇట ఇతరులను వంచించి తనకార్యమును నెఱవేర్చుకొనునేర్పును వాక్కుచేఁ జూపక గొడ్డటిని నీట వైచుట యనుక్రియచేతఁ జూపినది గావున నాయిక క్రియావిదగ్ధ.

లక్షితా యథా.

యదు ద్భూతం త దుద్భూతం,
యదు ద్భూయాత్ త దపి వా భూయాత్,
యదు ద్భవతి త ద్భవతు వా,
విఫల స్తవ కోఽపి గోపనాయాసః. ౨౫.

జరిగిన జారరతము జరుగనే జరిగినది, అందుకై యేమి కానున్నను సహింపవలసినదే. ఏజారరతము ఇప్పుడు జరుగుచున్నదో (ఒకరికి భయపడి) దానిని మానుకోనేల ? నీ వెంతకష్టపడి దాఁచినను నీజారసంపర్కము నాకు తెలియనే తెలిసినది. దీని గుట్టును సఖి కనిపట్టినందున ఇది లక్షిత.

కులటా యథా.

ఏతే వారికణా న్కిర న్తి పురుషా న్వర్ష న్తి నామ్భోధరాః,
శైలాః శాద్వల ముద్వమ న్తి న పున ర్నాయకా న్సృజన్త్యేతే,
త్రైలోక్యే తరవః ఫలాని సువతే నై వారభ న్తే విటా న్,
ధాతః కాతర మాలపామి, కులటా హేతో స్త్వయా కిం కృతమ్.

చెడిప బ్రహ్మతో మొఱ్ఱపెట్టుకొనుచున్నది.—(హే) ధాతః = ఓ బ్రహ్మదేవుఁడా, ఏతే అమ్భోధరాః వారి కణా న్కిర న్తి పురుషా న వర్ష న్తి = ఈ మేఘములు నీటి చినుకులను రాల్చుచున్నవి (గాని) (చినుకులకు మాఱుగా అచినుకు లెన్ని

యో అందఱను) మగవాండ్రను కురియవు, ఏతే శైలాః శాద్వలమ్ ఉద్వమన్తి నాయకాన్ పునః న సృజన్తి = ఈ కొండలు గఱికబీళ్లను వెడలఁగ్రక్కుచున్నవి (ఆగఱికపోఁచలకు బదులు అ వెన్నియో అందఱను) నాయకుల నన్నసూ పుట్టింపవు, త్రైలోక్యే తరవః ఫలాని సువతే విటాన్ న ఆరభన్తే ఏవ = (అయ్యో) ముజ్జగమందును చెట్లు కాయలను ఈనుచున్నవిగాని (ఆకాయలకు బదులుగా ఆకాయ లెన్నియో అందఱను) అంకుమగలను ఈన వాయెను, కృపణమ్ ఆలపామి = దీనముగా మొఱపెట్టుకొనుచున్నాను; (చెప్పుము మఱీ), త్వయా కులటా హేతోః కిం కృతమ్ = నీవు కులటల నిమిత్తము ఏమి చేసితివి (ఏమియు చేయవైతి వనుట). నీకు కులటలపై జాలియేని ఈమేఘాదులు వర్షబింద్వాదికమునకు బదులుగా తత్తత్సమసంఖ్యగా మిండగాండ్రను ఈనునట్లు చేయుదువు, జాలి లేనందున అట్లు చేయవైతివి, అని తాత్పర్యము). బహువిటసురతాభిలాషను తెల్పుటచేత నాయిక కులట.

## అనుశయాన.

వర్తమానస్థానవిఘటనేన, భావిస్థానాభావశఙ్కయా, స్వానధిష్ఠితసఙ్కేతస్థలం ప్రతి భర్తుర్గమనానుమానేన చ, అనుశయనా త్రివిధా.

తత్కాలపుసంకేతస్థానమునకు భంగము కల్గుటచేతను, భవిష్యత్కాలమున సంకేతస్థానము దొరక దనుభయముచేతను, సంకేతస్థలమునకు తాను పోక భర్తమాత్రము పోయె ననునూహచేతను, అనుశయాన (= పశ్చాత్తాపపడునది) ముత్తెఱఁగులు అగును.

వర్తమానస్థానవిఘటనేన అనుశయానా యథా.

సముపాగతవతి చైత్రే,
విగళతి పత్త్రే లవఙ్గలతికాయాః,
సుదృశః కపోల పాళీ
శివ శివ! తాళీ దళ ద్యుతిం లేభే. ౨౮.

చైత్రే సముపాగతవతి (సతి) = చైత్రమాసము రాఁగా (వసంతావతారము కాఁగా), లవఙ్గలతికాయాః పత్త్రే (జాత్యేకవచనము) విగళతి (సతి) = లవంగపుఁదీఁగ (యింటి) యొక్క ఆకులు రాలిపోవు చుండఁగా (లవంగకుంజము సంకేతస్థలము, ఆకులు రాలిపోవుటచేత అది బయలై సంకేతానర్హ మాయెను. కావున), సుదృశః... లేభే = సుందరియొక్క చెక్కిళ్ల ప్రదేశము అయ్యో పాపము! తాటి యాకు వన్నెను పొందెను (ఉన్న సంకేతము భగ్నమాయె ననుదుఃఖముచేత వెలవెలంబాఱె నని భా. శివశివ యనుట తాళీదళమును చెప్పుట చేత పాంపు తఱఁగె నని భా.)

భావిస్థానాభావశఙ్కయాఽనుశయానా యథా.

నిద్రాళు కేకి మిథునాని కపోత పోత
వ్యాధూత నూతన మహీరుహ పల్లవాని
తత్రాఽపి తన్వి న వనాని కియన్తి సన్తి?
ఖిద్యస్వ మా ప్రియతమస్య గృహం ప్రయాహి. ౨౮.

పుట్టినింటనే యుండి జారసురతముల నోలలాడుచున్నదై భర్తయింటికి పోనొల్లనినాయికతో సఖి చెప్పుచున్నది.—(హే) తన్వి ప్రియతమస్య గృహం ప్రయాహి మా ఖిద్యస్వ = (ఓ) చెలువా (నీ) ప్రియతముని యింటికి పొమ్ము ఖేదపడకు; తత్రాపి = అచ్చటసయితము, నిద్రా...నాని = నిద్రించుచుండు నెమలి జంటలుగలవియు, కపో...వాని = పావురపు శిశువులచేత మిక్కిలి కదపఁబడిన క్రొత్త వృక్షంపుఁ జిగుళ్లుగలవియు, (అయిన), వనాని కియన్తి న సన్తి = అడవులు ఎన్ని లేవు? (అనేకములు గలవని భా.) సఖీ, వగవక పతియింటికి పొమ్ము, ఈజారుఁ డటకే వచ్చును. అటను సంకేతార్హము లయినవనప్రదేశములు కలవు; అం దతనిం గూడ వచ్చును. పైగా భర్తయింట తాంబూలగంధమాల్యాద్యనుభవమునకును జారునిచే గర్భ మయినచో దానికిని ఆక్షేప ముండదు.—అని తాత్పర్యము.

'ప్రయాహి' - అనుటచే నీవు పోవుచోటికి నీజారుఁడు వచ్చు నని భా. ప్రియతముఁడు కానిపతిని 'ప్రియతముఁ డ'నుట జారానురక్త యనుగుట్టు బయటఁబడకుండుటకు. 'నిద్రాళు'-అనుట ఆతావుల జనసంచార ముండదు గాన నవి సంకేతార్హము లని తెలుపుటకు. 'మిథునములను' చెప్పుటచే దర్శనీయవస్తుయుక్తము లనియు, మిథునకర్మోచితస్థలము లనియు, నీవును జారునితో నచట సుఖింపవచ్చు ననియు, భా. 'కపోతములను' చెప్పుటచేత మణితధ్వనిసదృశధ్వని సేయుకపోతములు మణితములకై యుత్సాహము పుట్టించు ననియు, నీ వచట రతులం దేలుసమయమందు ఎవరేని ఒకవేళ ఆచెంతకు వచ్చినను పావురములగుబాళింపులో నీమణితములను వివేచింప నేరనందున నీయునికి నూహింప రనియు, భా. నాయికయొక్క భావిసంకేతస్థానాభావశంక సఖి పల్కినయీయుపదేశముచే తెలియుచున్నది.

తృతీయా యథా.

కర్ణ కల్పిత రసాల మఞ్జరీ
పిఞ్జరీకృత కపోల మణ్డలః
నిష్పతన్నయనవారి ధారయా
రాధయా మురరిపు ర్నిరీక్ష్యతే. ౨౯.

నిష్ప...రాధయా = ఉరలుచున్న కన్నీళ్ల ధారలుగలదైన రాధచేత, కర్ణ ...ణ్డలః = చెవియందుఁ దాల్పఁబడిన తీయమావి పూగుత్తిచేత ఎఱుపుపసుపువన్నెగల దిగాఁజేయఁబడిన చెక్కిలియొక్క ప్రదేశముగలవాఁడైన, మురరిపుః = మురాసుర సంహర్త (శ్రీకృష్ణుఁడు), నిరీక్ష్యతే = చూడఁబడుచున్నాఁడు. రాధకు శ్రీకృష్ణులవారి చెవియందలిరసాలమంజరిం గనఁగానే ధారలు ధారలుగా కన్నీ రుప్పతిల్లె నని యర్థము. రసాలతలము సంకేతస్థానము. రసాలమంజరిం గనఁగానే రాధకు శ్రీకృష్ణులవారు ఆసంకేతస్థానమునకు తనకై పోయి యట చిరము వేచి తా నెప్పటిని రానందున తా నటకుపోయినందులకు గుర్తుగా ఆరసాలంపుమంజరిని చెవిని ధరించి వచ్చినార ) తెలిసి 'అయ్యో నే నటకు పోక చెడితిని గదా' అని దుఃఖమాయె నని భా. సంకేతస్థలమునకు జారుఁడు పోయియు తాను పోనందులకు దుఃఖించుచున్నది గావున నిట రాధ మూఁడవ యనుశయాన.

ముదితా యథా.

గోష్ఠేషు తిష్ఠతి పతి, ర్బధిరా ననాన్దా,
నేత్రద్వయస్య చ న పాటవ మస్తి యాతుః;
ఇత్థం నిశమ్య తరుణీ కుచకుమ్భసీమ్ని
రోమాఞ్చకఞ్చుక ముదఞ్చిత మాతతాన. 30.

రాత్రి శయనించుటకు వచ్చినబాటసారితో సఖి చెప్పినమాటకు నాయిక హర్షించుట.—పతిః గోష్ఠేషు తిష్ఠతి = ఈయింటియాయన పసులకొట్టములలో ఉండును (పరుండును), ననాన్దా బధిరా = (ఇంటియామెయొక్క) ఆఁడుఁబిడ్డ చెవిటిది, యాతుః నేత్రద్వయస్య పాటవం నాస్తి = (ఇంటియామెయొక్క) తోడికోడలి కనుదోయికి బలము లేదు (రెండుకనులును నిష్ప్రయోజనములు అనుట.);—(ఈయింటిభామతో నీవు నిరాటంకముగా రాత్రి కామకేళిం దేలవచ్చును, గావున నిటనే నిలువుము అని భా.); ఇత్థం నిశమ్య = ఇట్లు (సఖి బాటసారితో పల్కినమాటను) విని, తరుణీ = (ఇంటి) జవ్వని, కుచ కుమ్భ సీమ్ని ఉదఞ్చితం రోమాఞ్చ కఞ్చుకమ్ ఆతతాన = చను గిండుల ప్రదేశమందు నిగిడినట్టి పులకల మైమఱువును తాల్చెను. (చెలి బాటసారిని నిలిపి తనకు కామకేళి సమకూర్చినని, అనుహార్షముచేతను, రాత్రి జారరతమందు కు తములకుం గలుగఁగల మోహనవ్యాపారవిశేషస్మరణచేతను, నాయిక కుచకుంభములందంతటను గగుర్పాటు పొందిన దాయెను. ఇట రోమాంచము ఇతర మైనమదనవికారములకు ఉపలక్షకము.) ఇష్టప్రాప్తిచే సంతసిల్లుచున్నది గావున నాయిక ముదిత.

కన్యా యథా.

కిఞ్చిత్ కుఞ్చిత హార యష్టి, సరళ భ్రూ వల్లి, సాచి స్మితం,
ప్రాన్త భ్రాన్త విలోచన ద్యుతి, భుజా పర్యస్త కర్ణోత్పలమ్,
అఙ్గుళ్యా స్ఫురదఙ్గుళీయకరుచా కర్ణస్య కణ్డూయనం
కుర్వాణా నృపకన్యకా సుకృతినం సవ్యాజ మాలోకతే. ౩౧.

నృప కన్యకా = (ఒకానొక) రాజ కన్య, కిఞ్చి...ష్టి = ఇంచుకంత వంప యిన ముత్తెపుఁబేరుయొక్క పేటలుగలుగునట్లుగాను, సర...ల్లి = ఋజువైన (వంపులేని) బొమ తీఁగ గలుగునట్లుగాను, సాచి స్మితమ్ = అడ్డముగాఁ బ్రసరించిన చిఱు నగవు గలుగునట్లుగాను, ప్రాన్త...ద్యుతి = అపాంగములందు చలించుచున్న నేత్ర కాంతులు గలుగునట్లుగాను, భుజా...త్పలమ్ = బుజముమీఁద పడిన చెవికలువ గలుగు నట్లుగాను, స్ఫురత్ అఙ్గుళీయక రుచా అఙ్గుళ్యా = మెఱయుచున్న ఉంగరపుఁ గాంతులుగలదైన వ్రేలితో, కర్ణస్య కణ్డూయనం కుర్వాణా = చెవియొక్క గోఁకు కొనుటను చేసికొనుచున్నదై, సుకృతినమ్ = (ఒకానొక) పుణ్యవంతుని, సవ్యాజమ్ = మిషతో (వేఱేమో చూచుచున్నట్లు నటించుచు), ఆలోకతే = చూచుచున్నది.

'కుంచనము'—ఒక వైపునకు మెడను కర్ణకండూయనార్థము వంచుటచేత. 'సరళత' - ఆకూత మేమియుం దెలుపఁగోరమిచేత. 'స్మితము' - వదనశోభార్థంబును సంతుష్టిచేతను. 'సాచి' - ప్రక్కవాటుగా నవ్వుట ఒయ్యారముచేతను ఏకకర్ణకండూయనముచేతను. హసితము గాక 'స్మిత మ'గుట - ఆభిజాత్యముచేత. 'ప్రాన్తభ్రాన్త'-కటాక్షవీక్షణముచేత. 'కటాక్ష మ'గుట మదనప్రేరణ యున్నందున. 'పర్యస్త' - కలువ రాలుట ఒకప్రక్కకు మెడను వంచినందున. 'కర్ణస్య' - ఏకవచనముచేత ఒక చెవికే అని తెలియుచున్నది. 'కన్య' యనుటచే అవివాహిత పిత్రధీన అని తెలియుచున్నది.

ఇతి పరకీయానిరూపణమ్.

## సా మా న్యా ని రూ ప ణ మ్.

విత్తమాత్రోపాధికసకలపురుషానురాగా సామాన్యవనితా. నన్వగ్నిమిత్రే క్షితిపతా వనురక్తాయా మిరావత్యా మవ్యాప్తిః, తత్ర విత్తమాత్రోపాధేరభావా దితిచే న్నైవమ్; సాఽపి కాశ్మీరహీరాదిదాతరి మహారాజే ఽనురక్తా న తు మహార్హా! తె

## నాఽవగమ్యతే విత్తమాత్రోపాధి రితి.

ధనము మాత్రమే నిమిత్తముగా సకలపురుషులయందును ప్రేమగలది (అనఁగా కులపువలనఁ గాక ధనముకై వీఁడు వాఁ డనక ఎవని నేనియు ప్రేమించునది) సామాన్య స్త్రీ. 'ఓయి, అగ్నిమిత్రరాజునందు అనురక్త యయినయిరావతికి (ఈలక్షణము) పట్టదు; (ఏల యన) ఇరావతియందు విత్తమాత్ర మనెడునిమిత్తము లేదు గావున.' - అని వాద మేని ఆవాదము సరి గాదు; ఇరావతియు కుంకుమపుష్పశయ్యాదులను ఇచ్చువాఁ డయినమహారాజును ప్రేమించినదిగాని మహర్షిని గాదు. దానింబట్టి యెఱుఁగ నగును ధనముమాత్రమే నిమిత్తముగాఁగలది యని.

### సామాన్యకు ఉదా.

దృష్ట్వా ప్రాఙ్గణసన్నిధౌ బహుధనం దాతార మభ్యాగతం
వక్షోజౌ తనుతః పరస్పరహితాశ్లేషం కురఙ్గీదృశః;
ఆనన్దాశ్రుపయాంసి ముఞ్చతి ముహు ర్మాలామిషాత్ కున్తలో;
దృష్టిః కించ ధనాగమం కథయితుం కర్ణాన్తికం గచ్ఛతి. 32.

కవివాక్యము.—ప్రాఙ్గణ సీమ్ని అభ్యాగతం బహుధనం దాతారం దృష్ట్వా = ముంగిటి ప్రదేశమందు వచ్చియున్న వానిని (కాముకుని) బహుధన మిచ్చువానిని కాంచి, కురఙ్గీ దృశః వక్షోజౌ పరస్పర హిత ఆశ్లేషం తనుతః = లేఁడులేడి కన్నులవంటికన్నులుగలదానియొక్క (సుందరియొక్క) పాలిండ్లు (మనకు ఇతఁడు హారాదుల నిచ్చును అని) ఒకదానికొకటి ప్రేమపూర్వకమయిన కవుంగిలింతను చేయుచున్నవి (సంతోషముచే ఒడలెల్ల నుప్పొంగుటచే కుచములును ఉప్పొంగి క్రిక్కిఱిసిన వనిభా.); కున్తలః ముహుః మాలా మిషాత్ ఆనన్ద అశ్రు పయాంసి ముఞ్చతి = తలకట్టు (తనకు సూర్యుఁడు చంద్రుఁడు పాపటబిందిరీలు లోనగులొడవుల నతఁ డిచ్చు నని) మాటిమాటికి పువ్వులసరము నెపమున సంతోషపుఁ గన్నీళను విడుచుచున్నది (అతనిరాకకు ముద మొంది శిరఃకంపములు సేయఁగా తుఱుమునుండి పూసరములు రాలె నని భా.); కిం చ దృష్టిః ధన ఆగమం కథయితుం కర్ణ అన్తికం గచ్ఛతి = మఱి యు చూపు ధనముయొక్క రాకను (ఇతఁడు నీకు రత్నకుండలాదికముల నిచ్చునులే అని) చెప్పుటకు చెవియొక్క సమీపమునకు పోవుచున్నది. (ఆవేశ్య ఆకర్ణాంతవిశాలలోచన యనియు, వీనులకు సోఁకుచున్న కటాక్షవీక్షణముల నతనిం గాంచుచున్న దనియు, భా.) ఇట నాయకుని సొబగుకై ప్రేమింపక ధనమాత్రముకై ప్రేమించుచున్నది గావున నాయిక సామాన్య.

## ప్రకారాంతరమున నాయికాభేదములు.

ఏతాః పున రన్యసమ్భోగదుఃఖితా, వక్రోక్తిగర్వితా, మానవ
త్యశ్చేతి తిస్రో భవన్తి.

స్వకీయాపరకీయాసామాన్య లనెడియీనాయికలు వెండియు అన్యసంభోగదుః
ఖిత వక్రోక్తిగర్విత, మానవతులు నని (ఒక్కొక్కతెయు) ముగ్గు రగుచున్నారు.

అన్యసంభోగదుఃఖితా యథా.

(అన్యస్త్రీతో తననాయకుఁడు సంభోగించినందుకై వగచుదానికి ఉదా.)

త్వం దూతి నిరగాః కుఞ్జం, న తు పాపీయసో గృహమ్;
కింశుకాభరణం దేహే దృశ్యతే కథ మన్యథా? 33.

నాయకునిఁ దెచ్చుటకుఁ బోయి యతనితో సంభోగము పొంది వచ్చినదూతిని
నాయిక సంభోగచిహ్నములచేతఁ గనిపట్టి మర్మోద్ఘాటనము చేయుట.— దూతి
త్వం కుఞ్జం నిరగాః పాపీయసో గృహం తు న = (ఓసి) దూతీ నీవు పొదరింటికి పో
యితివి (గాని) (ఆ) పాపాత్ముని యింటి కన్ననో కాదు, అన్యథా దేహే కింశుకాభ
రణం కథం దృశ్యతే = అట్లుగానిచో (పొదరింటికి పోక వానియింటికే నీవు పోయితి
వేని) (నీ) మేనియందు మోదుగుఁబువ్వనెడి యలంకారము ఎట్లు అగపడును? (పొద
రింటిమోదుగుఁబువ్వులు నీపై రాలియుంటయే ఇందులకు నిదర్శన మని యర్థము). 'పాపీ
యసుఁ డ'నుటచే నాయిక నయిననన్ను విడనాడి దూతిని నిన్నుఁ బొందినట్టియధముఁ
డని భా. మోదుగుఁబువ్వు వంకరగా నఖక్షతమువలె నుండును గావున కింశుకాభ
రణ మనఁగా నఖక్షతము,—కావున 'దూతీ నీవు వానిం బొంది వచ్చితివి, కా దేని
నీచనుఁగొండలయందు ఈనఖక్షతములెట్లు గలిగెను?' అని లోపలియభిప్రాయము.

వక్రోక్తిగర్వితా - ప్రేమగర్వితా, సౌన్దర్యగర్వితా, చేతి ద్వివిధా.

వక్రోక్తిగర్విత యిరుదెఱఁగులు, ప్రేమగర్విత సౌందర్యగర్వితయు నని. (ప్రేమ
గర్విత యన భర్తకు తనయందుఁ గలప్రేమచే గర్వపడునట్టినాయిక.)

ప్రేమగర్వితా యథా.

వపుషి తవ తనోతి రత్నభూషాం
ప్రభు రితి ధన్యత మాఽసి; కిం బ్రవీమి?
సఖి తనునయనాన్తరాళభీరుః
కలయతి మే న విభూషణాని కాన్తః. 34.

(హే) సఖి ప్రభుః తవ వపుషి రత్నభూషాం తనోతి ఇతి ధన్యతమా అసి= (ఓ) చెలీ (నీ నాయకుఁడు నీదేహమందు మణిభూషణములను పెట్టును (మణిభూషణములతో నీమేనిని స్వయముగానే అలంకరించును) అనుహేతువుచేత కృతార్థురాలవు అగుచున్నావు, కిం బ్రవీమి=(నీయదృష్టము) ఏమి చెప్పుదును, (నాకేమో అట్టిపుణ్యము లేదు, ఏలన,) మే కాన్తః తను నయన అన్తరాళ భీరుః (సన్) విభూషణాని న కలయతి = నా వల్లభుఁడు (నా) మేనియొక్కయు (తన) కన్నులయొక్కయు (నామేనికిని తనచూపులకును నడిమి) యెడమునకు (చాటునకు) వెఱచిన వాఁడై (- చాటును సహింపలేక, అనఁగా - అలంకారములు అడ్డపడినంతమేర నామేనిదర్శనము తనకు లేకపోవు ననుభయముచేత) అలంకారములను (నామేన) తొడుగఁడు. ఇట వక్త్రి తననాయకునికి తనయందుఁ గల ప్రేమ (శ్రోత్రియందుఁ తదీయనాయకునికిఁ గల ప్రేమకంటె) అత్యంతాధిక మని గర్వపడి ఆగర్వమును వక్రోక్తిగా తెలిపెను గావున ఈవక్త్రి ప్రేమగర్వితా. ప్రభు వనుటచేత సామాన్య యని తెలియుచున్నది.

సౌన్దర్యగర్వితా యథా.

కలయతి కమలోపమాన మక్ష్ణోః,
ప్రథయతి వాచి సుధారసస్య సామ్యమ్,
సఖి కథయ కి మాచరామి కాన్తే?
సమజని తత్ర సహిష్ణు తైవ దోషః. 39.

సఖి = చెలీ, (కాన్తః = నావల్లభుఁడు), అక్ష్ణోః కమల ఉపమానం కలయతి = (నా) కన్నులకు తామరల సాటిని చెప్పును, వాచి సుధా రసస్య సామ్యం ప్రథయతి =(నా) వాక్కునందు అమృత రసముయొక్క సాటిని ప్రకటించును, తత్ర కాన్తె కిమ్ ఆచరామి కథయ = అట్టి (ఆవిధముగా నాకు నీచసామ్యములను గట్టెడు) వల్లభునివిషయమందు ఏమి (ప్రతీకారము) సేయుదును చెప్పుము. ఇట సాటి లేని తననేత్ర వచనములకు కమలసుధారససామ్యవర్ణనమును ఓర్వమిచేత నాయికయొక్క సౌందర్య గర్వము తెలియవచ్చుచున్నది.

## మానవతీభేదములు.

ప్రియాపరాధసూచికా చేష్టా మానః. స చ లఘు, ర్మధ్యమో, గురు శ్చ. అల్పాపనేయో లఘుః, కష్టాపనేయో మధ్యమః, కష్టతరాపనేయో గురుః. అసాధ్య స్తు రసాభాస ఏవ. అన్యస్త్రీదర్శనాదిజన్మా లఘుః, గోత్రస్ఖలనాదిజన్మా మధ్యమః, అపరస్త్రీసంగమజన్మా గురుః. అన్యథాసిద్ధ కుతూహలా ద్యపనేయో ల

ఘుః, అన్యథావాద శపథా ద్యపనేయో మధ్యమః, చరణపాత
భూషణా ద్యపనేయో గురుః.

ప్రియునితప్పిదమును సూచించునట్టి చేష్ట (అనఁగా - తనప్రియుఁడు తనయెడల నొనర్చినతప్పిదమును సూచించునట్టితనచేష్ట) మానము (= అలుక) (అనంబడును); అది యు లఘువు, మధ్యమము, గురువు (అని ముత్తెఱఁగులు). (అందు) కొంచెపాటియత్న ముచేతనే తీర్పశక్య మగునది లఘువు, కష్టయత్నముచే తీర్పశక్యమగునది మధ్యమము, కష్టతరయత్నముచే తీర్పశక్యమగునది గురువు. అసాధ్య మగునది రసాభాసమే. అన్యస్త్రీని చూచుట లోనగుకారణములవలనఁ బుట్టునది లఘువు, పొరఁబాటున వేఱొకతె పేర తన్నుఁ బిలుచుట లోనగుకారణములవలనఁ బుట్టునది మధ్యమము, అన్యస్త్రీసంగ మము లోనగుకారణములవలనఁ బుట్టునది గురువు. వేఱువిషయములందు కుతూహలము పుట్టించుటచేతఁ దీర్ప శక్య మగునది లఘువు, (గడుసుగా) బొంకుట ఒట్లుపెట్టుకొనుట లోనగుఉపాయములచేత తీర్పశక్య మగునది మధ్యమము, పాదములకుఁ బ్రణమిల్లుట భూషణాదికము లిచ్చుట లోనగునుపాయములచేత తీర్పశక్యమగునది గురువు. [మాన భేదములచే మానవతీభేదముల నెఱుంగ నగు.]

లఘుమానకు ఉదా.

స్వేదామ్బుభిః క్వచన పిచ్ఛిల మఙ్గ మేత,
చ్ఛాతోదరి క్వచన కణ్టకితం చకాస్తి,
అన్యాం విలోకయతి భూషయతి ప్రియేఽపి
మానః క్వ ధాస్యతి పదం తవ త న్న విద్మః. ౩౬.

సఖీవాక్యము.—శాతోదరి = సన్ననినడుముగలదానా, ప్రియే అన్యాం విలోకయ త్యపి భూషయ త్యపి = (నీ) ప్రియుఁడు వెఱొకతెను చూచుచున్నను అలంకరించుచున్నను, (అతనిం జూచినమాత్రాననే), ఏతత్ తవ అఙ్గమ్= ఈ నీ యొడలు, క్వచన స్వేదామ్బుభిః పిచ్ఛిలమ్ (సత్) చకాస్తి = కొన్నిచోట్ల చెమటనీళ్ళచేత దట్టము (జారుడు) (ఐ) ప్రకాశించుచున్నది, క్వచన కణ్టకితం (సత్) చకాస్తి = కొన్నిచోట్ల గగుర్పాటు కలది (ముండ్లుకలది) (ఐ) ప్రకాశించుచున్నది. (ఇట్లుండఁగా), మానః క్వ పదం ధాస్యతి తత్ న విద్మః = అలుక (నీదేహమందు) ఎచ్చోట అడుగు ఇడునో దాని నెఱుంగము. అడుగును ఒకచోట నిడిన జారును, ఇంకొకచోట నిడిన ముండ్లు గ్రుచ్చుకొనును, కావున మానమునకు నీయందు దడుగిడ వలనుపడదు అని యర్థము; ప్రియుఁడు నీయెదుటనే త ప్పొనర్చుచున్నను అందులకైనయలుకను తల యెత్తనీయనంతయత్యంతానురక్తి నీకు అతనిపైఁ గలదని భా. చెమరును పులకలును ప్రియునిఁ గన్న హర్షముచేతఁ గలిగినవి; అలుక అన్యను ప్రియుఁడు గౌరవించుటచేతఁ గలిగినది. అందు హర్షముచే అలుక తొలఁగెను గావున ఈమానవతి లఘుమాన.

మధ్యమమానకు ఉదా.

యద్గోత్రస్ఖలనం తత్ర భ్రమో; యది న మన్యసే,
రోమాళి వ్యాళ సంస్పర్శ శపథం తన్వి కారయ. 3౭.

నాయికకు నాయకుఁడు అలుక దీర్చుట.—తన్వి = సుందరీ, గోత్రస్ఖలనమ్ - గోత్ర = పేరియందు (పేరుపెట్టి పిలుచుటలో) - స్ఖలనమ్ = తప్పుట (దానిపేర నిన్నుఁ బిలుచుట), యత్ = ఏది (సంభవించినదో), తత్ర = అవిషయమందు, భ్రమః = (నా) పొరఁబాటు (కారణము), (పొరఁబాటుచే దానిపేర నిన్నుఁ బిలిచితినే గాని దానియందలియనురాగమువలనఁ గా దని భా.); న మన్యసే యది = నమ్మవేని, రోమా...థమ్ = నూగారనెడి పాముయొక్క (పామును) తాఁకుటయనెడి దివ్యప్రమాణమును, కారయ = (నాచేత) చేయింపుము. దివ్యప్రమాణములు తప్పమోపఁబడినవాఁడు తనమీఁద తప్పు లే దని నిరూపించుటకై చేయునట్టి కొన్ని కృత్యములు: ఎఱ్ఱగాఁ గాలినయినుపగుండు చేతఁగొనుట, కుండలో నుంచిన త్రాచును చేతఁ గొనుట, లోనగునవి. అందు నూగారు (పాము) ను తాఁకుట యనుదివ్యముచేత నాయకుఁడు తనని రపరాధతను నిరూపించెడిని. మాటకే యలుక తీరెను గాన మధ్యమమాన.

గురుమానకు ఉదా.

దయితస్య నిరీక్ష్య ఫాలదేశం
చరణాలక్తకపిఞ్జరం సపత్న్యాః
సుదృశో నయనస్య కోణభాసా
శ్రుతిముక్తాః శిఖరోపమా బభూవుః. 3౮.

సపత్న్యాః చరణ అలక్తక పిఞ్జరం దయితస్య ఫాల దేశం నిరీక్ష్య = సవతియొక్క కాలి లత్తుకచేత ఎఱ్ఱనయిన వల్లభుని నొసటి ప్రదేశమును చూచి (చూచుటచేత) (సవతికి అలుక తీర్చుటకై నాయకుఁడు ప్రణమిల్లఁగా ఆయడుగులలత్తుక అతనినొసట నంటుకొనియె నని భావము), (అట్లతఁడు సవతిపాదములకుఁ బ్రణమిల్లినమహాపరాధము నకై), సుదృశః నయనస్య కోణ భాసా = మంచిచూపులుగలయింతియొక్క (ప్రస్తుత నాయికయొక్క) కంటి కొనయొక్క కాంతిచేత, శ్రుతి ముక్తాః శిఖర ఉపమాః బభూవుః = (ఆమె) చెవియందలి ముత్తెములు పద్మరాగమణి సాటిగాఁగలవి (కెంపులవలె నెఱ్ఱనివి) ఆయెను. కనుఁగొనలు కోపముచే ఎఱుపెక్కిన వని భా. అలుక గొప్పది గాన గురుమాన.

ఇతి ప్రథమప్రకరణమ్.

## నాయికాభేదములు.

[రసమంజరీమతము.]

నాయికలు 26.




[ప్రాచీనమతము.]

నాయికలు 16.



## ద్వితీయప్రకరణమ్.

### అష్టవిధనాయికానిరూపణమ్.

ఏతాః షోడ శా ప్యష్టాభి రవస్థాభిః ప్రత్యేక మష్టవిధాః.— ప్రోషితభర్తృకా, ఖణ్డితా, కలహాన్తరితా, విప్రలబ్ధా, ఉత్కణ్ఠితా, వాసకసజ్జా, స్వాధీనపతికా, అభిసారికా, చేతి; గణనా దష్టావింశత్యధికశతం భవన్తి. తాసా మ ప్యుత్తమమధ్యమాధమభేదగణనయా చతురధికాశీతియుతశతత్రయం భేదా భవన్తి.

(ప్రాచీనమతానుసారముగాఁ జెప్పఁబడిన) యీ (16) పదునాఱుగురు నాయికలును (8) ఎనిమిదేసిదశావిశేషములచేత ఒక్కొక్కతెయు (8) ఎనిమిదివిధములు (అగుదురు):—ప్రోషితభర్తృక, ఖండిత, కలహాంతరిత, విప్రలబ్ధ, ఉత్కంఠిత, వాసకసజ్జ, స్వాధీనపతిక, అభిసారికయు, నని; లెక్కింపఁగా (128) నూటయిరువదియెనమండుగురు అగుదురు. వారికి వెండియు ఉత్తమ, మధ్యమ, అధమ, అనుభేదములను లెక్కించినచో (384) మున్నూటయెనుబదినాలుగు భేదము లేర్పడును.

య త్త్వేతాసాం దివ్యాదివ్యోభయభేదగణనయా ద్విపఞ్చాశదధిక శతయుత సహస్ర భేదా భవన్తి: దివ్యా ఇన్ద్రాణ్యాదయః అదివ్యా మాలత్యాదయః, దివ్యాదివ్యాః సీతాదయ ఇతి; - త న్న. అవస్థాభేదే నైవ నాయికాభేదాత్. జాతిభేదేన భేదస్వీకారే నాయికానామివ నాయకానా మ ప్యానన్త్యం స్యాత్: ఇన్ద్రాదయో దివ్యాః, అదివ్యా మానవాః, దివ్యాదివ్యా అర్జునాదయ ఇతి.

మఱి వీరికి దివ్య, అదివ్య, దివ్యాదివ్య అనుభేదములను లెక్కించినయెడల (1152) వేయిన్ని నూట యేఁబది రెండు భేదము లగు (ననియు), దివ్యలు శచ్యాదులు, అదివ్యలు మాలత్యాదులు, దివ్యాదివ్యలు సీతాదులు, అని (యు) చెప్పుట సరిగాదు. (ఏల యనఁ) అవస్థాభేదముచేతమాత్రమే నాయికాభేదము గావున. జాతిభేదముచేత భేదముల నంగీకరింతు మేని నాయికలకుంబోలె నాయకులకును అనంతభేదములు కలుగును: ఇంద్రాదులు దివ్యులు, మనుష్యులు అదివ్యులు, అర్జునాదులు దివ్యాదివ్యులు - అని.

యద్యపి ముగ్ధాయా ధీరాదిభేదాభావః తథావిధప్రజ్ఞాసామగ్ర్యభావాత్, తథాష్టవిధత్వాభావోఽపి భవితుమర్హతి, తథాపి ప్రాచీనలేఖనానురోధేన నవోఢామప్యాలమ్బ్యైతే భేదా అవగన్తవ్యాః.

మఱియు ముగ్ధకు ధీరాదిభేదములు లేవు, అందులకు వలయుప్రజ్ఞాసామగ్రి లేనందున; కావున ముగ్ధకు అష్టవిధత్వమునైతము చెప్పఁదగదు.—అయినను తొంటివ్రాఁతలను బట్టి నవోఢనుం గూడ చేర్చి యీభేదము లెఱుంగఁదగినవి.

## ప్రోషితభర్తృక.

దేశాన్తరగతే భర్తరి సంతాపవ్యాకులా ప్రోషితభర్తృకా. ఉత్కా- కలహాన్తరితా విప్రలబ్ధానాం పతిర్దేశాన్తరగతో న భవతీతి న తత్రాతివ్యాప్తిః. అస్యాశ్చేష్టా దశావస్థాః.

పతి దేశాంతరమునకుఁ బోఁగా (విరహ) తాపముచే తల్లడిల్లునది ప్రోషితభర్తృక (యనఁబడును); (ప్రోషిత = దేశాంతరమునకుఁ బోయిన - భర్తృకా = పతిగలది - అని యవయవార్థము). ఉత్కంఠితా కలహాంతరితా విప్రలబ్ధల భర్త దేశాంతరగతుఁడు కావందున వారికి ఈ (చెప్పఁబడినప్రోషితభర్తృకా) లక్షణము చెల్లదు. ప్రోషితభర్తృకయొక్క చేష్టలు దశావస్థలు.

ముగ్ధా ప్రోషితభర్తృకా యథా.

దుఃఖం దీర్ఘతరం వహత్యపి సఖీవర్గాయ నో భాషతే;
శైవాలైః శయనం సృజత్యపి పునః శేతే న వా లజ్జయా;
కణ్ఠే గద్గదవాచమఞ్చతి, దృశా ధత్తే న బాష్పోదకం;
సన్తాపం సహతే యదమ్బుజముఖీ తద్వేద చేతోభవః. ౩౯

అమ్బుజ ముఖీ = తామరవంటి మొగముగలది (నాయిక) (భర్త దేశాంతరము పోయినందులకు), దీర్ఘతరం దుఃఖం వహతి = అధికమయిన శోకమును తాల్చును, (తథా) అపి = అయినను, (లజ్జయా = సిగ్గుచే), సఖీ వర్గాయ నో భాషతే = చెలుల సమూహమునకు చెప్పదు; శైవాలైః శయనం సృజతి = నాఁచుతో పాన్పు చేయును, తథాపి పునః లజ్జయా=అయినను మఱి సిగ్గుచేత, న వా శేతే = పరుండదు; కణ్ఠే గద్గద వాచమ్ అఞ్చతి = గొంతులో గద్గద స్వరమును పొందుచున్నది, (ఐనను సిగ్గుచే), దృశా బాష్ప ఉదకం న ధత్తే=కంట కన్నీళ్ళను దాల్పదు; సంతాపం యత్ సహతే.

=విరహతాపమును ఏవిధమున భరించుచున్నదో, తత్ చేతోభవః వేద = అవిధమును మదనుఁడు (మాత్రమే) ఎఱుఁగును. తనదుఃఖమును తెయ్యంపుఁజెలులతో చెప్పకొనుట, నాఁచుఁబానుపునం బరుండుట, కన్నీళ్ళువిడుచుచు నేడ్చుటయు, అనుమన్మథతాపకార్యములను లజ్జ యణఁచినది గావున, ఈనాయిక (లజ్జావిజితమన్మథ) ముగ్ధ. శైవాలశయనముచేత భర్తృవిరహమును భర్తృనురాగంబును సూచితములు గావున వానిచే భర్తృప్రవాస మూహ్యము గావునను ప్రోషితభర్తృక యని తెలియ నగుచున్నది.

మధ్యా ప్రోషితభర్తృకా యథా.

వాస స్త దేవ వపుషో, వలయం త దేవ
హ స్తస్య, సైవ జఘనస్య చ రత్నకాఞ్చీ;
వాచాలభృఙ్గసుభగే సురభౌ సమ స్త
మ ద్యాధికం భవతి మే సఖి, కి న్నిదానమ్? ౪౦.

నాయిక పలుకుచున్నది.—సఖి = చెలియా, వాచాల భృఙ్గ సుభగే అద్య సురభౌ = శబ్దాయమానములైన తుమ్మెదలచే మనోహరమైన యీ వసంతమందు, మే వపుషః వాసః తత్ ఏవ = నా యొడలి వలువ (నేనిప్పుడు ధరించియున్న వస్త్రము) (ఈవసంతమునకు) ముందు ధరించుచుండిన దే, హస్తస్య వలయం తత్ ఏవ = నాచేతి (యీ) కడియంబును ఆమునుపటి దే, జఘనస్య రత్న కాఞ్చీ చ సైవ = మొలయందలి మణుల మొలత్రాడు ను ఆమునుపటి దే; (అట్లుండియు), సమస్తమ్ అధికం భవతి = అంతయు (వాసో వలయ కాంచికలు) (నాకొలఁతకు) ఎక్కువ యగుచున్నది, కిం నిదానమ్ = (ఇందులకు) ఏమి కారణము?

'సుభగే' - తుమ్మెదమోఁత విరహతాపోద్దీపక మగుటచేత వియుక్తలకు కర్ణకఠోర మైనను అవియుక్తలకు మనోహరంబ గావున నిట దానిమనోహరత్వము నే చెప్పుటచేత ఈనాయికకు ఇదియే ప్రథమవిరహ మని తెలియవలయును. 'సురభౌ'- జాము నేని దినము నేనియుం జెప్పక ఋతువు నే చెప్పుటచేత చిరవిరహము సూచితమై ప్రోషితభర్తృక యని తెలుపుచున్నది. వాసోవలయకాంచికలు మూఁడును అధిక మైన వనుటచే సర్వాంగకార్శ్యము ఎఱుకవడుచున్నది. ఈకార్శ్యము మదనకార్యము గదా. మఱియు, రత్నకాంచ్యాదికమును మానమి విరహ వ్రతము ధరించిన దని సఖులు పరిహసింతు రనులజ్జచేత. తనకార్శ్యమునకు ప్రియప్రవాసము కారణ మని యెఱింగియు తానే ఆవిషయమును సఖితో చెప్పకొనమియు లజ్జచేత. ఇట్లు సమానలజ్జామదన గావున నాయిక మధ్య.

ఇట మలినవస్త్రధారణంబును వలయకాంచికాత్యాగంబు నను విరహవ్రతాచారము చెప్పఁబడిన దనియు, దానిం గ్రమ్ముటకే అవి యెక్కు డైన వని పల్కుట యనియు,

వివరించుట షఠి గాదు. ఎట్లన, ఆపత్కుంబున, ఎక్కుడైన కారణమువలన కాంచీవలయ ములను త్యజించినట్లే వస్త్రమునుంగూడ త్యజించిన దని చెప్పవలసివచ్చును. అందులే కంగీకారమేని మలినవస్త్ర యన నవకాశ ముండదు. వస్త్రముమాత్రము మార్చుకొన్న ది - మునుపటిదానికన్న చిన్న దానిని కట్టుకొన్నది - అనువెడలను మలినవస్త్ర యన నవ కాశ ముండదు (సరియ గదా ఆమునుపటివస్త్రమే యనుట విరోధించును). ఏవిరహాత్ర తమును నెక్కొలుపుట కీప్రయత్నమో దానికే మూలచ్ఛేద మగును. -

ప్రౌఢా ప్రోషితభర్తృకా యథా.

మాలా బాలామ్బుజదళమయీ, మౌక్తికీ హారయష్టిః,
కాఞ్చీ, యాతే ప్రభవతి హరౌ సుభ్రువః ప్రస్థితైవ;
అన్య ద్బ్రూమః కి మపి ధమనీ వర్తతే వా న వేతి
జ్ఞాతుం పాణే రహహ వలయం బాహుమూలం ప్రయాతి. ౮౧.

కవివాక్యము.—ప్రభవతి హరౌ యాతే = ప్రభువయిన శ్రీకృష్ణుఁడు పయన మపోఁగా, బాల అమ్బుజ దళ మయీ మాలా మౌక్తికీ హార యష్టిః కాఞ్చీ ప్ర స్థితాః ఏవ = లేఁత తామర రేకులతోఁ జేయఁబడిన దండ (యు) ముత్తెములతోఁ చేయఁబడిన పేరుయొక్క పేట(యు) మొలనూలు (ను) తరలనే తరలినవి (విరహజ్వర ముచే - దండ ఎండిపోయెను - ముత్తెములు సున్న మాయెను - మొలనూలు విరహకార్శ్య ముచే జారిపోయెను అని భా.); అన్యత్ కిమ్ అపి బ్రూమః = మఱియొక విషయమును (ఇంతకన్న) ఆశ్చర్య మగుదానిని చెప్పెదను, ధమనీ వర్తతే వా న వా ఇతి జ్ఞాతుం పాణేః వలయం బాహు మూలం ప్రయాతి = నాడి ఆడుచున్న దో లే దో అని కనుంగొనుటకు చేతియొక్క కడియము బాహువుయొక్క మొదటికి (అనఁగా చంకకడకు) పోవుచున్నది (విరహకార్శ్యముచేత కడియము క్రిందికి జాఱి పడనుండఁగా అట్లు పడకుండుటకై మాటిమాటికి, చేతిని పైకెత్తుటవలన కడియము చంకకడకు దిగుచుం డె నని భా.. ఆ దిగుట వైద్యార్థము కడియము మనికట్టున నాడి యాడమిచే చంకకడ నాడిని శోధించుటవలెనుండె నని యర్థము. నాయిక ప్రాణసందేహదశలో నున్న ద ని భా.); అహహ=అయ్యో! (కవియే దురవిట్లుచే తటస్థులకును దుస్సహ మయిన దుర్ద శలో నున్న దని భా.) ప్రోషితభర్తృక యని కంఠోక్తమే. మదనజ్వరకార్య మయినతాపకార్శ్యములు తేటతెల్లముగా తెలియుటచేత ప్రౌఢి స్ఫురించుచున్నది.

పరకీయా ప్రోషితభర్తృకా యథా.

శ్వశ్రూః పద్మదళం దదాతి, త దపి భ్రూసంజ్ఞయా గృహ్యతే,
సద్యోమర్మరళబ్ధహాయా న చ తయా సంస్పృశ్యతే పాణినా;

యాతు ర్వాచి సుహృద్గణస్య వచసా ప్రత్యుత్తరం దీయతే;
శ్వాసః కిఞ్చ న ముచ్యతే హుతవహాక్రూరః కురఙ్గీదృశా. ౪౨.

శ్వశ్రూః పద్మ దళం దదాతి = అత్త తామర రేకును ఇచ్చుచున్నది, తత్ అపి తయా కురఙ్గీదృశా భ్రూ సంజ్ఞయా గృహ్యతే = అదియు ఆ హరిణీలోచనచేత కనుబొమల సన్నచేత తీసికొనఁబడుచున్నది, (అంతేగాని), సద్యో మర్మర శబ్దయా పాణినా న చ సంస్పృశ్యతే = తత్కాలమందే గలగలచప్పుడు (అగునట్టు) భయము చేత చేతితో తాకఁబడదాయెను; [అత్త ఈవచ్చినతామరరేకును కోడలు చేతఁ బుచ్చుకొనక తనకడ నుంపు మనుటగా కనుసంజ్ఞ చేసినది. కోడలు చేతఁ గైకొనమి యేల యనఁగా: చేతఁగొన్నచో విరహతప్తయైన తనతాఁకుడుచేత ఆరేకు తత్క్షణమే ఎండి గలగల శబ్దము సేయు ననియు ఆశబ్దముచే అత్త హెచ్చరికపడి రే కెండుటం గనిపట్టి దానివలన తన (= కోడలి) విరహతాపమును, దానివలన భ్రష్టత్వమును, ఊహించు ననుభయముచేత.] యాతుః వాచి = తోడికోడలి ప్రశ్నకు (ఏల యిట్లు దీనత వహించి యున్నావు? అని తోడికోడ లడుగఁగా), ప్రత్యుత్తరం సుహృత్ గణస్య వచసా దీయతే = జవాబు చెలుల సమూహముయొక్క మాటచే ఇయ్యఁబడుచున్నది (అనఁగా-తనగద్గదస్వరాదికముచేత తనగుట్టు బయటఁబడు ననుభయముచేత జవాబును తాను చెప్పక చెలికత్తెలచేత కల్లబొల్లిగా చెప్పించుచున్నది); కించ = మఱియును, హుతవహక్రూరః శ్వాసః న ముచ్యతే = నిప్పువలె దారుణమైన నిట్టూర్పు విడువఁబడకున్నది (నిప్పువలె వేఁడి యగునిట్టూర్పును గుట్టు బయటఁబడు ననుభయముచేత విడువక యణఁచుకొనుచున్నది). దేశాంతరము పోయినయుపపతిమీఁద అనురాగము చూపుచున్నదిగావున నాయిక పరకీయ ప్రోషితభర్తృక.

సామాన్యా ప్రోషితభర్తృకా యథా.

విరహావిదిత మన్తః ప్రేమ విజ్ఞాయ కాన్తః
పున రపి వసు తస్మా దేత్య మే దాస్య తీతి,
మరిచనిచయ మక్ష్ణో ర్న్యస్య బాష్పోదబిన్దూ
న్విసృజతి పురయోషి ద్ద్వారదేశోపవిష్టా. ౪౩.

కాన్తః విరహ విదితమ్ అన్తః ప్రేమ విజ్ఞాయ తస్మాత్ ఏత్య పున రపి మే వసు దాస్యతి ఇతి = నాయకుఁడు ఎడఁబాపునందు ప్రకటమయిన (నాయొక్క) హృదయములోని వలపును ఎఱింగి (విని) ఆదేశమునుండి వచ్చి (నప్పుడు) వెండియు నాకు ధనమును ఇచ్చును అని (అనుహేతువుచేత - అనునాసగలదై), పుర యోషిత్ ద్వార దేశ ఉపవిష్టా (సతీ) అక్ష్ణోః మరిచ నిచయం న్యస్య బాష్ప ఉదబిన్దూన్ విసృజ

తి = ఊరి యింతి (ఊరఁగలయెల్లవారిదియు నగునింతి - వేశ్య యనుట) (వీథి) గడప కడ కూర్చున్నదై కన్నుల మిరియంపు మొత్తమును (సమృద్ధిగా మిరియాలకలికమును - కన్నీళ్ళు ధారధారగా వచ్చుటకై) ఇడుకొని కన్నీటి బొట్టులను విడుచుచున్నది.
'విదితమ్' - ఎల్లవారికిం దెలిసినదఁగదా అతనిచెవిని బడును. 'తస్మా దేశ్య'- ఆదేశములో గడించి తెచ్చి యనియును భా. మిరియాలకలికము కన్నీళ్ళు వచ్చుటకు. 'నిచయము' ఆకన్నీళ్ళు విస్తారముగా వచ్చుటకు. వీథిగడపలో కూర్చుండి (అతనిగుణములను కీర్తించుచు) ఏడ్చుట ఎల్లరకుం దెలియుటకు. ఎల్లవారికిం దెలియుట కర్ణపరంపరగా నాయకునికిం దెలియుటకు. వాస్తవానురాగములేక డబ్బుకై దేశాంతరగతకాంతునిం గూర్చి యింతటుక్క సేయుచున్నది గాన ఇది సామాన్య ప్రోషితభర్తృక.

---

## ఖండిత.

అన్యోపభోగసంచిహ్నితః ప్రాత రాగచ్ఛతి పతి ర్యస్యాః సా ఖణ్డితా.. ప్రాత రి త్యుపలక్షణమ్. అస్యా శ్చేష్టాః అస్ఫుటాలాప చిన్తా సన్తాప నిశ్వాస తూష్ణీమ్భా వాశ్రుపా తాదయః.

అన్యస్త్రీతో సంభోగించినగుర్తులు గలవాఁడై ఏచెలువయొక్క (ఏచెలువకడకు) పతి వేకువను వచ్చునో ఆమె ఖండిత (యనంబడును). వేకువ యనుట ఇతరవేళలకు నుపలక్షణము (అనఁగా ఏవేళయందైనను సరియే యని యర్థము). ఈమెయొక్క చేష్టలు- అస్ఫుట మయినమాట, చింత, సంతాపము, నిట్టూర్పు, మౌనము, కన్నీరు విడుచుట, లోనగునవి.

ముగ్ధా ఖణ్డితా యథా.

వక్షః కిము కలశాఙ్కిత మితి కి మపి ప్రష్టు మిచ్ఛన్త్యాః
నయనే నవోఢసుదృశః ప్రాణేశః పాణినా పిదధే. ౪౪.

కవివాక్యము.—(హేకాన్త = ఓవల్లభుఁడా), వక్షః కిము కలశ అఙ్కితమ్ =(నీ) రొమ్ము ఏల గిండులయొక్క ముద్రలుగలది (అయినది)? (ఇది నాయకునిరొమ్మునందు అన్యవనితాలింగనముచేత నంటుకొన్న తదీయ స్తనకుంభకుంకుమముద్రలం గాంచి యతనిని నాయిక యడుగఁ దలంచినప్రశ్న.) ఇతి కిమ్ అపి ప్రష్టుమ్ ఇచ్ఛన్త్యాః నవోఢ సుదృశః నయనే ప్రాణేశః పాణినా పిదధే = ఇట్లని ఏమి యో ప్రశ్న చేయుటకు కోరుచున్న నవోఢ సుందరియొక్క కన్నులను ప్రాణనాయకుఁడు (అతని) చేతితో కప్పివైచెను. (ఆముద్రలను చూడ కుండునట్లు ఆటపెుపమున కన్నులు మూసి ఏమ

తించె నని భా.) మిక్కిలి సులువుగా సమాధానపడినది గావున ముగ్ధ; స్త నముద్రలు అన్యకాంతవిగావున ఖండిత.

మధ్యా ఖణ్డితా యథా.

వక్షోజచిహ్నిత మురో దయితస్య వీక్ష్య,
దీర్ఘం న నిశ్వసితి జల్పతి నైవ కిఞ్చిత్,
ప్రాత ర్జలేన వదనం పరిమార్జయన్తీ
బాలా విలోచనజలాని తిరోదధాతి. ౭౫.

కవివచనము.—బాలా = (ఒకానొక) జవరాలు, ప్రాతః = వేకువను, వక్షోజ చిహ్నితం దయితస్య ఉరః వీక్ష్య = (సవతి) చనుదోయియొక్క ముద్రలుగలదానిని (అప్పుడే యింటికి వచ్చిన తన) ప్రాణేశుని రొమ్మును కాంచి, దీర్ఘం న నిశ్వసితి = నిడుదగా నిట్టూర్పు విడువదు (విడువ దాయెను), కిఞ్చిత్ న ఏవ జల్పతి = ఏమియు పలుకనే పలుకదు (పలుక దాయెను), (మఱి యేమి చేసిన దనఁగా - ), వదనం జలేన పరమార్జయన్తీ విలోచనజలాని తిరోదధాతి = (తన) ముఖమును నీళ్ళతో కడుగుకొనుచున్నదై కన్నీళ్ళను దాఁచివేయును (దాఁచివేసిన దాయెను); (కన్నీళ్ళు తెలియకుండుటకై ప్రాతరాచారముప్రకారము మొగమున నీళ్ళుపోసికొని కడుగుకొన్న దని భా.)

ఇట నిట్టూర్పు నిగుడ్పమి పలుకమియు లజ్జచేత; అశ్రువులు మదనునిచేత; సమానలజ్జామదన గావున ఈఖండిత మధ్య.

ప్రౌఢా ఖణ్డితా యథా.

మా ముద్వీక్ష్య విపక్షపక్ష్మలదృశః పాదామ్బుజాల క్తకై
రాలిప్తానన మానతీకృతముఖీ చిత్రార్పి తే వాభవత్;
రాత్రుం నో క్తవతీ; న వా కృతవతీ నిశ్వాసకో ష్ణే దృశౌ;
ప్రాతర్మ్యగ్ని మజ్జనా కరతలా దాదర్శ మాదర్శయత్. ౭౬.

నాయకుఁడు చెలికానితో చెప్పుట.—అఙ్గనా (ప్రాతః) విపక్ష పక్ష్మలదృశః పాద అమ్బుజ అలక్తకైః ఆ లిప్త ఆననం మామ్ ఉద్వీక్ష్య = (నా) వల్లభ (వేకువను) సవతియొక్క (శత్రు వైన తొంగలిరెప్పలుగల కన్నుల దానియొక్క అని అవయవార్థము) అడుగుఁ దామరయొక్క లత్తుకలచేత అంతటను పూయఁబడిన మోముగలవానిని (అనఁగా సవతిపాదములను మోమున నదుకొని మ్రొక్కిన) నన్ను చూచి, ఆనతీకృత ముఖీ చిత్ర అర్పితా ఇవ అభవత్ = మొగము వంచుకొన్నదై చిత్తరువునందు వ్రాయఁబడినదో యన(చిత్తరువో యన నిశ్చేష్టురాలు) ఆయెను (కోపాతిశయముచేత తెచ్చవడె నని

భా.); (మఱి) రూక్షం న ఉక్తవతీ = పరుసము లాడ దాయెను; దృశా వా నిశ్వాస కోష్ణే న కృతవతీ = కన్నుల నేని నిట్టూర్పులచేత వేఁడి చేయ దాయెను; (మఱేమి చేసె ననఁగా), ప్రాతః మఞ్జరమ్ ఆదర్శమ్ కరతలాత్ అదర్శయత్ = వేకువను శుభప్రదమగు నద్దమును చేతఁగొని (నాకుఁ) జూపెను (అలత్తుకచిహ్నములు నాకే యగపడునట్లుగా నాముఖమున కెదుట చేత నద్దము పట్టె నని యర్థము); (నీయోగ్యతను నీమోమున లత్తుకముద్రలే చెప్పుచున్నవి చూచుకొమ్ము - అని నాయికభా.) ప్రియునియపరాధమును అద్దముచే నతనికి వెల్లడించినజాణతనముచే ఈఖండిత ప్రౌఢ.

పరకీయా ఖణ్డితా యథా.

కాన్తం నిరీక్ష్య వలయాఙ్కితకణ్ఠదేశం
ముక్తా స్తయా పరభియా పరుషా న వాచః,
దూతీముఖే మృగదృశా స్ఖలదశ్రుపూరా
దూరాత్ పరం నిదధిరే నయనాన్తపాతాః. ౪౭.

కవివాక్యము.—వలయ అఙ్కిత కణ్ఠ దేశం కాన్తం నిరీక్ష్య = (లాఁతివనిత యొక్క గాజులచేత చిహ్నితమయిన మెడ ప్రదేశముకలవానిని వల్లభుని చూచి (వల్లభుని మెడయందు పరవనితాకంకణముద్రలను గాంచి), తయా మృగదృశా = ఆ సుందరిచేత, పర భియా = ఇతరులవలని భయముచేత (ఇతరులకు తనమాటలు వినఁబడి తన ఱంకుఁబడుకు బట్టబయ లగు ననుభయముచేత), పరుషాః వాచః న ఉక్తాః = పరుసపు మాటలు చెప్పఁబడలేదు, పరం తు = మఱి యేమిచేయఁ బడియెననఁగా, స్ఖలత్ అశ్రు పూరాః నయన అన్త పాతాః దూతీ ముఖే దూరాత్ నిదధిరే = జాఱుచున్న కన్నీళ్ళ ధారలుగలవైన కనుఁ గొనల చూపులు దూతికయొక్క ముఖమందు దూరమునుండి నిగుడ్పఁబడినవి (ఈతఁడు నా కట్టిద్రోహి యాయెనో చూడుము - అని యాచూపులయభిప్రాయము). పరభీతికథనముచేత ఈఖండిత పరకీయ.

సామాన్యా ఖణ్డితా యథా.

ఉర స్తవ పయోధరాఙ్కిత మిదం కుతో మే ధనమ్?
తతో మమ నిధీయతాం వసు పురో య దఙ్గీకృతమ్;
ఇతి ప్రచలచేతసః ప్రియతమస్య వార స్త్రియా
క్వణత్కనకకఙ్కణం కరతలాత్ సమాకృష్యతే. ౪౮.

కవివచనము.—తవ ఇదమ్ ఉరః పయోధర అఙ్కితమ్ = నీయొక్క ఈ వక్షము పాలిండ్ల ముద్రలుగలది (ఇదిగో ప్రత్యక్షముగా నీఱొమ్మున దానిపాలిండ్లు అచ్చుకొ

ట్టిన ట్లున్నవి), మే క్షమా కుతః = (ఇఁక) నాకు ఓర్పు ఎక్కడిది? (ఈద్రోహమును
నే సూర్క్ష్యంజాలను అనుట), తతః యత్ వసు అఙ్గీకృతం తత్ (వసు) మమ పురః నిధీ
యతామ్ = (ఇంక నీతో నాకు ఒడంబడికబడి వ్యవహారమేగాని చెలిమితో పనిలేదు)
కావున ఏధనము ఒప్పుకొనఁబడినదో ఆ (ధనము) నా యెదుట పెట్టఁబడునుగాక (ఒ
ప్పుకొన్నధనమును ఇచ్చి కదలుము), ఇతి వారస్త్రియా ప్రచల చేతసః ప్రియతమస్య
కరతలాత్ క్వణత్ కనక కఙ్కణం సమాకృష్యతే = (టీకావాక్యము కర్తృగ్ఘకము.)
ఇట్లని వెలయాలు మిక్కిలి జంకిన మనస్సుకలవాఁడయిన నాయకునిచేతినుండి శబ్దించు
చున్న పసిఁడి కడియమును (తాకట్టుగా) లాగుకొనుచున్నది. 'పయోధరాంకిత'
మనుటచే ఖండిత, 'వసు' అనుటచే సామాన్య.

---

## కలహాంతరిత.

పతి మవమత్య పశ్చాత్ పరితప్తా కలహాన్తరితా. అస్యా శ్చే
ష్టాః-భ్రాన్తి సంతాప సమ్మోహ నిశ్వాస జ్వర ప్రలా పాదయః.

పతిని తిరస్కరించి పిమ్మట (అందుకై) దుఃఖించునది కలహాంతరిత. ఈమె చే
ష్టలు - భ్రమ, సంతాపము, మూర్ఛ, నిట్టూర్పు, జ్వరము, పలవరింత, లోనగునవి.

ముగ్ధా కలహాన్తరితా యథా.

అనునయతి పతిం న లజ్జమానా,
కథయతి నాపి సఖీజనాయ కిఞ్చిత్,
ప్రసరతి మలయానిలే నవోఢా
వహతి పరం తు చిరాయ శూన్య మన్తః. ౪౯.

లజ్జమానా నవోఢా పతిం న అనునయతి = లజ్జించుచున్నదై నవోఢ (తనచే న
వమానితుఁడై వెడలిపోయిన) పతిని అనునయింపదు, అపి సఖీజనాయ కిఞ్చిత్ న కథ
యతి = మఱియు చెలులకు ఇంచుక (యు) చెప్పదు, పరం తు = మఱి, మలయానిలే
ప్రసరతి - అన్తః చిరాయ శూన్యం వహతి = మలయమారుతము వీచుచుండఁగా-హృ
దయమును చాలసేపు వట్టిదానినిగా వహించును (ప్రియుఁడు వెడలిపోయినదుఃఖమున
కు ఏమి చేయనుం దోఁపక మూఢముగా నుండు ననుట). ముగ్ధ యనుట స్పష్టము.
అనునయింప దనుటచే పశ్చాత్తాపము సూచితముగాన కలహాంతరిత.

మధ్యా కలహాన్తరితా యథా.

విరమతి కథనం, వినా న ఖేదః,
సతి కథనే సముపైతి కాపి లజ్జా,

ఇతి కలహా మధోముఖీ సఖీభ్యో
లపితు మనాలపితుం సమాచకాఙ్క్షే. ౫౦.

కవివాక్యము.—ఖేదః కథనం వినా న విరమతి = (ప్రియునితో నాడినజగడ మువలని) దుఃఖము (చెలులతో) చెప్పుకొనక తీఱదు, కథనే సతి కాపి లజ్జా సము పైతి = చెప్పుకొనఁ గడంగిన ఏదో దాఁటనలవిగాని సిగ్గు పైకొనుచున్నది, ఇతి అధో ముఖీ (సతీ) సఖీభ్యః కలహం లపితుమ్ (చ) అనాలపితుం (చ) సమాచకాఙ్క్షే = ఈహే తువుచేత మోము వాంచినదై (మోము వాంచుట చింతచేత) చెలులకు (ఆ) జగడమును చెప్పుకొనుటకు (ను) చెప్పుకొనకుండుటకు (ను) కోరినది. ఖేదము మదనకార్య ము, చెప్పుకొనమి లజ్జాకార్యము, సమానలజ్జామదన కావున ఈకలహాంతరిత మధ్య.

ప్రౌఢా కలహాన్తరితా యథా.

అకరోః కిము నేత్ర శోణిమానం?
కి మకార్షీః కరపల్ల వానిరోధమ్?
కలహం కి మధాః క్రుధా రసజ్ఞే?
హిత మర్థం న విదన్తి దైవదష్టాః. ౫౧.

నాయిక తననేత్రాదులను అడుగుచున్నది.—(హే) నేత్ర శోణిమానం కిము అకరోః = (ఓ) (పాడు) కన్నా (నాప్రియతమునిపై) ఎఱుపును ఏల తాల్చితివి? (నా ప్రియతముని ఏల కోపముచే నెఱ్ఱనై చూచితివి?) కర పల్లవ అనిరోధం కిమ్ అకార్షీః = ఓ (పాడు) చిగురుఁ గేలా (నాప్రియతముని) అడ్డగింపమిని ఏల చేసితివి? (చిగురువంటి రూచేయీ నాచేసినతిరస్కారముచే వెడలిపోవుచున్న నాప్రాణేశ్వరుని ఏల అడ్డగింపవై తివి?) రసజ్ఞే క్రుధా కలహం కిమ్ అధాః = (ఓపాడు) నాలుకా కోపముతో (ఆయన తో) జగడము ఏల యాడితివి? (మి మ్మనఁ బని యేమి!) దైవ దష్టాః హితమ్ అర్థం న విదన్తి = విధిచేత కఱవఁబడిన (కొట్టఁబడిన) వారు (తమకు) అనుకూలముగు ప్రయోజ నమును ఎఱుంగరు. (అదృష్టహీనములరై మీకు మీరే కీడు గావించికొంటి రనుట. అది యె ట్లన,—కన్నా నీ పతనిదర్శనమును, కేలా నీపతనికవుంగిలిని, నాలుకా నీ పతనితో డిసరసపల్లాపములను, దుష్టదైవప్రేరణచేత దుర్మార్గ మవలంబించినవారై కోలుపోయితిరి- అని యభిప్రాయము.) దైవహతి నేత్రాదులకుఁ జెప్పఁబడినందున వానియందు పరిజన భావనకన్న మిత్రభావనయే ఉచితముగాఁ దోఁచుచున్నది. తన్ను నిందించుకొనక తనయవయవములను నిందించుటచే ప్రేమ చాతుర్య పశ్చాత్తాపము లగపడుచున్నవి గాన ఈనాయిక ప్రౌఢ కలహాంతరిత.

పరకీయా కలహాన్తరితా యథా.

భర్తు ర్యస్య కృతే గురు ర్లఘు రభూ ద్గోష్ఠీ కనిష్ఠీకృతా,
ధైర్యం కోశధనం గతం సహచరీ నీతిః కృతా దూరతః,
నిర్ముక్తా తృణవత్ త్రపా పరిచితా స్రోతస్వినీ బిన్దువత్,
స క్రోధా దవధీరితో హాతధియా మాత ర్బలీయాన్ విధిః!

నాయిక తన్నుఁ దాను నిందించుకొనుచున్నది.—యస్య భర్తుః కృతే = ఏ చెలువుని కొఱకు, గురుః లఘుః అభూత్ =(నాకు) మామ లోనగు పెద్దలు అల్పులు గా అయిరో (నేను అత్తమామలను సరకుసేయనైతినో) [లఘుః గురుః అభూత్ = ముక్కుడులైన దూత్యాదులు పూజ్యు లయిరో - నేను ముక్కడి కుంటెనగత్తియలను గౌరవించితినో, అనియేనియు గ్రహింపవచ్చును], గోష్ఠీ కనిష్ఠీకృతా=(అమ్మలక్కలు ఒకచోట చేరినప్పుడు నన్నుఁ గూర్చి చెప్పుకొనెడి) యపకీర్తి అవగణింపఁబడెనో (నేను అమ్మలక్కలసడిని గణింపనైతినో), కోశధనం ధైర్యం గతమ్ =(నా) బొక్కసపు (= మూల) ధనమైన (నా) తేఁకువ పోయెనో, సహచరీ నీతిః దూరతః కృతా= నన్నెపుడు నెడఁబాయనిచెలియైన నీతి దవ్వుసేయఁబడెనో (ఎప్పుడును నేను వదలని నీతిని వదలితినో), త్రపా తృణవత్ నిర్ముక్తా = లజ్జ గడ్డిపోఁకయుంబోలె (పనికిరా నివస్తువువోలె, అనఁగా మిగుల సులువుగా - ఎట్లును వదలునదిగానిలజ్జను సులువుగా వదలుట అనురాగాతిశయముచేత) (లజ్జసయితము నన్ను విడుచునంతయనురాగము ఎవ నిపై వహించితినో అని భా.), స్రోతస్వినీ బిన్దువత్ పరిచితా =(నాచేత) ఏఱు నీటిబొట్టువోలె (అంత సులువుగా - ఇదియును అనురాగమహిమనే దెలుపును) అలవాటుచేసి కొనఁబడియెనో (దాఁటఁబడియెనో) (ప్రాణాపాయము గణింపక అలక్ష్యముగా ఏటిని దాఁటితినో), సః హాతధియా (మయా) క్రోధాత్ అవధీరితః = ఆప్రియతముఁడు బుద్ధిమసిందిన (నాచేత) కోపముచేత తిరస్కరింపఁబడియెను (బుద్ధిమసించి కోపావిష్టనై ఆప్రియతముని తిరస్కరించితిని), మాతః విధిః బలీయాన్ = అమ్మరో (అయ్యో) దైవము బలిష్ఠము. (నాదురదృష్టమువలన నట్లుచేసితి ననుట.) 'గురు ర్లఘు రభూత్' అనుటచే పరకీయ, 'అవధీరితః' అనుటచే కలహాంతరిత.

సామాన్యా కలహాన్తరితా యథా.

యత్ పఙ్కేరుహలక్ష్మ పాణికమలే, భాగ్యాలయే య ద్గురుః,
న్యస్తం వామమ య ల్లలాటఫలకే భాగ్యాక్షరం వేధసా, [త్రో,
తత్ సర్వం సఖి యో యథార్థ మకరోత్ తస్మిన్ ప్రకోపః కృ
ధి జ్ఞాం! ధి జ్జమ జీవితం! ధి గతనుం! ధి క్చేష్టితం! ధి గ్వయః!

సఖి = చెలీ, మమ పాణి కమలే పఙ్కేరుహ లక్ష్మ (అస్తీతి) యత్ = నా యొక్క కేలుఁ దామరయందు పద్మ రేఖ (ఉన్న దనుట) ఏదో (పద్మరేఖ మహారాజసంగమ లాభసూచక మని సాముద్రికము), భాగ్య ఆలయే గురుః (అస్తీతి) యత్ = (జాతకమందు నాజన్మరాశికి) తొమ్మిదవ రాశియందు బృహస్పతి (ఉన్నాఁ డనుట) ఏదో (జన్మరాశినుండి తొమ్మిదవరాశికి భాగ్య మనిపేరు, అందు బృహస్పతియున్న మహాసౌఖ్యలాభ మని జ్యోతిశ్శాస్త్రము), లలాట ఫలకే వేధసా భాగ్యాక్షరం న్యస్తమ్ ఇతి యత్ = పలకవంటి (నా) నొసటియందు బ్రహ్మచేత ఐశ్వర్యలిపి వ్రాయఁబడె న(ని పెద్దలు అ) నుట యేదో, యః తత్ సర్వం యథార్థమ్ అకరోత్ = ఎవఁడు దాని నెల్ల సత్యము గావించెనో (ఎవఁడు నన్నుఁ గూడి అమితైశ్వర్య మొసంగెనో), తస్మిన్ (మయా) ప్రకోపః కృతః = అతనిపై (నాచేత) గడుసైన కోపము తాల్పఁబడినది (ఆతనిపై మిక్కిలి కోపగించితిని, అతనితో కఠినముగా జగడమాడితిని), ధిక్... వయః = ఇసీ నేనేల! ఇసీ నా ప్రాణ మేల! ఇసీ మదనుఁ డేల! ఇసీ విలాసము లేల! ఇసీ జవ్వన మేల! ఇ వన్నియు నింద్యము లని భా.) ధనప్రవణతచే సామాన్య, కోపకరణముచే కలహాంతరిత.

---

## విప్రలబ్ధ.

సంకేతనికేతనే ప్రియ మనవలోక్య సమాకులహృదయా విప్రలబ్ధా. అస్యాశ్చేష్టాః - నిర్వేద నిశ్వాస సఖిజనోపాలమ్భ చిన్తాశ్రుపాత మూర్ఛాదయః.

సంకేతస్థానమందు ప్రియునిఁ గానక మదిలో తల్లడిల్లునది విప్రలబ్ధ (యనంబడును). ఈనాయికయొక్క చేష్టలు - నిర్వేదము; నిశ్వాసము, సఖులను దూఱుట, చింత, కన్నీళ్ళు విడుచుట, మూర్ఛ, లోనగునవి.

ముగ్ధా విప్రలబ్ధా యథా.

ఆళీభిః శపథై రనేకకపటైః కుఞ్జోదరం నీతయా
శూన్యం త చ్చ నిరీక్ష్య విక్షుభితయా న ప్రస్థితం న స్థితమ్,
న్యస్తాః కిన్తు నవోఢనీరజదృశా కుఞ్జోపకణ్ఠే తృషా
తామ్యద్భృఙ్గకదమ్బడమ్బరచమత్కారస్పృశో దృష్టయః. ౫౭

కవివచనము.— (కర్తృగతప్రయోగముగా టీక).—ఆళీభిః శపథైః అనేక కపటైః కుఞ్జ ఉదరం నీతయా = చెలికత్తెలు ఒట్టులుపెట్టుకొనియు పెక్కు మాయలుప

న్నియు పొదరింటి లోపలికి ప్రవేశపెట్టఁగా, (ప్రవేశించినదియు), శూన్యం తత్ నిరీక్ష్య విక్షుభితయా చ = ప్రియుఁడు లేని యాపొదరింటిని గాంచి ఆకులపడినదియును, (అయిన), నవోఢ నీరజదృశా = నవోఢ తామరసేక్షణ, న ప్రస్థితమ్ = (అటనుండి) తరలను లేదు, న స్థితమ్ = (అట) నిలువను లేదు, కిం తు = మఱి (యేమి చేసిన దనఁగా), తృషా తామ్యత్ భృఙ్గ కదమ్బ డమ్బర చమత్కార స్పృశః దృష్టయః కుఞ్జ ఉపకణ్ఠే న్యస్తాః = దప్పిచే సోలుచున్న తుమ్మెదల కదుపుయొక్క వేగిరపాటుయొక్క సొంపును పొందినవైన (- సొంపుగలవైన) చూపులను పొదరింటి చెంగటను నిగిడ్చినది (చాటున నెట నేనియుఁ గలఁడో యని ఆసను దెలుపుచూపులతో నలుగడలం బరికించె నని భా.) శపథకపటములచే తెచ్చిరి గావున ముగ్ధ, నాయకుఁడు సంకేతమునకు రానందున విప్రలబ్ధ.

మధ్యా విప్రలబ్ధా యథా.

సంకేతకేళిగృహ మేత్య నిరీక్ష్య శూన్య
మేణీదృశో నిభృతనిశ్వసితాధరాయాః
అర్ధాతురం వచన మర్ధవికాసి నేత్రం
తామ్బూల మర్ధకబళీకృత మేవ తస్థౌ. ౫౫.

కవివచనము.—సంకేత కేళి గృహమ్ ఏత్య = సంకేతస్థానమయిన (మరుని) యాటయింటికి పోయి, శూన్యం నిరీక్ష్య = నాయకుఁడు లేని (యాయింటిని) చూచి (అందు నాయకుఁడు లేఁ డని యెఱింగి), నిభృత నిశ్వసిత అధరాయాః ఏణీదృశః = ఇతరులకు దెలియరాని నిట్టూర్పుతోఁగూడిన మోవిగల దైన కురంగీనయనయొక్క, వచనమ్ అర్ధ ఆతురమ్ (ఏవ) - నేత్రమ్ అర్ధవికాసి (ఏవ) - తామ్బూలమ్ అర్ధ కబళీకృతమ్ ఏవ - తస్థౌ = మాట (కేవలము) సగ మతురములుగలదిగాను - కన్ను (కేవలము) సగము వికసిల్లినదిగాను - తములము కేవలము సగము మ్రింగఁబడినదిగాను - ఉండెను. నిభృత మగుట లజ్జచేత, అర్ధ మగుట మదనునిచేత; రెండును సమానములు గావున నాయిక ముగ్ధ; శూన్యము గావున విప్రలబ్ధ.

ప్రౌఢా విప్రలబ్ధా యథా.

శూన్యం కుఞ్జగృహం నిరీక్ష్య కుటిలం విజ్ఞాయ చేతోభవం,
దూతీ నాపి నివేదితా, సహచరీ పృష్టాపి నో వా తయా;
శమ్భో శఙ్కర చన్ద్రశేఖర హర శ్రీకణ్ఠ శూలిన్ శివ
త్రాయ స్వేతి పరం తు పఙ్కజదృశా భర్గస్య చక్రే స్తుతిః.

కవివచనము.—(కర్తృర్థక ప్రయోగముగా టీక).— తయా పఙ్కజదృశా = ఆ తామరసాక్షి, కుఞ్జగృహం శూన్యం నిరీక్ష్య = పొదరింటిని శూన్యముగాఁ గని (నాయకుఁడు లేని పొదరింటిం గాంచి), చేతోభవం కుటిలం విజ్ఞాయ = మదనుని (విరహమందు ఇదే సమయ మని ఏఁచుచున్నట్టి) కూళనుగా నెఱింగి, దూతీ అపి న నివేదితా = దూతికి సయితము చెప్ప దాయెను, సహచరీ అపి పృష్టా నో వా = చెలినేనియు అడుగ దాయెను; పరం = మఱి యేమి చేసిన దనఁగా, శమ్భో...స్వేతి = ఓశంభూ శంకరుఁడా చంద్రశేఖరుఁడా హరుఁడా కఱకంఠుఁడా ముమ్మొనవాలు దాలుపా శివుఁడా రక్షింపుము అని, భర్గస్య స్తుతిః చక్రే = మహేశ్వరునియొక్క స్తుతిని చేసినది. నాయిక మదనునిపాల బడఁచుటకై శివస్తుతి చేయుటచేత ప్రగల్భ, సంకేతమునకు నాయకుడు రానందున విప్రలబ్ధ.

పరకీయా విప్రలబ్ధా యథా.

దత్త్వా ధైర్యభుజఙ్గమూర్ధ్ని చరణౌ, వుల్లఙ్ఘ్య లజ్జానదీ,
మఙ్గీకృత్య ఖలాన్ధకారపటలం, తన్వ్యా న దృష్టః ప్రియః;
సంతాపాకులయా తయా చ పరితః పాథోధరే గర్జతి [ తే. ౫౭.
క్రోధాక్రాన్త కృతాన్త మత్త మహిష భ్రాన్త్యా దృశౌ మోజి

కవివాక్యము.— (కర్తృర్థప్రయోగముగా టీక.)—తన్వ్యా = చెలువ, ధైర్యభుజఙ్గ మూర్ధ్ని చరణౌ దత్త్వా = ఈలువనెడు పాముయొక్క పడగపై పాదములు పెట్టి, లజ్జా నదీమ్ ఉల్లఙ్ఘ్య = లజ్జయనెడి యేటిని దాఁటి, ఖల అన్ధకార పటలమ్ అఙ్గీకృత్య = (తనయందు దోషము ప్రకటించెడు) నీచులనెడి చీఁకటి మొత్తమునకు తెగించి (యు), ప్రియః న దృష్టః = (సంకేతస్థలమున) ప్రియునిఁ గాన దాయెను; (కిం) చ = మఱి, సంతాప ఆకులయా తయా = మదనతాపముచే తల్లడపడినదై యా చెలువ, పరితః గర్జతి పాథోధరే = (మింట) నెల్లెడలను ఉఱుముచున్న మేఘముమీఁద, క్రోధా...న్త్యా = కోపముచే (ఆక్రాన్త =) ఆవిష్టమైన యమునియొక్క మదించిన దున్నపోతనెడి భ్రమతో, దృశౌ మోజితే=చూపులను తగిలించెను. [ఈలు వనఁగా సదాచారమందు స్త్రీలకుం గలపట్టుదల.] ఇందలిరూపకముల తాత్పర్య మయిన యుపమల స్వారస్యము ప్రాణమునకు తెగించుట; ఈ తెంపుచే ఈపరపురుషుఁడు ప్రాణమునకన్న ప్రియుఁ డనియుం వీనితోడియీవిరహము ప్రాణాపాయముకన్న దుస్సహ మనియు తేర్పడుచున్నది. సహజముగానే ఇట్టి దైనయీవిరహమునకు అత్యంతోద్దీపక మైనవారిదావరణము కూడ తోడ్పడినచో నిఁక నేటిప్రాణము! కావున మబ్బు జమునిదున్న గాఁ దోఁచెను, అనఁగాఁ మరణసమానదుఃఖకారణ మాయెను. 'ధైర్య', 'ఖల'—వీనిచే పరకీయ యని తెలియుచున్నది, విప్రలబ్ధ యగుట స్పష్టమే.

సామాన్యా విప్రలబ్ధా యథా.

కపటవచనభాజా కేనచి ద్వారయోషా
సకలరసికగోష్ఠీవఞ్చికా వఞ్చితాఽసౌ,
ఇతి విహసతి రిఙ్గద్భృఙ్గవిక్షిప్తచక్షు
ర్వికచకుసుమకాన్తిచ్ఛద్మనా కేళికుఞ్జః. గీ.

సకల రసిక గోష్ఠీ వఞ్చికా అసౌ వారయోషా = ఎల్ల రసజ్ఞుల సమూహమును మోసముచేయునదైన యీ వారస్త్రీ, కపట వచన భాజా కేనచిత్ వఞ్చితా = మాయ మాట లాడెడివాఁడైన యొకానొకనిచేత వంచింపఁబడినది - (వాఁడు పెట్టినకల్ల యాశలను సత్య మని నమ్మికొని సంకేతమునకుఁ బోయినదై వాఁడు రానందున మోసపోయినది); ఇతి = ఇట్లని (ఇందులకై), కేళి కుఞ్జః = స్మరక్రీడయొక్క (సంకేతస్థానమయిన) యాపొద, రిఙ్గత్ భృఙ్గ విక్షిప్త చక్షుః = ఇటునటుదూఁటుచున్న తుమ్మెదల నెడు నిగిడ్చిన చూపులుగలదై, వికచ కుసుమ కాన్తి చ్ఛద్మనా = విరిసిన పువ్వుల కాంతియనెడు (ఛద్మనా =) మిషచేత, విహసతి = నవ్వుచున్నది.

ఉత్క.

---

సంకేతస్థలం ప్రతి భర్తు రనాగమనకారణం యాఽలోచయతి సోత్కా. అవధిదివసానాగతపతికాయాం ప్రోషితభర్తృకాయాం నాతివ్యాప్తిః, తస్యా భర్తు రవధిదివసే భవనాగమననియమ ఇతి సఙ్కేతపదేన వ్యావర్తనాత్. అస్యా శ్చేష్టాః - అరతి సంతాప జృమ్భాఽఙ్గాకృష్టి కమ్ప రుదిత స్వావస్థాకథనాదయః.

సంకేతస్థలమునకు భర్త రానందునకు కారణమును ఎవతె యాలోచించునో ఆ నాయిక ఉత్క. (ఈలక్షణమునకు) గడువుదినమున భర్త రానట్టి ప్రోషితభర్తృకయందు అతివ్యాప్తి లేదు, (ఏల యన -) ఆమెయొక్క భర్తకు గడువుదినమున ఇంటికి రావలసిననియమము ఉండుటంబట్టి సంకేతపదముచేత (ఆనాయికను) తప్పించుటవలన. ఈమెయొక్క చేష్టలు - అప్రీతి, జ్వరము, ఆవులింత, ఒడలు విఱుచుకొనుట, వణఁకు, ఏడ్పు, తనయవస్థను చెప్పుకొనుట, లోనగునవి.

ము గ్ధోత్కా- యథా.

యదద్యాపి సమాగతః పతి రతః ప్రాయః ప్రపేదే పరాం
మిత్థం చేతసి చిన్తయ న్త్యపి సఖీం న వ్రీడయా పృచ్ఛతి,
దీర్ఘం న శ్వసితం దధాతి, చకితం న ప్రేక్షతే, కేవలం
కిఞ్చి త్పక్వ పలాణ్డు పాణ్డుర రుచిం ధత్తే కపోలస్థలీమ్. ౫౯.

యత్ అద్య అపి-పతిః న సమాగతః = ఏల ఇప్పటికి ని పతి రా లేదో, అతః ప్రాయః పరాం ప్రపేదే = అందుచేత ప్రాయికముగా అన్యకాంతను గూడినాఁడు; ఇత్థం చేతసి చిన్తయన్తీ అపి = ఇట్లు మనస్సులో తలంచుచున్నది అయినను, వ్రీడయా సఖీం న పృచ్ఛతి = (నాయిక) లజ్జచేత చెలిని (ఏల రాఁ డాయెను అని) అడుగదు, దీర్ఘం నిశ్వసితం న దధాతి = నిడుద యూర్పును నిగుడ్పదు, చకితం న ప్రేక్షతే= బెదరుచు (అతనిని) ఎదురుచూడదు, (మఱి), కిఞ్చిత్...రుచిం కపోలస్థలీం కేవలం ధత్తే = దోరగా పండిన నీరుల్లివలె పాండువర్ణముకలవైన గండస్థలములను (కపోలస్థలీమ్-జాత్యేకవచనము) మాత్రము ధరించినది ( - గండస్థలములు దోర పండిననీరుల్లివర్ణముగా పాలిపోయిన వని యర్థము. కేవలశబ్దముచేత ఈమదనకార్యమునుమాత్రము అణఁపఁజాల దాయె నని యభిప్రాయము.) మదనకార్యము లయినప్రశ్ననిశ్వాసప్రేక్షణములను లజ్జచే నడంచినది గావున ముగ్ధ, సంకేతమునకు పతిరానందులకారణము నాలోచించుటచే ఉత్కా. రామి అవధిదినమునకుఁగా దనియు సంకేతస్థలమున కనియు అన్యకాంతను గూడె ననుశంకచే తెలియవచ్చుచున్నది.

మ ధ్యోత్కా- యథా.

ఆనేతుం న గతా కిము ప్రియసఖీ? భీతో భుజఙ్గాత్ కిము?
క్రుద్ధో వా ప్రతిషేధవాచి కి మసౌ ప్రాణేశ్వరో వర్తతే?
ఇత్థం కర్ణసువర్ణకైతకరజఃపాతోపఘాతచ్ఛలా
దక్ష్ణోః కాపి నవోఢనీరజముఖీ బాష్పోదక ముఞ్చతి. ౬౦.

ప్రియసఖీ ఆనేతుం గతా న కిము = చెచ్చెలి (ప్రాణేశ్వరుని) తోడితెచ్చుటకు పోలేదా యేమి? అసౌ ప్రాణేశ్వరః భుజఙ్గాత్ భీతః కిము = ఈప్రాణేశ్వరుఁడు (ఆదారిలో కల దని ఎన్నఁబడిన) పామునకు వెఱచినాఁడా యేమి? (అథ) వాఁ అట్లుగాదేని, ప్రతిషేధ వాచి (మయి) క్రుద్ధో వర్తతే కిమ్ = (లజ్జావశముచేత) సురతము) వలదని (నిన్న నేను) అన్నమాటకు (నాపై) కోపమువహించియున్నాఁడా యేమి? ఇత్థమ్ = ఇట్లని (తలపోయుచు), కాపి నవోఢ నీరజముఖీ = ఒకానొక నవోఢ సరో

జానన, అక్ష్ణోః కర్ణ సువర్ణకేతక రజః పాత ఉపఘాత చ్ఛలాత్ బాష్ప ఉదకం ము ఇృతి = కన్నులలో చెవియందలి గేదంగి ధూళియొక్క పాటువలని మంటయను (ఛ లాత్ =) మిషచేత కన్నీళ్లను విడుచుచున్నది. మిష పెట్టి కన్నీళ్లువిడుచుటచే సమానలజ్జామదన గావున మధ్య, సంకేతమునకు రామికి కారణ మరయుచున్నది గా వున ఉత్క. నాయకునిరామి సంకేతమున కనియు అవధిదినమునకుఁ గాదనియు దూతీప్రేషణ భుజ్జభ యాది కథనముచే తెలియుచున్నది.

ప్రౌఢోత్కా యథా.

భ్రాత ర్నికుఞ్జ, సఖి యూథి, రసాల బన్ధో,
మాత స్తమస్విని, పిత స్తిమిర, ప్రసీద;
పృచ్ఛామి కిఞ్చి దితి, నీరధరాభిరామో
దామోదరః కథయ కి న్న సమాజగామ.　　౬౧.

గోపిక పలుకుచున్నది.—భ్రాతః...బన్ధో రసాల...ప్రసీద = అన్నా పొద రిల్లా, చెలీ అడవిమొల్లా, చుట్టమా తీయమామిడీ, అమ్మా రాత్రీ, నాయనా చీఁకటీ, కరు ణింపుము; ఇతి కిఞ్చిత్ పృచ్ఛామి = ఇదిగో ఒకవిషయము అడిగెదను, నీరధర అభి రామః దామోదరః కిం న సమాజగామ కథయ = మేఘునివలె (మేఘశ్యాముఁడై) మనోహరుఁడైన శ్రీకృష్ణుఁడు ఏల రాలేదో చెప్పుము. నాయకుఁడు రానందుల కారణమును ప్రకాశముగా అడుగుటచేత ప్రౌఢోత్క. ఇందలిసంబుద్ధు లన్నియు లింగో చితములుగాను ఆయావస్తువు లొనర్చునుపకృతి కర్తృములుగాను ఉన్నవి.

పరకీయోత్కా యథా.

స్నాతం వారిదవారిభి, ర్విరచితో వాసో ఘనే కాననే,
శీతై శ్చన్దనబిన్దుభి ర్మనసిజో దేవః సమారాధితః,
నీతా జాగరణవ్రతేన రజనీ, వ్రీడా కృతా దక్షిణా,
త త్తం కి న్న తపః? స్తథాఽపి స కథం నా ద్యాపి నేత్రాతిథిః?

(కర్తృకప్రయోగముగా టీక).—(నాయిక తనచర్యను తపశ్చర్యగా వర్ణించు చున్నది:) వారిద వారిభిః స్నాతమ్ = మేఘ జలములలో స్నానమాడితిని, ఘనే కా ననే వాసః విరచితః = కా అడవిలో నివాసము చేసితిని, మనసిజో దేవః శీతైః చన్ద నబిన్దుభిః సమారాధితః = కామ దేవుని చల్లని గంధపు బొట్లతో పూజించితిని, రజనీ జా గరణ వ్రతేన నీతా = రాత్రిని జాగారపు నియమమునఁ గడపితిని, వ్రీడా దక్షిణా కృ తా = లజ్జను (తపస్సాద్గుణ్యార్థము) దక్షిణగా ఇచ్చితిని; తపః న త త్తం కిమ్ = (ఇ

విధమున) తపస్సుచేయు చుంటి నా (చేయనే చేసితి ననుట), తథా అపి = అట్లు న్న, సః అద్య అపి కథం నేత్రాతిథిః న = అతఁడు ఇప్పటికి ని ఏల కనువిందు గాఁడాయె ను? లజ్జ నుజ్జగించి, వానలోఁ దొప్పదోఁగుచు, కాఱడవిలోనియీసంకేతస్థలమున కువచ్చి, నాయులందినగందంపుమైపూఁత వానకుఁ దడిసి బొట్టుబొట్టుగా రాలుచుండ, వల్లభు నెదురుసూచుచు, రాత్రియెల్ల మేలుకొనియుంటిని; ఇంకను రాఁడాయెను; ఏమి కారణమో! అనుట. స్నాన వనవాస దేవపూజా జాగరణ దానములు తపోఽంగములు; అవి జరిగినవి గాని అందులసిద్ధి (ప్రియుఁడు ప్రత్యక్ష మగు ట) లేకపోయె నని యర్థము. తపస్సులకు సయితము దుర్లభుఁ డని ప్రియునిసౌభాగ్యాతిశయము ధ్వనిత మగుచున్నది.

ప్రియునిరామికి కారణ మరయుటచే ఉత్క, స్వీయ ఎప్పటికిని వ్రీడను వదలదు గావునను సామాన్యకు అది లేనే లేదు గావునను తత్త్యాగోక్తిచే పరకీయ.

సామాన్యోత్కా యథా.

> కథ న్న కాన్తః సముపైతి కుఞ్జ,
> మిత్థం చిరం చేతసి చిన్తయన్తీ
> ప్రాశాళయ న్నిష్పతదశ్రువారా
> వారాఙ్గనా కాపి ధనాభిలాషాత్. ౬౩.

కాన్తః కుఞ్జం కథం న సముపైతి = కాంతుఁడు పొదరింటికి ఏల రా లేదు, ఇత్థం...యన్తీ = ఇట్లని చాలసేపు మనస్సులో తలపోసినదై, కాపి వారాఙ్గనా = ఒకానొక వేశ్య, ధన అభిలాషాత్ నిష్పతత్ అశ్రువారా (కుఞ్జం) ప్రాక్షాళయత్ = విత్తమందలి యాశచేత (తనకు రాఁదగినధనము రాకపోయె ననుశోకముచేత) ఉప్పతిల్లు చున్న బాష్ప జలముతో (ఆపొదరింటిని) కడిగెను.

## వాసకసజ్జ.

> అద్య మే ప్రియవాసర ఇతి నిశ్చిత్య యా సురతసామగ్రీం సజ్జీకరోతి సా వాసకసజ్జా; వాసకో వారః; అస్యా శ్చేష్టాః - మనోరథ సఖీపరిహాస దూతీప్రశ్న సామగ్రీసంపాదన మార్గవిలోక నాదయః.

నేఁడు నాప్రియుని (ప్రియుఁడు వచ్చెడు) దినము అని నిశ్చయించుకొని ఎవతె సంభోగసామగ్రిని సిద్ధపఱుచుకొనునో ఆమె వాసకసజ్జ (యనంబడును); వాసకము

= వారము; ఈమెయొక్క వ్యాపారములు - కోరికలు, చెలిమొగతాళి, దూతిని ప్రశ్నించుట, భోగ్యపదార్థములను సమకూర్చుట, దారి చూచుట, లోనగునవి.

ముగ్ధా వాసకసజ్జా యథా,

హారం గుమ్ఫతి తారకాన్తిరుచిరం, గ్రథ్నాతి కాఞ్చీలతాం,
దీపం న్యస్యతి, తత్ర కిం తు బహుళం స్నేహం న దత్తే పురః,
ఆలీనా మితి వాసకస్య రజనౌ కామానురూపాం క్రియాం
సాచిస్మేరముఖీ నవోఢసుముఖీ కాచిత్ సముద్వీక్షతే. ౬౮.

కాచిత్ నవోఢ సుముఖీ వాసకస్య రజనౌ = ఒకానొక నవోఢ సుందరానన (ప్రియుఁడు వచ్చెడు) నాఁటి రాత్రియందు, తార కాన్తి రుచిరం హారం గుమ్ఫతి = ఆణిముత్తెముల జిగిచేత వెలుంగుగలదైన పేరును గ్రుచ్చును, కాఞ్చీ లతాం గ్రథ్నాతి = మొల్లతాటితీఁగను (తీఁగవంటి మొల్లతాటిని) గ్రుచ్చును, దీపం న్యస్యతి కింతు తత్ర పురః బహుళం స్నేహం న దత్తే = దీపము పెట్టును కాని (వెలుతురులో తనకు లజ్జయగు నని) ఆదీపమందు (అనఁగా ఆదీపముయొక్క ప్రమిదయందు) (పిమ్మటవలయునేని పెట్టవచ్చు నని) విస్తారము నూనె యిడదు, ఇతి=ఇవ్విధమున, (ఇట్లు చేయునదై), సాచి స్మేర ముఖీ (సతీ)=(ఒకప్రక్కకు) మరలిన నగు మొగముగల (దై), ఆలీనాం కామ అనురూపాం క్రియాం సముద్వీక్షతే = (లజ్జచే) గూఢంబు (ను తన) మనోరథంబులకు తగినది (యు నగు) (సురత) వ్యాపారమును ఎదురునూచుచున్నది. లజ్జాతిశయముచే ముగ్ధ, సజ్జనముచే వాసకసజ్జ.

మధ్యా వాసకసజ్జా యథా.

శిల్పం దర్శయితుం కరోతి కుతుకాత్ కహ్లారహారిస్రజం,
చిత్రప్రేక్షణకైతవేన కిమపి ద్వారమ్ముహు ర్వీక్షతే,
గృహ్ణా త్యాభరణం నవం సహచరీభూషాజిగీషామిషా,
దిత్థం పద్మదృశః ప్రతీత్య చరితం స్మేరాననోఽభూత్ స్మరః. ౬౯.

(ఒకానొక నాయిక), శిల్పం దర్శయితుం కుతుకాత్ కహ్లార హారి స్రజం కరోతి =(దండగ్రుచ్చు) విద్దెను (- ఆవిద్యయందు తనకుఁ గల నేర్పును) (చెలులకు) చూపుటకు ఉత్సాహముచేత (చూపు నెపమున) ఎఱ్ఱగలువలచే రమణీయమయిన దండను గ్రుచ్చును, చిత్ర...క్షతే = (ద్వారపార్శ్వముల గోడయందు వ్రాయఁబడిన) చిత్తరువును చూచు నెపమున ఏమో వింతపడుచు ద్వారమును మాటిమాటికిఁ గాంచును, సహచరీ భూషాజిగీషా మిషాత్ నవమ్ ఆభరణం గృహ్ణాతి=చెలుల నగవులను గెలువఁగోరుటయను నె-

పమున క్రొత్త నగను ధరించును; ఇత్థం పద్మదృశః చరితం ప్రతీత్య స్మరః స్మేర ఆననః అభూత్ = ఇవ్విధమున కమల నయనయొక్క చర్యను ఎఱింగి మదనుఁడు చిఱునగవుతోఁడి మోముగలవాఁడు ఆయెను. స్రగాభరణధారణము సజ్జనము, ద్వారము నూచుట, కాంతు నెదురునూచుట, ఇవి మదనకృత్యము - వీనికి నెపములు పన్నుట లజ్జా కృత్యము - రెండును తుల్యబలములు కాన ఈనాయిక మధ్య వాసకసజ్జ.

ప్రగల్భా వాసకసజ్జా యథా.

కృతం వపుషి భూషణం, చికురధోరణీ ధూపితా,
కృతా శయనసన్నిధౌ క్రముకవీటికాసంభృతిః,
అకారి హరిణీదృశా భవన మేత్య దేహత్విషా
స్ఫురత్కనక కేతకీకుసుమకాన్తిభి ర్దుర్దినమ్. ౬౬.

(కర్తర్థప్రయోగమున టీక.)—హరిణీ దృశా = మృగీ నయన, వపుషి భూషణం కృతమ్ = మేన అలంకారమును దాల్చెను, చికుర ధోరణీ ధూపితా = తలవెండ్రుకల మొత్తమునకు (పరిమళ) ధూపముపట్టించుకొన్నది, శయన సన్నిధౌ క్రముక వీటికా సంభృతిః కృతా = పానుపు నొద్ద వక్కలయొక్కయు తములపాకులయొక్కయు సంభారమును సిద్ధపఱిచినది, (అనంతరము), భవనమ్ ఏత్య దేహ త్విషా స్ఫురత్ కనక కేతకీ కుసుమ కాన్తిభిః దుర్దినమ్ అకారి = పడకటింటిని చొచ్చి (తన) మేని బిగిచేత వెలుఁగొందుచున్న (జడలోని) గేదంగి పూవుల కాంతులచేత మబ్బుగమ్మినదినము ను చేసినది (గేదంగిపూవులకాంతి ఆమెదేహకాంతిచేత మఱియు దేదీప్యమానమై దట్టముగా పడకటి ల్లంతయు నిండె నని భా.) సజ్జన మెల్ల స్వయముగా నొనర్చుకొనుటచే ప్రౌఢ వాసకసజ్జ.

మనోరథో యథా.

ఆవయో రఙ్గయో ర్ద్వైతే భూయోవిరహవిప్లవః,
అద్వైతే చ స్థితస్ఫీతం న స్యా దన్యోన్యవీక్షణమ్. ౬౭.

ఒకానొకనాయిక సఖితో చెప్పుచున్నది.—ఆవయో...విప్లవః (స్యాత్) = మాయిరువుర దేహములకును ద్విత్వమందు (అతనిదేహంబును నాదేహంబును వేర్వేఱుగా రెండుగా నుండుచెడల) ఎక్కువ విరహంపు టుపద్రవము (కలుగును), అద్వైతే చ స్థిత స్ఫీతమ్ అన్యోన్యస్య వీక్షణం న స్యాత్ = ఏకత్వమం దైననో (రెండుదేహములును రెండుగా నుండక ఒక్కటియె యగునేని) చిఱునవ్వుచేత పుష్టమైన ఒండొరుల దర్శనము ఉండదు.

పరకీయా వాసకసజ్జా యథా.

శ్వశ్రూం స్వాపయతి, చ్ఛలేన చ తిరోధత్తే ప్రదీపాఙ్కురాన్,
ధత్తే సౌధకపోతపోతనినదైః సాఙ్కేతికం చేష్టితమ్,
శశ్వత్పార్శ్వవివర్తితాఙ్గలతికం లోలత్కపోలద్యుతి
క్వాపి క్వాపి కరామ్బుజం ప్రియధియా తల్పాన్తికే న్యస్యతి. ౬౮.

(ఒకానొకతె) శ్వశ్రూం ఛలేన స్వాపయతి చ = అత్తను మిషచేత నిద్రఁబుచ్చును (మఱియు), ప్రదీప అఙ్కురాన్ తిరోధత్తే = దీపపు మొగ్గలను మఱుఁగుపఱుచును, సౌధ కపోత పోత నినదైః సాంకేతికం చేష్టితం ధత్తే = మేడమీఁది పావురపుఁ బిల్లల గుబాళింపులచేత సంకేతముకొఱకైన చేఁతను చేయును, శశ్వత్ పార్శ్వ వివర్తిత అఙ్గ లతికమ్ = మాటిమాటికి ప్రక్కకు దొరలింపఁబడిన (దొరలిన) మేని తీఁగగలుగునట్లుగాను, లోలత్ కపోల ద్యుతి = ప్రసరించుచున్న చెక్కుల్ల తేజుగలుగునట్లుగాను, తల్ప అన్తికే = సెజ్జ చెంతను, క్వాపి క్వాపి = ఎక్కడెక్కడనో, ప్రియ ధియా = ప్రియుఁడు (వచ్చి నిలిచి యున్నాఁడేమో) అనుతలంపుచేత, కర అమ్బుజం న్యస్యతి = కేలుఁదామరను ఉంచును. అప్రకటసజ్జనముచేతను కపోతపోతనినదసంకేతముచేతను పరకీయ వాసకసజ్జ.

సామాన్యా వాసకసజ్జా యథా.

చోళం నీలనిచోళకర్షణవిధౌ, చూడామణిం చుమ్బనే,
యాచిష్యే, కుచయోః కరార్పణవిధౌ కాఞ్చీం పునః కాఞ్చనీమ్,
ఇత్థం చన్దనచర్చితైర్మృగమదైః రఙ్గాని సంస్కుర్వతీ
తత్ కిం యన్న మనోరథం వితనుతే వారేషు వారాఙ్గనా.

నీల...ధౌ చోళమ్ = (నా) నల్లని దుప్పటిని (అతఁడు) లాగు పనియందు (సమయమందు) (తెలపొడుగు) రవికను, చుమ్బనే చూడా మణిమ్ = మోవియానుటయందు సిగరత్నమును, పునః = ఇంక, కుచ...ధౌ కాఞ్చనీం కాఞ్చీమ్ = చన్నులమీఁద చేయి యుంచు పనియందు బంగారపు మొలత్రాటిని, యాచిష్యే = అడిగెదను; ఇత్థ...ర్వతీ = ఈవిధముగా (ధనాశచే) గంధముతోఁగలిపిన కస్తూరులతో అవయవములను తావిగొల్పుచు, వారాఙ్గనా వారేషు యత్ మనోరథం న వితనుతే తత్ కిమ్ = వేశ్య సంకేతదినములయందు ఏవస్తువునందు కోరికను వహింపదో ఆవస్తువు ఏది? (ఏదియు లేదనుట.) యత్ - అవ్యయము.

## స్వాధీనపతిక.

సదా సాకూతాఽఽజ్ఞాకర ప్రియతమా స్వాధీనపతికా. అస్యా శ్చేష్టాః వనవిహారాది మదనమహోత్సవ మ దాహంకార మనోరథావాప్తి ప్రభృతయః.

ఎప్పుడును సాభిప్రాయసంజ్ఞలచే నెఱుకపడు నాజ్ఞలను నెఱవేర్చెడు ప్రియతముఁడుగలది స్వాధీనపతిక (యనంబడు). (అనఁగా బొమ్మసైగలు లోనగుసాభిప్రాయచేష్టల చేత నాయిక తెలియఁబఱుచునట్టియాజ్ఞలను సర్వదా నాయకుఁడు నెఱవేర్చుచుండునేని ఆనాయికకు స్వాధీనపతిక యని సంజ్ఞ.) ఈమెయొక్క వ్యాపారములు - వనవిహారాదికము, మనోరథలబ్ధి, లోనగునవి.

ముగ్ధా స్వాధీనపతికా యథా.

మధ్యే న క్రశిమా, స్తనే న గరిమా, దేహే న వా మజ్జిమా,
శ్రోణ్యో న ప్రథిమా, గతౌ న జడిమా, నేత్రే న వా వక్రిమా,
లాస్యే న ద్రఢిమా, న వాచి పటిమా, హాసే న వా స్ఫాతిమా,
ప్రాణేశస్య త థాపి మజ్జతి మనో మ య్యేవ కిం కారణమ్? ౭౦.

ముగుద సఖితో పల్కుట.—(నాకు), మధ్యే క్రశిమా న = నడుమున సన్నఁదనము లేదు, స్తనే గరిమా న = (స్తనే అని జాత్యేకవచనము) కుచములయందు బరువు లేదు, దేహే మజ్జిమా వా న = ఒడలియందు సౌందర్యంబు ను లేదు, శ్రోణ్యో ప్రథిమా న = పిఱుందునందు వైశాల్యము లేదు, గతౌ జడిమా న = నడకయందు మందత లేదు, నేత్రే వక్రిమా వా న = కంటియందు (చూపులందు) వంకర యును లేదు, లాస్యే ద్రఢిమా న = ఆటయందు దిట్టతనము లేదు, వాచి పటిమా న = మాటయందు నేర్పు లేదు, హాసే స్ఫాతి మా వా న = నవ్వునందు ప్రాగల్భ్యముయొక్క లక్ష్మియు లేదు, తథా అపి = అట్లు అయినను, ప్రాణేశస్య మనః మయి ఏవ మజ్జతి కారణం కిమ్ = (నా) ప్రాణేశ్వరుని మనస్సు నాయందే మునింగియున్నది కారణ మేమి? ఆయాగుణములు లే వనుటయందు, లక్షణచేతఁగాని, (నష్టునకుఁ గల యాపదగ్గ ముంబట్టిగాని), కొంచెపాటిగాఁ గలవే గాని విస్తారముగా లే వని యభిప్రాయము.

మధ్యా స్వాధీనపతికా యథా.

యదపి రతిమహోత్సవే నకారో,
యదపి కరేణ చ నీవిధారణాని,

ప్రియసఖి పతి రేష పార్శ్వదేశం
త దపి న ముఞ్చతి చేత్ కి మాచరామి. ౨౧.

నాయిక చెప్పుట.—ప్రియసఖి = నెచ్చెలీ, రతి మహోత్సవే న కారః య దపి = మరుకేళి యనెడు పెనుఁబండువునందు (నాచే) నిషేధము చేయఁబడినను (వలదు వల దని నే నెంత నిషేధించినను), కరేణ నీవి ధారణాని య దపి చ = చేతితో పోఁకముడిని పట్టుకొన్నప్పటికిని (అతఁడు నాపోఁకముడిని సడల్పఁజొచ్చినప్పుడు నేను సడల్పనీయకుండ నాచేతితో పోఁకముడిని గట్టిగా పట్టుకొన్నను), తదపి=అప్పటికిని, ఏష పతిః పార్శ్వదేశం న ముఞ్చతి చేత్ కిమ్ ఆచరామి = ఈయన నాథర్త (నా) పార్శ్వప్రదేశమును వదలఁ డేని ఏమి చేయుదును (వదలకున్నాఁ డే ఏమిచేయుదును). భర్తృ వాల్లభ్యాతిశయముచే స్వాధీనపతిక, నీవిని గట్టిగా పట్టుకొనుటచేతను రతిని మహోత్సవ మనుటచేతను సమానలజ్జామదన గావున మధ్య.

ప్రౌఢా స్వాధీనపతికా యథా.

న క్త్రస్యాధరపల్లవస్య వచసో లాస్యస్య హాస్యస్య వా
ధన్యానా మరవిన్దసున్దరదృశాం కాన్త స్తనోతి స్తుతిమ్;
స్వప్నే నాపి న గచ్ఛతి శ్రుతిపథం చేతఃపథం దృక్పథం
కా ప్యన్యా దయితస్య మే సఖి కథం త స్యాస్తు భేదగ్రహః? ౨౨.

సఖి = ఓ చెలీ, కాన్తః అరవిన్ద సున్దర దృశాం ధన్యానాం వక్త్రస్య అధర పల్లవస్య వచసః లాస్యస్య హాస్యస్య వా స్తుతిం తనోతి = (లోకములో) వల్లభుఁడు తామరలవలె సొగసైన కన్నులుగల యదృష్టవంతురాండ్రయొక్క మొగమును మోవిచిగురును మాటను ఆటను నవ్వును స్తోత్రము చేయును, (వాశబ్దము సముచ్చయార్థకము); మే దయితస్య అన్యా కాపి స్వప్నే వా అపి శ్రుతిపథం చేతఃపథం దృక్పథం న గచ్ఛతి = నా వల్లభునికి ఇతరవనిత యెవ్వతెయు కలలో నేని యతని శ్రవణమార్గమును మనోమార్గమును నేత్రమార్గమును చొరదు; తస్య భేద గ్రహః కథమ్ అస్తు = ఆ యనకు భేద జ్ఞానము ఎట్లు కలుగును (ఇతరవనితలను దలంపనందున నావక్త్రాదికమున కును వారివక్త్రాదికమునకును గలతారతమ్యము నెఱుంగనందున నావక్త్రాదికమును నాద యతఁడు పొగడుట లేదు, కావున వారివంటి ధన్యను నేను గాను అని యర్థము. నేనే ధన్య నని భావము.) భర్తృవాల్లభ్యాతిశయాహంకారముచేత స్వాధీనపతిక, అయ్యహంకారము ధ్వనితముగాన ప్రౌఢ.

పరకీయా స్వాధీనపతికా యథా.

స్వీయాః స న్తి గృహే సరోరుహదృశో యాసాం విలాసక్వణత్
కాఞ్చీ కుణ్డల హేమకఙ్కణ ఝణత్కారో న విశ్రామ్యతి;

కో హేతుః సఖి కాననే పురపథే సౌధే సఖీసన్నిధౌ
భ్రామ్యన్తీమపి వల్లభస్య పరితో దృష్టి ర్న మాం ముఞ్చతి? 23.

సఖి = ఓచెలీ, (వల్లభస్య) గృహే = (ప్రియుని) యింట, యాసాం ... విభ్రామ్యతి = ఎవతెలయొక్క లీలాగమనాదికముచేత మ్రోఁగుచున్న - మొలనూలు కమ్మలు బంగారుగాజులు - అనువీని మ్రోఁత ఎడతెగదో, (అట్టి), స్వీయాః సరోరుహదృశః సన్తి=వివాహితలైన తామరసాక్షులు కలరు, (తథా) అపి = ఇట్లున్నను, కాననె పురపథే సౌధే సఖీ సన్నిధౌ పరితః భ్రామ్యన్తీం మామ్ = అడవిలోను ఊరి దారిలోను మేడయందును చెలుల చెంతను అచ్చటచ్చట సంచరించుచుండు నన్ను, వల్లభస్య దృష్టిః = చెలువుని చూపు, న ముఞ్చతి = వదలదు, కో హేతుః = (ఇందులకు) కారణము ఏమి(చెప్పుము అనుట). ఏదో ఒకవ్యాజంబున నతఁడు నిరంతరమును నన్నే చూచుచునుండు నని యర్థము. అతనియనురక్త్యతిశయము భా. దానిచే స్వాధీనపతిక, 'స్వీయాః సన్తి' - అనుటచేత తాను స్వీయ గాదు, ధనాపేక్ష లేదు గాన వేశ్య గాదు, కావున పరకీయ.

వేశ్యా స్వాధీనపతికా యథా.

సన్త్యేవ ప్రతిమన్దిరం మృగదృశో యాసాం సుధా సాగర
స్రోత స్స్యూత సరోజ సున్దర చమత్కారా దృశో విభ్రమాః
చిత్రం కిన్తు విచిత్ర మన్మథ కలా వైశద్య హేతోః పున
ర్విత్తం చిత్తహరం ప్రయచ్ఛతి యువా మ య్యేవ కిం కారణమ్?

(హే సఖి = ఓచెలీ), యాసాం దృశః విభ్రమాః = ఎవతెలయొక్క నేత్రములయొక్క విలాసములు, సుధా...త్కారాః = అమృతపుఁ గడలి ప్రవాహమునందు అంటుకొనియున్న తామరలయొక్క యందమైన యొప్పువంటియొప్పుగలవియో, (తాదృశ్యః) మృగ దృశః = (అటువంటి) హరిణ లోచనలు, ప్రతిమన్దిరం సన్తి ఏవ = ఇంటింటను ఉండనే యున్నారు; కిం తు = అటు లయినను, (అయమ్) యువా = (ఈ) పడుచువాఁడు, విచి...హేతోః = వింతయైన కామశాస్త్రప్రోక్త సురతవ్యాపారములయందలి నేర్పు నిమిత్తము, మయి = నాకు, పునః=మాటికి, చిత్త హరం విత్తం ప్రయచ్ఛతి ఏవ = (నా) మనస్సును హరించునదైన (విస్తారమైన) ధనమును ఇచ్చుచునే యున్నాఁడు, కిం కారణమ్ = (ఇందులకు) ఏమి నిమిత్తము? ఇట విత్తదానమ్మును కేవలము తనమీఁదియనురాగమును చెప్పుటచేత నాయిక వేశ్య స్వాధీనపతిక.

## అభిసారిక.

---

స్వయ మభిసరతి ప్రియ మభిసారయతి వా యా సాభిసారికా.
అస్యా శ్చేష్టాః సమయానురూప వేష భూషణ శఙ్కా ప్ర
జ్ఞా నైపుణ్య కపట సాహ సాదయ ఇతి పరకీయాయాః; స్వీ
యాయా స్తు ప్రకృత ఏవ క్రమః, అలక్ష్యతా సంపాదకస్య శ్వే
తాద్యాభరణగ్రహణస్య స్వీయాభిసారికాయా మసంభవాత్.

ఎవతె ప్రియునికడకు తానే యేఁగునో, ఒండె, ఎవతె ప్రియుని తనకడకు ర ప్పించుకొనునో, ఆనాయిక అభిసారిక (యనం బరఁగును). ఆమెయొక్క వ్యాపారము లు (ఎవ్వి యన) :—పరకీయాభిసారికకు కాలానురూపములయిన వేష భూషణములు (తా నితరులకు గోచరింపకయుండుటకు సాధనభూతముగా వెన్నెలలో తెల్లనివి - చీఁ కటిలో నల్లనివియు,) (ఒరులు కందురోయను) జంకు తెలివి నేర్పు కపటము సాహస ము లోనగునవి; స్వీయాభిసారికకు సహజమగు వేషభూషాదికమే, స్వీయాభిసారిక కాన రాకుండుటకై శ్వేతనీలముగా భూషలను దాల్పదు గాన.

ముగ్ధాభిసారికా యథా.

దూతీ విద్యు దుపాగతా, సహచరీ రాత్రిః సహస్థాయినీ,
దైవజ్ఞో దిశతి స్వనేన జలదః ప్రస్థానవేళాం శుభామ్,
వాచం మాఙ్గలికీం తనోతి తిమిరస్తోమోఽపి ఝిల్లీరవై,
ర్జాతోఽయం దయితాభిసారసమయో ముగ్ధే విముఞ్చ త్రపామ్.

అభిసరించుటకు తామసించుచున్న నాయికతో సఖి పలుకుట.—(దారిచూపు టకు) విద్యుత్ దూతీ ఉపాగతా = మెఱపుఁదీఁగయనెడు దూతి వచ్చియున్నది (నీవు త్వరగా తరలవేని అది విసుగు చెందు నని భా.), రాత్రిః సహచరీ సహ స్థా యినీ = రాత్రియనెడు చెలికత్తియ కూడనే యుండునది (వెండియు నీవు ఇల్లు చే రువఱకు నీకు తోడుగా నుండు ననియు తామసింతువేని మఱల ఇల్లుసేరకముందే తెల్లవాఱి నీగుట్టు బట్టబయ లగు ననియు భా.), జలదః దైవజ్ఞః స్వనేన శుభాం ప్రస్థాన వేళాం దిశతి = మేఘుఁడనెడు జోస్యుఁడు ఉఱుముచేత మంగళమైన ప్రయాణ సమయము ను చెప్పుచున్నాఁడు (ఈయుఱుముచే మరుబారిం బడి వేగిరపడి నీమనోనాయకుఁడు నీ కై సంకేతస్థలమున కనుపెట్టుకొని యుండును, కాన నీకు కార్యసిద్ధి యగును అని భా.), అపి (చ) తిమిర స్తోమః ఝిల్లీ రవైః మాఙ్గలికీం వాచం తనోతి=మఱి (యు) చీకటి

మొ త్తము ఇలకోడి ధ్వనులరూపమున మంగళకరమయిన వాక్కును (ఆశీర్వాదము నను ట) ప్రకటించుచున్నది (ఈకటికిచీఁకటిలో ని న్నెవ్వరును గనలేరు, ఈయిలకోళ్ళయీ గింగురుశబ్దములో నీనడక నప్పుడు ఎవరికిని వినఁబడదు అని భా.), దయిత అభిసార స మయః అయం జాతః = ప్రియునిగూర్చి యభిసరింపనగు వేళ యిదే వచ్చినది, ముగ్ధే త్రపాం విముఞ్చ = (ఓ) బేలా లజ్జను విడువుము. ముగ్ధాభిసారిక యని స్పష్టము.

మధ్యాభిసారికా యథా.

భీ తాసిౘ నైవ భుజగాత్ పథి, మద్భుజస్య
సఙ్గే పునః కి మపి కమ్ప ముఱీకరోషి,
అమ్భోధరధ్వనిభి రత్రసి తాఽసి, తన్వి,
మద్వాచి సాచివద నాఽసి, కి మాచరామి? ౭౬.

సంకేతస్థలము చేరిననాయికతో ప్రియుఁడు పలుకుట.—తన్వి=ఓసుందరీ, పథి భుజగాత్ భీతా నైవాసి (= న ఏవ అసి) = దారిలో పామునకు వెఱచినదానవు కానే కావు (దారిలో పాము కల దని కింవదంతి యున్నను వెనుదివియక వచ్చితివి, అ ని భా.), మత్ భుజస్య సఙ్గే పునః కమ్ అపి కమ్పమ్ ఉరీకరోషి = నా బాహువు యొక్క యాలింగనమునకు అయిననూ ఏమో యనిర్వచనీయమైన వణఁకును దాల్చెద వు; (చంపెడుదానిని సరకుసేయక కాచెడుదానికి వెఱచుట యాశ్చర్య మని ధ్వని. ల జ్జాపరవశవై సంభోగము మానుదు వేని నీవు ఇంతసాహసము చేసి వచ్చినందుల కేమి ఫల ము? కావున, లజ్జ మాని సంభోగాభిముఖివి క మ్మని యభిప్రాయము); అమ్భోధర ధ్వ నిభిః అత్రసిత్వా అసి = మేఘముయొక్క యుఱుములకు బెదరనిదానవు అగుదువు, మత్ వాచి సాచి వదనా అసి = నా మాటకు వెడ మొగముగలదానవు అగుచున్నావు (పై యట్లే యభిప్రాయ మెఱుంగవలయును), కిమ్ ఆచరామి = ఏమి చేయుదును!

సాహసము మదనకార్యము, వణఁకును సాచివదనత్వమును లజ్జాకార్యము; రెం డును సమానములు గావున నాయిక మధ్య; పథీత్యాదివాక్యార్థముచేత నభిసారిక యని యెఱుకవడుచున్నది.

ప్రౌఢాభిసారికా యథా.

స్ఫురదురసిజభారభఙ్గురాఙ్గీ
కిసలయకోమలకాన్తినా పదేన
అథ కథయ కథం సహేత గన్తుం
యది న నిశాసు మనోరథో రథః స్యాత్. ౭౭.

సంకేతస్థలమున కేఁగుదెంచిననాయికను గుఱించి నాయకుఁడు 'నాబలిమాలుటచేత ఈసుందరి వచ్చినది గాని తనకోర్కి-చేతఁ గాదు', అని వాదింపఁగా అతనితో నాయికాసఖి పల్కు-చున్నది.—స్ఫురత్ ఉరసిజ భార భఙ్గుర అఙ్గీ = ఉబుకుచున్న పాలిండ్ల బరువుచేత సోలుచున్న మేనుగలది (ఈచెలువ), మనోరథః రథః న స్యాత్ యది = కోరిక బండి గా దేని, నిశాసు = రాత్రులయందు, కిసలయకోమలకాన్తినా - కిసలయ = చిగురుయొక్క - కోమలకాన్తినా = మృదుకాంతివంటిమృదుకాంతిగలదైన, పదేన = అడుగు (ల) తో, గన్తుం కథం సహేత అథ కథయ = అభిసరించుటకు ఎట్లు ఓపునో మఱి చెప్పుము. బరువు మోచుచు మెత్తనియడుగులతో దారి యగపడని చీఁకటిలో నడచుటవలనిమహాయాసమును సరకుగొనమి మనోరథమహత్త్వముచేతను, కావున ప్రౌఢాభిసారిక.

పరకీయా ఽభిసారికా యథా.

రభసా దభిసర్తు ముద్యతానాం
వనితానాం సఖి, వారిదో వివస్వాన్,
రజనీ దివసో, ఽన్ధకార మర్చి,
ర్విపినం వేశ్మ, విమార్గ ఏవ మార్గః. ౭౮.

'ఇ దేమి యిట్టిసమయములో నభిసరింపఁ గడంగితివి?' అని యడిగినసఖితో నాయిక పలుకుచున్నది.—సఖి = ఓచెలీ, రభసాత్ అభిసర్తుమ్ ఉద్యతానాం వనితానామ్ = వడిగా అభిసరించుటకు దొరకొన్నటువంటి యత్యంతానురక్తలైన చెలువలకు, వారిదః వివస్వాన్ = మేఘుఁడే సూర్యుఁడు, రజనీ దివసః = రాత్రియే పగలు, అన్ధకారమ్ అర్చిః = చీఁకటియే వెలుతురు, విపినంవేశ్మ = అడవియే ఇల్లు, విమార్గ ఏవ మార్గః = పెడదారి యే దారి. సామాన్యముగా లోకులకు (ప్రకాశాదికముచే) సూర్యాదికము పయనమును నెఱవేర్చునట్లే అభిసారికలకు వారిదాదికము (అన్యులను నివారించుటచేత) పయనమును నెఱవేర్చును, కావున నిట వారివిషయమున వారిదాదికము సూర్యాదికముగా చెప్పఁబడినది.

జ్యోత్స్నా ఽభిసారికా యథా. (జ్యోత్స్నా = వెన్నెల.)

చన్ద్రోదయే చన్దన మఙ్గకేషు
విహాస్య విన్యస్య వినిర్గతాయాః
మనో నిహన్తుం మదనో ఽపి బాణాన్
కరేణ కొన్దాన్ బిభ రామ్బభూవ. ౭౯.

చన్ద్రోదయె = నెలపాడుపున - వెన్నెలయందు, అఙ్గేషు చన్దనం విన్యస్య = అవయవములందు గందమును అలందుకొని, విహస్య = నవ్వి, వినిర్గతాయాః = బయలు వెడలిననాయికయొక్క, మనః=హృదయమును, నిహన్తుమ్ = గాడ నేయుటకు, మదనః అపి = మన్మథుండు ను, కరేణ కొన్దాన్ బాణాన్ బిభరామ్బభూవ = చేత మల్లె యలుఁగులను పుచ్చుకొనియెను. పాలలో చేమిరివలెను, చీఁకటిలో కాటుకవలెను, వర్ణభేదము లేనప్పుడు గొప్పవస్తువులో ఇమిడినచిన్న వస్తువులు ప్రత్యేకము కానరావు గావున, విరివి యైనతెల్లనిపండువెన్నెలలో చందనచర్చిత యైననాయిక, నగవు, కుందబాణములును ఇమిడిపోయి ప్రత్యేకము కానరానందున అభిసరణము ఒరులకు తెలియదాయె నని భావము. చందనచర్చ ధావళ్యార్థము, హాసంబును కుందబాణములును ఆధావళ్యమును చిక్కపఱుచుటకు. చందనచర్చ ధవళాంబరాదికమున కుపలక్షణము. మదనుఁడు వేఱువర్ణపుబాణము లేయక తెల్లబాణము లేయుటచేత, అయ్యభిసరణమునకు ప్రీతితో యుక్తితో తోడ్పడియె నని స్వారస్యము.

తమిస్రాభిసారికా యథా. (తమిస్రమ్ = చీఁకటి.)

> నామ్బుజై ర్న కుముదై రుపమేయం
> స్వైరిణీజనవిలోచనయుగ్మమ్,
> నోదయే దినకరస్య న చన్ద్రే
> కేవలే తమసి తస్య వికాసః. ౮౦.

స్వైరి...గ్మమ్—అంకుటాండ్రయొక్కకనుదోయి, అమ్బుజైః ఉపమేయం న = తామరలతో పోల్పఁదగినది కాదు, కుముదైః ఉపమేయం న= తెల్లగలువలతోను పోల్పఁదగినది కాదు, తస్య వికాసః = ఆకన్నుదోయికి వికాసము, దినకరస్య ఉదయే న = సూర్యుని యుదయమందు లేదు, ఇన్దోః ఉదయే వా న = చంద్రునియొక్క ఉదయమం దేనియు లేదు; (మఱి యెప్పు డనఁగా -) కేవలే తమసి = కేవలమైన చీఁకటిలో.

దివసాభిసారికా యథా. (దివసః = పగలు.)

> పల్లీనా మధిపస్య పఙ్కజదృశాం పత్యోత్సవామన్త్రణే
> జాతే, సద్మజనా మిథఃకృతమహాహూతాన్వహం పురః ప్రస్థితాః;
> సవ్యాజం స్థితయో ర్విహస్య గతయోః శుద్ధాన్త మన్తా స్తరే
> యూనోః స్విన్నకపోలయో ర్విజయతే కోఽప్యేష కణ్ఠగ్రహః.

పల్లీనా...జాతే = పల్లెల దొరయొక్క తామరసాక్షులయొక్క (పత్న్యా = ) పున్నమ పండుగునకు (ఆమన్త్రణే = ) పిలుపు కలుఁగఁగా (పల్లెలదొరయొక్కభార్య

లు పున్నమపండువుకై ఊరివారి నెల్ల పిలిపింపఁగా), సక్త...స్థితాః = ఇంటిజనులు (ఇంటివారందఱు) (మిథః = ) ఒండొరులతో చేయఁబడిన (మహత్ = ) గొప్ప జతనము గలుగునట్లుగా ముందుగా తరలినారు; అత్ర అన్తరే = ఈ లోపల, సవ్యాజం స్థితయోః విహస్య శుద్ధాన్తం గతయోః స్విన్న కపోలయోః యూనోః = నెపము పెట్టి వెనుకఁబడి నవ్వుచు అంతఃపురమును చొచ్చి చెమర్చుచున్న చెక్కిళ్ళు గలవారైన యౌవనవంతులయొక్క (గుబ్బెతయొక్కయు కోడెకానియొక్కయు), కోఽపి (= కః అపి) ఏష కణ్ఠగ్రహః = చెప్పనలవిగాని యీ కంఠాలింగనము, విజయతే = సర్వోత్కర్షము గలిగియున్నది. నవ్వుట తమకోరిక నెఱవేఱినది గదా యనుహర్షముచేత; చెమర్చుట సాత్త్వికోదయము.

సామాన్యాఽభిసారికా యథా.

లోలచ్చేలచమత్కృతి ప్రవిలసత్కాఞ్చీలతాఝుంకృతి
స్వఞ్చత్కఞ్చుకబన్ధబన్ధురవలద్వక్షోజకుమ్భోన్నతి
స్ఫూర్జద్దీధితి విస్ఫురద్గతి చలచ్చామీకరాలఙ్కృతి
క్రీడాకుఞ్జగృహం ప్రయాతి కృతినః కస్యాఽపి వారాఙ్గనా. ౭౩.

వారాఙ్గనా = వెలయాలు, లోలత్ చేల చమత్కృతి = తూలుచున్న చీరయొక్క సొంపులుగలుగునట్లుగాను, ప్రవిల...కృతి—ప్రవిలసత్ = మిక్కిలివిలసిల్లుచున్న - కాఞ్చీలతా = లత (తీఁగ) వంటి కాంచి (మొలత్రాటి) యొక్క ఝుంకృతి= ఝుంకారముకలుగునట్లుగాను, స్వఞ్చ...న్నతి—స్వఞ్చత్ = పిక్కటిల్లుచున్న - కఞ్చుక = అవికయొక్క - బన్ధ = ముడిచేత - బన్ధుర = అందమైన - వలత్ = ఊఁబుకుచున్న - వక్షోజకుమ్భ = (కుమ్భ = ) గిండులవంటి (వక్షోజ = ) పాలిండ్లయొక్క - ఉన్నతి = పొడవుగలుగునట్లుగాను, స్ఫూ...తి - స్ఫూర్జత్ = వ్యాపించుచున్న - దీధితి = (మేని) జిగిగలుగునట్లుగాను, వి స్ఫురత్ గతి = మిక్కిలి సొంపారుచున్న నడకగలుగునట్లుగాను, చలత్ చామీకర అలంకృతి = కదలుచున్న పసిఁడి నగలుకలుగునట్లుగాను, కస్య అపి కృతినః క్రీడా కుఞ్జ గృహం ప్రయాతి = ఎవఁడో ఒక ధన్యునియొక్క కేళి పొదరింటికి పోవుచున్నది.

[ఇంతఁజఱకుం జెప్పినయష్టవిధనాయికా నిరూపణము ప్రాచీనమతానుసారమునని చెప్పుచున్నాఁడు:]—

ముగ్ధాయా లజ్జాప్రాధాన్యేన, మధ్యాయా లజ్జామదనసామ్యేన, ప్రగల్భాయాః ప్రాకాశ్యప్రాధాన్యేన,ధీరాయా ధైర్యప్రాధాన్యేనా,ఽధీరాయా అధైర్యప్రాధాన్యేన, ధీరాధీరాయా ధైర్యాధై

ర్య ప్రాధాన్యేన, జ్యేష్ఠాయాః స్నేహాధిక్య ప్రాధాన్యేన, కనిష్ఠా
యాః స్నేహన్యూనత్వ ప్రాధాన్యేన, పరోఢాయాః సఙ్గుప్తి ప్రా
ధాన్యేన, ముగ్ధాయా ఇవ కన్యాయా అపి లజ్జా ప్రాధాన్యేన, సా
మాన్యవనితాయా ధనప్రాప్తి ప్రాధాన్యేనా, ఽష్టవిధనాయికా
వర్ణన మితి విశేషః.

[ముగ్ధ లోనగు పదునొకండుగురలో ఒక్కొక్కతెకును అష్టవిధనాయికాభేదములను చెప్పుటయందు ఆముగ్ధాదులకు ఏయేగుణము ప్రధానముగా గ్రహింపఁబడినదో అది యెద్ది యనినః]—

ముగ్ధకు లజ్జా ప్రాధాన్యముచేతను మధ్యకు లజ్జామదనప్రాధాన్యముచేతను ప్రగల్భకు ప్రకటత్వప్రాధాన్యముచేతను, ధీరకు ధైర్యప్రాధాన్యముచేతను, అధీరకు అధైర్య ప్రాధాన్యముచేతను, ధీరాధీరకు ధైర్యాధైర్యప్రాధాన్యముచేతను, జ్యేష్ఠకు స్నేహాధిక్య ప్రాధాన్యముచేతను, కనిష్ఠకు స్నేహన్యూనతా ప్రాధాన్యముచేతను, పరోఢకు (ఇతరు లెఱుంగనియట్లుగా) (సంగుప్తి = ) మఱుఁగుసేయుటయొక్క ప్రాధాన్యముచేతను, ముగ్ధకుం బోలె కన్యకు లజ్జాప్రాధాన్యముచేతను, సామాన్యవనితకు ధనప్రాప్తిప్రాధాన్యముచేతను, అష్టవిధనాయికలను చెప్పుట యని విశేషము.

## ప్రవత్స్యత్పతిక.

"ప్రస్థానం వలయైః కృతం, ప్రియసఖై రస్రైరజస్రం గతం,
ధృత్యా న క్షణ మాసితం, వ్యవసితం చిత్తేన గన్తుం పురః,
యాతుం నిశ్చితచేతసి ప్రియతమే సర్వైః సమం ప్రస్థితం,
గన్తవ్యే సతి జీవిత ప్రియసుహృత్సార్థః కి ముత్సృజ్యతే?"

[నాయికా వాక్యము.—ప్రియతమే యాతుం నిశ్చిత చేతసి (సతి) = ప్రాణవల్లభుఁడు తరలుటకు నిశ్చయించుకొన్న మనస్సుగలవాఁడు (కాఁగా), వలయైః ప్రస్థానం కృతమ్ = కంకణములు పయనము చేసినవి (రానున్న యెడఁబాపును తలంచిన మాత్రాననే ఒడలు కృశించినందున గాజులు జాఱి రాలిపోయిన వని భా.), ప్రియసఖైః అస్రైః అజస్రం గతమ్ = నెచ్చెలులయిన కన్నీళ్ళు ఎడతెంపులేకుండ పోయినవి (రాలినవి - కాంతునితోఁగూడ నేఁగినవి), ధృత్యా క్షణం న ఆసితమ్ = ధైర్యము నిముసము ఉండ దాయెను, చిత్తేన పురః గన్తుం వ్యవసితమ్ = మనస్సు ముందుగా పోవుటకు సమకట్టెను, (ఈవిధముగా), సర్వైః సమం ప్రస్థితమ్ = అన్నియు ప్రియునితోఁగూడ తరలినవి, జీవిత = ఓప్రాణమా, గన్తవ్యే సతి = (నీవును) పోవలసి యుండఁగా, ప్రి

యః సుహృత్ సార్థః = పైఁజెప్పినయాప్త మిత్ర బృందమును, కిమ్ ఉత్సృజ్యతే = ఏల వదలెదవు? (నీవును ఈయాప్తమిత్రములతోడనే పొమ్ము, వెనుకఁజిక్కకుము, అని భా.)]

ఇత్యాది ప్రాచీనగ్రన్థకారలేఖనాత్ అగ్రిమక్షణే దేశాన్తరని శ్చితగమనే ప్రేయసి ప్రవత్స్యత్పతికాఽపి నవమీ నాయికా భవితు మర్హతి. తథాహి:—తస్యాః — ప్రోషితపతికావిప్రల బ్ధోత్కాసు నాన్తర్భావః, భర్తుః సన్నిధివర్తిత్వాత్; న కలహా న్తరితాయా మన్తర్భావః కలహాభావాత్, పత్యు రనవమాని తత్వాచ్చ; నాఽపి ఖణ్డితాయాం, ప్రియస్యాఽ న్యోపభోగ చిహ్నితస్యాఽఽగమనాభావాత్, ప్రియాయాః కోపాభావ దర్శనాత్, కాకువచన కాతరప్రేక్షణాది సూచి తాన్తఃపక్షపా త దర్శనాచ్చ; న వాసకసజ్జాయాం, వారనియమాభావాత్, సామగ్రీసజ్జీకరణాభావ నిర్వేదాది దర్శనాచ్చ; న స్వాధీన పతికాయా, మగ్రిమక్షణ ఏవ సంగతివిచ్ఛేదదర్శనాత్, న హి స్వాధీనపతికాయాః కదాచి దపి సంగతివిచ్ఛేద ఇతి సంప్రదా యః, వ్రజ న్నపి స్వాధీనపతికయా నిరుధ్యతే, అన్యథా భర్త రి స్వాధీనతైవ భజ్యేత, నేహ తథా, సర్వథా భర్తృవిదేశగ మనాత్, కిఞ్చన్నిర్వేదాశ్రుపాత నిశ్వాస వనవిహారాది మద నమహోత్సవ వ్యతిరేకదర్శనాచ్చ;నాఽప్యభిసారికాయామ్, అభిసారోత్సవాభావాత్, అన్తస్తాపదర్శనాచ్చేతి యుక్త ము త్పశ్యామః. లక్షణం తు యస్యాః పతి రగ్రిమక్షణే దేశాన్తరం యాస్య త్యేవ సా ప్రవత్స్యత్పతికా; అస్యా శ్చేష్టాః కాకువ చన కాతరప్రేక్షణ గమనవిఘ్నోపదర్శన నిర్వేద సన్తాప స మ్మోహ నిశ్వాస బాష్పాదయః.

ప్రస్థానమిత్యాదిప్రాచీనగ్రంథకారులలక్ష్యములచేత ఉత్తరక్షణమందు ఎవతెయొ క్క వల్లభుఁడు నిశ్చయముగా దేశాంతరమున కేఁగునో ఆనాయిక ప్రవత్స్యత్పతిక తొమ్మిదవనాయిక గాఁదగును. అది యెట్లనిన.—(ఆనాయికకు కడమ యెనమండ్రునా యికలయందును అంతర్భావము లేదు. దానినే వివరించుచున్నాఁడు): ఆనాయికకు— పతి సన్నిధియం దుండుటచేత ప్రోషితపతికా విప్రల బ్ధోత్కలయందు అంతర్భావము

లేదు; కలహము లేవందునను పతి నమానింపనందునను కలహాంతరితయందు అంతర్భా వము లేదు; అన్యోపభోగచిహ్నములతో ప్రియుఁడు రానందునను ఈప్రియ ఆతనిపై అలుగనందునను (ఈమెయొక్క) స్వరవికారముతోఁగూడినమాటలు బెదరుచూపులు లోనగువానిచే (తన) మనస్సులోని ప్రేమ యగపడుచుండుటచేతను ఖండితయం దంత ర్భావము లేదు; వార ( = దిన) నియమము లేనందునను (సంభోగ) సామగ్రిని సమ కూర్చుట లేనందునను నిర్వేద ముండుటచేతను వాసకసజ్జయం దంతర్భావము లేదు. ఉ త్తరక్షణమందే కూడిక తెగిపోవుటచేత స్వాధీనపతికయం దంతర్భావము లేదు; ఏల యన, స్వాధీనపతికకు ఒకప్పుడేనియు కూడికకు తెంపు గల దని సంప్రదాయము లేదు, తరలు చుండియు భర్త స్వాధీనపతికచేత ఆఁపఁబడి నిలిచిపోవును, అట్లుగాదేని ఆమెకు స్వాధీనుఁ డగుటయే యసత్య మగును: ఇచ్చోట నట్లు గాదు, తప్పక భర్త దేశాంతర ము పోవును గావునను, ఇంచుక నిర్వేదము కన్నీళ్ళుకాఱుట నిట్టూర్పులుం గలవుగావు నను, వనవిహారము కామునిపండుగయు లేవుగావునను (స్వాధీనపతికయం దంతర్భావము లేదు); అభిసారోత్సవము లేనందునను మనస్సులో తాపము ఉన్నందునను అభిసారికయం దు అంతర్భావము లేదు;—అని ఉచితముగా ఊహించుచున్నాము. మఱి (యీనాయి కకు) లక్షణమే మనఁగా - ఎవతెయొక్క పతి యుత్తరక్షణమందు తప్పక దేశాంతర ము పోవునో ఆమె ప్రవత్స్యత్పతిక [ప్రవత్స్యత్ = దేశాంతరముపోనున్న - పతికా = భర్తగలది.] ఈమెయొక్క వ్యాపారములు - స్వరవికారముతోడిమాట లు, బెదరుచూపులు, పయనంపువిఘ్నముల నెదురుసూచుట, నిర్వేదము, సంతాపము, మూర్ఛ, నిట్టూర్పులు, కన్నీళ్ళు లోనగునవి.

ముగ్ధా ప్రవత్స్యత్పతికా యథా.

ప్రాణేశ్వరే కి మపి జల్పతి నిర్గమాయ<br>
క్షామోదరీ వదన మానమయాఞ్చకార;<br>
ఆలీ పున ర్నిభృత మేత్య లతానికుఞ్జ<br>
మున్మత్తకోకిలకలధ్వని మాతతాన. ౮౩.

ప్రాణేశ్వరే నిర్గమాయ కిమపి జల్పతి (సతి) = ప్రాణనాథుఁడు పయనమునకు (పోయి త్వరగానే వచ్చెదను అను నిట్టిమాట) ఏదో చెప్ప (చుండఁగా), క్షామో దరీ=సన్ననినడుముగలదైనయాకాంత, (లజ్జచేతను విరహభయముచేతను) వదనమ్=మొ గమును, ఆనమయాఞ్చకార = వాంచెను. ఆలీ పునః = చెలి యో, నిభృతం లతా నికు ఞ్జమ్ ఏత్య = రహస్యముగా తీఁగ పొదకు పోయి, ఉన్మత్త కోకిల కల ధ్వనిమ్ ఆత తాన = వెఱ్ఱి కోయిలయొక్క యింపైన కూఁతను కూసెను; (వెఱ్ఱి కోకిలకూఁత య

వశకున మని యేని, ఇట్టివిరహోద్దీపకములకు కాంత యపాయము చెందు నని యేని పయనము మానుకొను ననునూహచేత నని భా.) తల వాంచుటచేత లజ్జ తోఁచుచున్నది గావున ఈనాయిక ముగ్ధ ప్రవత్స్యత్పతిక.

మధ్యా ప్రవత్స్యత్పతికా యథా.

గన్తుం ప్రియే వదతి, నిశ్వసితం న దీర్ఘ
మాసీత్, తదా నయనయో ర్జల మావిరాసీత్,
ఆయుర్లిపిం పఠితు మేణదృశః పరం తు
ఫాలస్థలీం కిము కచః సముపాజగామ? ౮౪.

ప్రియే గన్తుం వదతి సతి = ప్రియుఁడు పోవుటకు (ఏమో) చెప్పుచుండఁగా, ఏణ దృశః = లేడి కన్నులుగలయానాయికయొక్క, నిశ్వసితం దీర్ఘం న ఆసీత్ = ఊర్పు నిడుద కాదాయెను (నాయిక నిట్టూర్పు నిగుడ్ప లేదు), తదా = అంతట, నయనయోః జలమ్ ఆవిరాసీత్ = కన్నులయందు నీరు ఉప్పతిల్లెను. కచః ఆయుః లిపిం పఠితుమ్ ఫాలస్థలీం సముపాజగామ కిము = తలవెండ్రుకలు ఆయుస్సుయొక్క వ్రాఁతను (ఎంతకాలము బ్రదుకునో ఆపరిమితిని బ్రహ్మ నొసటవ్రాసియుండును గావున ఆకాలపరిమితి నెఱుంగుటకై ఆవ్రాఁతను) చదువుటకు నొసటి ప్రదేశమునకు వచ్చెనా ఏమి? (ఎడఁబాపు నెవ్వగ కలనితత్తఱములో తలకట్టు వీడి నుదుటిపై గ్రమ్మె నని భా.)

ఇట నిట్టూర్పునిగుడ్పమి లజ్జచేత, కన్నీళ్ళులోనగునవి మదనునిచేత. ఉభయంబును తుల్యముగాన మధ్య ప్రవత్స్యత్పతిక.

ప్రౌఢా ప్రవత్స్యత్పతికా యథా.

నాయం ముఞ్చతి సుభ్రువా మపి తనుత్యాగే వియోగజ్వర,
స్తే నాహం విహితాఞ్జలి ర్యదుపతే పృచ్ఛామి తత్త్వం వద;
తామ్బూలం కుసుమం పటీర ముదకం య ద్బన్ధుభి ర్దీయ తే,
స్యా దత్రేవ పరత్ర త త్కిము విషజ్వాలావళీ దుస్సహా?

ఒకానొకనాయిక శ్రీకృష్ణునితో పలుకుచున్నది.—యదుపతే = యదునాయకుఁడా (= శ్రీకృష్ణా), సు భ్రువాం తను త్యాగే అపి అయం వియోగ జ్వరః న ముఞ్చతి = అందమయిన కనుబొమలుకలవారియొక్క (కాంతలయొక్క) మేను విడుచుటయం దేనియు (= మరణమునం దేనియు) ఈ (నే నిప్పు డనుభవించుచున్న) యెడఁబాపు జ్వరము వదలదు; తేన విహిత అఞ్జలిః అహం పృచ్ఛామి = ఆహేతువుచేత మోడ్చిన కేలుదోయిగలదాననై నేను అడుగుచున్నాను, తత్త్వం వద = వాస్తవమును చెప్పు

ము: (చని పోయినచెలువల నుద్దేశించి, బన్ధుభిః యత్ తామ్బూలం కుసుమం పటీరకమ్ ఉదకం దీయతే తత్ = బంధువులచేత ఏతాంబూలము (ఏ)పువ్వు (ఏ)గంధము (ఏ) నీరు ఇయ్యఁబడునో ఆతాంబూలాదికము, అత్ర ఇవ పరత్ర విష జ్వాలా ఆవళీ దుస్సహం స్యాత్ కిము = ఇక్కడనుం బోలె (ఇప్పుడు నాకు అనుభవములో నున్నట్లు) పరలోకమందు విసపు మంటల మొత్తమువలె తాళరానిది అగునా ఏమి?

'యదుపతే' అనుటచే - గొప్పవాఁడు, సర్వ మెఱిఁగినవాఁడు, అడిగినవిషయమున సందేహము తీర్పఁగలవాఁడు నని భా. ఆయన యున్న యీలోకములోనే కలిగినట్టి వియోగజ్వరము పరలోకములో ఆయన కెడయగు తనకు కలుగక మాన దని నాయికయొక్క ప్రౌఢతనపుమాట. 'ప్రియతముఁడా' 'ప్రాణేశ్వరా' ఇత్యాదిశబ్దముల సంబోధింపక 'యదుపతి' శబ్దముచే సంబోధించుట నీకును నాకును ఋణానుబంధము తీఱిన దని సూచించుటకు. 'సుభ్రువామ్' - అనుటచే మగవానికి ఱాతిగుండెవానికి నీకు న స్నెడఁబాసినవగపు ఉండదు గాని ని న్నెడబాసినవగపు అబలకు నాకు తప్ప దని భా. పరలోకవిషయప్రశ్నచేత తనకు మృతి తప్ప దని భా. దానిచే పోవల దనుప్రార్థన భా. ఇట్లు మృతిప్రార్థనలను ప్రశ్నవ్యాజమున తెలుపుటచే ఈప్రవత్స్యత్పతిక ప్రౌఢ.

పరకీయా ప్రవత్స్యత్పతికా యథా.

> న్యస్తం పన్నగమూర్ధ్ని పాదయుగళం, భక్తి ర్విముక్తా గురౌ,
> త్యక్తా నీతి, రకారి కి న్న భవతో హేతో ర్మయా దుష్కృతమ్?
> అజ్ఞానాం శతయాతనా, నయనయోః కోఽపి క్రమో రౌరవః,
> కుమ్భీపాకపరాభవ శ్చ మనసో, యుక్త స్త్వయి ప్రస్థితే. ౮౬.

ఒకానొకతె కాంతుని దూఱుచున్నది:—(కర్తృర్థకప్రయోగమున టీక). భవతో హేతోః = నీ కొఱకు, మయా పన్నగ మూర్ధ్ని పాద యుగళం న్యస్తమ్ = నేను (అభిసరణమార్గమందలి) పాము తలమీఁద అడుగుల జంటను (రెండడుగులను) ఉంచితిని (మహాసాహస మొనర్చితి ననుట; ఒకరితలమీఁద నడుగు పెట్టుట తప్పు, రెండడుగులనుం బెట్టుట మఱియుం దప్పు, నీకై యట్టిపాతక మొనర్చితి ననియు భా.) గురౌ భక్తిః విముక్తా = మామలోనగు పెద్దలయందు భక్తిని విడిచితిని, నీతిః త్యక్తా = కులాంగనోచితమైనమర్యాదను వదలితిని, (ఇవియు మిక్కిలి పాపములు అని భా.), కిం కిం దుష్కృతం న అకారి=(ఈవిధముగా) ఏ యే పాపమును చెయ నైతిని (సర్వపాపమును చేసితి ననుట), (కావున), త్వయి ప్రస్థితే (సతి) = నీవు పయనమయిన యెడల, అజ్ఞానాం శతయాతనా = (నా) యవయవములకు నూఱు (రెట్లు) నరకబాధ (యును), నయనయోః కోఽపి (కః అపి) రౌరవః క్రమః = కన్నులకు అనిర్వచనీయమైన రౌరవనరకమును

క్క ప్రకారము (ను), మనసః కుమ్భీ పాక పరాభవః చ = మనస్సునకు కుండలో తంపటవలని వేదన యు, యుక్తః = తగినది(తగినవి). ఔచిత్యవిశేషమునుబట్టి యీనరకబాధలు ఇట చెప్పఁబడినవి. రౌరవనరకమందు యాతనాప్రాణిని రురువు లనెడు హరిణవిశేషములచేత పీడింతురు గావున కన్నులకు హరిణనయనసామ్యసంబంధముచేత రౌరవనరకము చెప్పఁబడినది. కుంభీపాకనరకమందు కుంభములో తంపట వేయుదురు గావున మనస్సునకు స్తనకుంభములచాటున నుండుటవలని సాదృశ్యసంబంధముచేత కుంభీపాకనరకము చెప్పఁబడినది. కడమయంగములకు మొత్తముగా కడమయాతనలు చెప్పఁబడినవి అని సంగతి. అత్తమామలను సరకుసేయని నిజాభిసరణముం జెప్పుటచేత పరకీయ ప్రవత్స్యత్పతిక.

సామాన్యా ప్రవత్స్యత్పతికా యథా.

ముద్రాం ప్రదేహి వలయాయ, భవద్వియోగ<br>
మాసాద్య యాస్యతి బహిః సహసా య దేతత్;<br>
ఇత్థం నిగద్య విగళన్నయనామ్బుధారా<br>
వారాఙ్గనా ప్రియతమం కరయో ర్బభార. ౮౭.

వలయాయ ముద్రాం ప్రదేహి = కడియమునకై (కడియముగా నేను దాల్చుటకై) ఉంగరమును ఇమ్ము, యత్ భవత్ వియోగమ్ ఆసాద్య ఏతత్ సహసా బహిః యాస్యతి = ఏలయన నీతోడి యెడఁబాపును పొంది (నీవు అటుః సాగఁగానే నాకుం గలిగెడుకార్శ్యముచేత) ఈకడియము వెంటనే వెలుపలికి పోవును (జాఱి పడిపోవును), ఇత్థం నిగద్య = ఇట్లు పలికి, వారాఙ్గనా విగళత్ నయన అమ్బు ధారా ప్రియతమం కరయోః బభార = వెలయాలు (విగళత్ = ) ఓడుచున్న కన్నుల (అమ్బు = ) నీళ్లయొక్క ప్రవాహముకలదై (కంటికి కడవెడుగా నేడ్చుచు) కాంతుని చేతుల యందు పట్టుకొనెను (కాంతునిరెండుచేతులును పట్టుకొని నిలిపినది). ఉంగర మడిగినందున నీప్రవత్స్యత్పతిక వెలయాలు.

## వెండియు ప్రకారాంతరమున నాయికాభేదములు.

### ఉత్తమ.

అహితకారిణ్యపి ప్రియే హితకారిణ్యుత్తమా.

ప్రియుఁడు అహిత మొనర్చినను అతనికి హితమే చేయునది ఉత్తమ.

పతిః శయన మాగతః కుచవిచిత్రితోరస్స్థలః
ప్రసన్నవచనామృతైః పర మతర్పి వామభ్రువా,
అచర్చి సుభగస్మితద్యుతిపటీరపఙ్కద్రవైః,
రపూజి విలసద్విలోచనచమత్కృతై రమ్బుజైః. ౮౮.

వామభ్రువా = అందమయిన కనుబొమలుగల యొకానొకసుందరిచేత, కుచ వి
చిత్రిత ఉరః స్థలః (సః) శయనమ్ ఆగతః పతిః ప్రసన్న వచన అమృతైః పరమ్ అత
ర్పి = (పరస్త్రీ) స్తనములచేత కుంకుమాదిరేఖాంకితమైన ఱొమ్ము ప్రదేశముకలవాఁ (డై)
పడకకు వచ్చిన భర్త ప్రీతిపూర్వకమయిన మాటలనెడు నమృతములచేత మిక్కిలి తనుపఁ
బడెను, సుభగ స్మిత ద్యుతి పటీర పఙ్క ద్రవైః అచర్చి = రమణీయమయిన చిఱున
వ్వుయొక్క కాంతియనెడు గందముయొక్క పంకముయొక్క ద్రవములతో అలఁదఁబ
డియెను, విలసత్ విలోచన చమత్కృతైః అమ్బుజైః అపూజి = సాభిప్రాయముగా
నొప్పుచున్న కన్నుల విలాసములనెడు కమలములతో పూజింపఁబడియెను.

మధ్యమ.

హితాహితకారిణి ప్రియే హితాహితకారిణీ మధ్యమా.

ప్రియుఁడు హితము చేసిన హితమును, అహితము చేసిన నహితమును, చేయునది
మధ్యమ.

కాన్తే సాగసి కఞ్చుకస్పృశి, తయా సాచీకృతగ్రీవయా
ముక్తాః కోప కషాయ మన్మథ శర క్రూరాః కటాక్షాఙ్కురాః;
సాకూతే, దర హాస కేసర వచో మాధ్వీక ధారాలసా
ప్రీతిః కల్పలతేవ కాచన మహాదానీకృతా సుభ్రువా. ౮౯.

సాగసి కాన్తే కఞ్చుక స్పృశి = నేరమిగలవాఁడైన కాంతుఁడు ఱవికను తాఁ
కఁగా, తయా సుభ్రువా సాచీ కృత గ్రీవయా సత్యా=ఆ సుందరిచేత అవలికి త్రిప్పఁబడిన
మెడగలదానిచేత (ఆమె అతనిం జూడనొల్లక మెడ యవలికి త్రిప్పుకొని), కోప...క్రూ
రాః కటాక్ష అఙ్కురాః ముక్తాః = రోసముచేత ఎఱ్ఱనివియు మరుని కోలలవలె కఠోర
ములు (ను అయిన) క్రేగంటిచూపు మొలకలు నిగుడ్పఁబడినవి; (మరుకోలలతో సామ్య
ము చెప్పుటచేత అశోకపుఁజూపులనొప్పు అత్యంతమదనోద్దీపకముగా నుండె నని భా.);
సాకూతే (సతి) = కాంతుఁడు ఆకూతముతో (బలిమాలు కొనునభిప్రాయముతో) కూడు
కొన్నవాఁడు కాఁగా, దర...లసా కాచన ప్రీతిః ఏవ కల్పలతా మహాదానీకృతా=చిఱు
నగవనెడి యాకురువులు పలుకనెడు తేనె (ధారా=) యొడికయు (అనుకీనిచేత) (అ

లసా=) వాలుచున్నది (యు) అనిర్వచనీయము (న) (ఐన) ప్రేమ యే యనెడి యావి తీవియ గొప్పదానము చేఁబడినది - (అతనికి) (నవ్వుచు తియ్యఁగా పలుకుచు ప్రేమించి మహానందం బొసంగిన దని భా.) ఇందు పూర్వార్ధమున అహితమునకు అహితము సేయుటయు, ఉత్తరార్ధమున హితమునకు హితము సేయుటయుం జెప్పఁబడినవి.

### అధమ.

హితకారి ణ్యపి ప్రియే ఽహితకారి ణ్యధమా; ఏషైవ నిర్నిమిత్త
కోపా చణ్డీ త్యభిధీయతే; అస్యా నిష్కారణకోపత్వా దధ
మైవ చేష్టా.

ప్రియుఁడు హితముచేయుచున్నను అతనికి అహితము సేయునది అధమ; ఈమె యే నిర్నిమిత్తకముగా కోపము చేయునది చండి యని చెప్పఁబడును; ఈమెకు కారణము లేకయే కోపము గలుగుటచేత చేష్ట యధమముగానే యుండును.

ప్రస్థానే తవ యః కరోతి కమలచ్ఛాయం ముఖామ్భోరుహే,
శ్రీఖణ్డద్రవధారయా శిశిరయా మార్గం పురః సిఞ్చతి,
తస్మిన్ ప్రేయసి విద్రుమ ద్రవ నదీ రఙ్గ త్తరఙ్గ భ్రమి
భ్రాన్తమ్లాన్త సరోజ పత్త్ర సదృశా భూయో దృశా క్రుధ్యసి.

యః = ఎవఁడు, తవ ప్రస్థానే = నీయొక్క పయనమందు, ముఖ అమ్భోరుహే కమల ఛాయం కరోతి = (నీ) మొగముఁ దమ్మిమీఁద తామరల నీడను చేయునో, (నీమోమునకు తామరపూవులగొడుగు పట్టునో), శిశిరయా శ్రీఖణ్డ ద్రవ ధారయా పురః మార్గం సిఞ్చతి = (ఎండకుఁ గాఁగిననేల నీకాలికి చల్లనగునట్లుగా) చల్లని గందపు నీటి చాలుతో (నీ) ముందు దారిని తడుపునో, తస్మిన్ ప్రేయసి=ఆ (అంతయనురక్తుఁడైన) ప్రియతమునిమీఁద, విద్రు... సదృశా=పగడపు నీటి యేటియొక్క (రఙ్గత్ =) పొంగుచున్న యలల సుడిలో తిరిగినదై వాడిన తామర రేకునకు సాటియగు, దృశా = చూపుతో (చూపుగలదానవై), భూయః క్రుధ్యసి = మాటిమాటికి కోపగించుచున్నావు. ఇట హితకారికి అహితకరణము స్పష్టము.

విస్తరభియా ప్రత్యేక మేతాసా ముత్తమమధ్యమాధమ భేదా
నోదాహృతాః ఇతి.

గ్రంథవిస్తర భయముచే ఒక్కొక్కతెకును ఈ (ముగ్ధాది) నాయికలకు ఉత్తమ మధ్య మాధమభేదములు ఉదాహరింపఁబడలేదు. (నాయికానిరూపణము) ముగిసినది.

ఇతి ద్వితీయ ప్రకరణమ్.

## సఖీనిరూపణమ్.

విశ్వాసవిశ్రామకారిణీ పార్శ్వచారిణీ సఖీ. అస్యా మణ్డనోపాలమ్భ శిక్షా పరిహాస ప్రభృతీని కర్మాణి.

(నాయికయొక్క) నమ్మకమునకు పాత్ర మయినది (నాయికతో) కూడ నుండునది సఖి (యనంబడును.) దీనికి అలంకరించుట, నిందించుట, నేర్పుట, వేళాకోళము సేయుట, లోనగునవి పనులు.

మణ్డనం యథా.

స్తనకనకమహీధరోపకణ్ఠే
ప్రియకరపల్లవ ముల్లసత్ప్రమోదమ్
రహసి మకరికామిషా ల్లిఖన్తీం
కమలముఖీ కమలైః సఖీం జఘాన. ౯౧.

కమల ముఖీ = తామరవంటి మోముగలది (యైననాయిక), స్తన కనక మహీధర ఉపకణ్ఠే = కుచ మనెడు బంగారు కొండ (మేరుపర్వతము) చెంగట, రహసి = ఏకాంతమందు, మకరికా మిషాత్ ప్రియ' కరపల్లవమ్ ఉల్లసత్ ప్రమోదం లిఖన్తీం సఖీమ్ = మకరికాపత్త్రమనెడు మిషచే ప్రియునియొక్క (పల్లవ = ) చిగురువంటి (కర = ) చేతిని ఉప్పొంగుచున్న సంతోషముతో వ్రాయుచున్న చెలిని, కమలైః సంజఘాన = తామరలతోఁ గొట్టెను. మకరిక పత్త్రమువలె (ఆకువలె) నుండుటచేతను ప్రియకరము చిగురువలె నుండుటచేతను ఆనెపమున దీని వ్రాయుటయందు సౌకర్యము గల దని భా. ఎప్పటియట్లే మకరికాపత్త్రిమును వ్రాయుచుండినచో మోద ముప్పొంగుటప ప్రసక్తి లేదుగాన, సఖి తాను చేయుచున్న చిలువిషమునకై మోదించుటను నాయిక గాంచి సంశయముఁ జెంది ఫరికించి యాప్రియకరలేఖనమును కనిపట్టి సఖిని తామరతోఁ గొట్టె నని భా.

ఉపాలమ్భో యథా.

సాన్ద్రిధ్వానై ర్ముఖరితదిశః శ్రేణయ స్తోయదానాం
ధారా పాతై ర్ధరణి వలయం సర్వతః ప్లావయన్తి;
తేన స్నేహం వహతి విపులం మత్సఖీ, యుక్త మేతత్,
త్వం నిస్స్నేహో య దసి త దిదం నాథ మే విస్మయాయ.

(నాయికయొక్క) సఖి నాయకుని దూఱుచున్నది.—సాన్ద్రైః ధ్వానైః ముఖరిత దిశః తోయదానాం శ్రేణయః = గంభీరమైన యుఱుములతో మ్రోఁగునట్లుచేయఁబడిన దిక్కులుగలవై మబ్బులయొక్క వరుసలు, ధారా...యన్తి = ధారల కురియుటచేత భూ మండలమును అంతటను తడుపుచున్నవి, తేన మత్ సఖీ విపులం స్నేహం వహతి = అందుచేత నాయొక్క చెలి (నాయిక) మిక్కుటమయిన యంటుకొనుగుణమును (అనురాగము నని యర్థాంతరము) పొందియున్నది, ఏతత్ యుక్తమ్ = ఇది న్యాయ్యము (గానేయున్నది), నాథ త్వం నిస్స్నేహః అసి (ఇతి) యత్ తత్ ఇదం మే విస్మయాయ (భవతి) = స్వామీ నీవు అంటుకొనుగుణము (అనురాగ మని యర్థాంతరము) లేనివాఁడవుగా నున్నా వనుట ఏ (దికల) దో ఆ యిది నాకు వింతకై (యున్నది) (వింత గలించుచున్నది). * 'చూర్ణాది పిణ్డీభావ హేతు ర్గుణః స్నేహః, జలమాత్ర వృత్తిః.'—[చూర్ణము (పిండి) లోనగునవి ముద్ద యగుటకు హేతు వైనగుణము స్నేహ మనంబడును, (అది) నీటియందు మాత్ర ముండునది.]-అని తర్కశాస్త్రమందు చెప్పఁబడియున్నది. దానింబట్టి చూడఁగా - లోక మెల్ల వర్షములచే జలమయ మైనప్పుడు తదంతర్గత యైన నాచెలి తజ్జలగుణ మైనస్నేహమును (అంటుకొనుగుణమును) పూనుట సరిగాని అట్లే తదంతర్గతుఁడ వై యున్న నీవు ఆగుణమును పొందమి వింతగా నున్న దని యని విరోధము; మేఘములచేతను వర్షములచేతను అత్యంతకామోద్దీపనము పొంది నాచెలి నీపై (స్నేహమును = )అత్యంతానురక్తిని పూనినది గాని నీవు మాత్రము ఆమెపై మరు లూనకున్నావు అని విరోధపరిహారము. దయసేసి యనురక్త నామె నేలు మని తాత్పర్యము.

శిక్షా యథా.

సానన్ద మాలి వనమాలివిలోకనాయ
నిర్గచ్ఛ కుఞ్జ, మితి కిన్తు విచారయేథాః,
ఝఙ్కారిణో మధులిహో దివసే భ్రమన్తి,
రాత్రౌ పున శ్చపలచఞ్చుపుటా శ్చకోరాః. ౯3.

ఆలి = ఓసఖీ, వనమాలి విలోకనాయ సానన్దం కుఞ్జం నిర్గచ్ఛ = శ్రీకృష్ణుని చూచుటకు మోదముతో పొదరింటికి పొమ్ము, కిన్తు ఇతి విచారయేథాః = అయినను ఈవిషయము ఆలోచించుకొమ్ము, (ఏవిషయ మనఁగా), దివసే మధులిహః ఝంకారిణః (సన్తః) భ్రమన్తి = పగటియందు తుమ్మెదలు జుమ్మని మ్రోఁగుచున్న వై (ఇటునటు) సుడియుచుండును; రాత్రౌ పునః చకోరాః చపల చఞ్చు పుటాః (సన్తః) (భ్రమన్తి) = రాత్రియం దయిననో వెన్నెలపులుఁగులు మెదలుచున్న నోటి డిప్ప కలవి యై (సుడియుచుండును); పగలు తుమ్మెదలు తమ్మి యని భ్రమసి నీమోమును గ్రమ్ముకొనును,

రాత్రి వెన్నెలపులుఁగులు నీమోముకాంతిని వెన్నెల యని భ్రమసి నీమోముం గ్రమ్ముకొనును, గావున మెలపున వానిం దప్పించికొని పొమ్ము, అని నేర్పుట.

పరిహాసో యథా.

> ఆగారభిత్తిలిఖితాసు నివేదయస్వ
> కః సప్తమో దశసు మూర్తిషు లోకభర్తుః,
> ఇత్థం సఖీజనవచః ప్రతిపద్య సద్యః
> సీతా స్మితద్యుతిభి రుత్తరయాఞ్చకార. ౯౮.

ఆగార భిత్తి లిఖితాసు లోక భర్తుః దశసు మూర్తిషు సప్తమః కః నివేదయస్వ = (పడక) యింటియొక్క గోడలయందు వ్రాయఁబడినవైన జగన్నాథుని (విష్ణుమూర్తి) యొక్క పది రూపములయందు (దశావతారములయందు) ఏడవ వాఁడు ఎవరో (ఏడవవానిపేరు) చెప్పుము, ఇత్థం సఖీ జన వచః ప్రతిపద్య = ఇట్లని చెలి బృందముయొక్క మాటను (ప్రశ్నను) గ్రహించి (ఎగతాళికి అని యెఱింగినదై), సద్యః సీతా స్మిత ద్యుతిభిః ఉత్తరయాఞ్చకార = వెంటనే సీత చిఱునగవు కాంతలచేత ఉత్తరము చెప్పెను; కులాంగన పతి పేరు చెప్పదు గావున పేరు చెప్పక నవ్వుటయే అతఁడే తన భర్త యని తెలుపుట యాయె నని భా.

సఖ్యాః పరిహాసవత్ ప్రియ స్యాపి పరిహాసో యథా.

చెలివలెనే నాయకుఁడును (నాయికను) గేలిసేయుటకు ఉదా.

> భ్రూసంజ్ఞయాఽఽదిశసి తన్వి సఖీం న వాగ్భి,
> రిత్థం విహస్య మురవైరిణి భాషమాణే,
> రాధా చిరాయ దశన వ్రణ దూయమాన
> బిమ్బాధరం వదన మాసమయాఞ్చకార. ౯౯.

తన్వి = ఓసుందరీ, సఖీం భ్రూసంజ్ఞయా ఆదిశసి వాగ్భిః న (ఆదిశసి) = చెలిని బొమసంజ్ఞతో ఆజ్ఞాపించెదవు మాటలతో ఆజ్ఞాపింపవు (మాటలాడుటకుఁ గలప్రతిబంధకమేమో చెప్పు మని భా.), ఇత్థం...మాణే = ఇట్లని నవ్వి మురారి (శ్రీకృష్ణుఁడు) అడుగుచుండఁగా, రాధా = రాధ, దశన వ్రణ దూయమాన బిమ్బ అధరం వదనం చిరాయ ఆసమయాఞ్చకార = పంటి (కాటువలని) గాయముచేత నొచ్చుచున్న దొండపంటి మోవికలదైన మొగమును చాలసేపు వాంచెను. కారణ మెఱిఁగియు నెఱుఁగనివాఁడువోలె నడుగుట యని హాసముచే తెలియుచున్నది. మఱియు సదంతవ్రణాధరదర్శనముచే గతరాత్రియందలి సురతక్రీడానందము తనతలంపునకు వచ్చినందునను,

తాను దానిని ఆమెతలఁపునకు తెచ్చుచున్నందునను, హాసము కలిగినది. 'తెల్లవాఱిన సురతచిహ్నములం గాంచి ఎవ రే మనుకొందురో యని యించు కేనియుం గొంకక రాత్రి తెగఁబడి సాంగోపాంగముగా రతులం దేలితివి! ఏమి నీమదనాతిరేకము!' అనుపరిహాసము ఆప్రశ్నకు అభిప్రాయ మని యెఱింగినదై రాధ లజ్జచేతను మఱపించుటకును మొగము వాంచెను. చాలసేపు వాంచియేయుండుట యానందపారవశ్యముచేత.

ప్రియపరిహాసవత్ ప్రియాయా అపి పరిహాసో యథా.

ప్రియుఁడు పరిహసించుటవలెనే ప్రియయు పరిహసించుకు ఉదా.

దివ్యం వారి కథం? యతః సురధునీ మౌళౌ; కథం పావకో
దివ్యం? త ద్ధి విలోచనం; కథ మహి ర్దివ్యం? స చాఙ్గే తవ;
తస్మా ద్ద్యూత విధౌ త్వ యాద్య ముషితో హారః పరిత్యజ్యతా;
మిత్థం శైలభువా విహస్య లపితః శమ్భుః శివా యాస్తు వః.

తవ = నీకు, వారి దివ్యం కథమ్ = జలము దివ్యప్రమాణము ఎట్లగును (కానేర దనుట), యతః మౌళౌ సుర ధునీ = ఏల యన (నీ) సిగయందు వేల్పుటేఱు (ఆకాశగంగ) (ఉన్నది): (సిగలో అట్టియేటిని దాల్చియున్న నీకు దివ్యార్థమయి నీట మునుంగుట క్రీడామాత్ర మని భా.); పావకః దివ్యం కథమ్=అగ్ని దివ్య మెట్లగును (అదియును గా దనుట), హి తత్ విలోచనమ్ = ఏలయన అది (నీ) కన్ను: (నీకన్ను నిన్ను కాల్పదు గాన నీక న్నగుటచే అగ్నియు దివ్యమునకు పనికి గా దని భా.); అహిః దివ్యం కథమ్ = పాము దివ్య మెట్లగును? స చ అఙ్గే = (ఏల యన) అదియో (సర్పంబో (నీ) యొడలియందు (ఉన్నది), (అది నిన్ను కఱవదుగాన దివ్యమునకు పనికిరా దని భా.); తస్మాత్ ... త్వామ్ = కావున జూదమాడుటయందు నీచేత (అద్య= ఇప్పుడు) చోరింపఁబడిన ముత్యాలపేరు ఇచ్చి వేయఁబడునుగాక; ఇత్థం... శమ్భుః=ఇట్లని కొండకూఁతుచేత హాసయుక్తముగా చెప్పఁబడిన శివుఁడు, వః శివాయ అస్తు = మీ మేలుకై యగుఁగాక (మీకు మేలు సేయుఁగాక); జూదమున గెలిచినవానిని చోరిత మనుటయు, దివ్యప్రమాణములను సయితము జయించినదొంగ వనుటయును, పరిహాసోక్తి. జలప్రమాణ మె ట్లన్న,— తెగకొలందియు నొకఁడు వింటినుండి బాణముం బ్రయోగించి అది పడినతావునకుం బరువునం బోయి దానిం దెచ్చును. బాణము వేయునప్పటినుండి దానిని మగల తెచ్చువఱకును నీట మునింగి యుండు సభియుక్తుఁడు నిర్దోషుఁడు. సర్పాగ్ని దివ్యములస్వరూపములను 37 - వ శ్లోకముయొక్క టీకలో చూచునది.

## దూతీనిరూపణమ్.

దూత్యవ్యాపారపారజ్ఞతా దూతీ. తస్యాః సంఘటన విరహానివేదనాదీని కర్మాణి.

కుంటెనకత్తియపనియందు నేఱువాది (యగునది) దూతి (యనంబడును). దానికి కూర్చుట ఎడఁబాపునెగులును తెల్పుట లోనగునవి పనులు.

సంఘటనం యథా.

అఞ్చతి రజని, రుదఞ్చతి
తిమిర మిదం, దూతి చఞ్చతి మనోభూః,
ఉక్తం న త్యజ, యుక్తం
విరచయ, రక్తం మన స్తస్మిన్. ౯౭.

నాయిక చెప్పుచున్నది.—దూతి=ఓకుట్టనీ, రజనిః అఞ్చతి= రాత్రి వచ్చుచున్నది, ఇదం తిమిరమ్ ఉదఞ్చతి =ఇదిగో చీఁకటి క్రమ్ముకొనుచున్నది, మనోభూః చఞ్చతి = మన్మథుఁడు (నన్నేఁచుటకు) చెలరేఁగుచున్నాఁడు, ఉక్తం న త్యజ = (ప్రాణనాయకుని తోడితెచ్చెద నని నీవు) పలికినమాటను తప్పకుము, యుక్తం విరచయ = (ఈ విషయమున) తగినదానిని చేయుము, (ఏల యన), మనః తస్మిన్ రక్తమ్ = నాహృదయము వానిమీఁద మరులుకొన్నది.

విరహానివేదనం యథా.

చక్రే చన్ద్రముఖీ ప్రదీపకళికా ధాత్రా ధరామణ్డలే,
తస్యా దైవవశా ద్దశాఽపి చరమా ప్రాయః సమున్మీలతి,
త ద్బ్రూమః శిరసా నతేన సహసా శ్రీకృష్ణ నిక్షిప్యతాం
స్నేహ స్తత్ర తథా యథా న భవతి త్రైలోక్య మన్ధం తమః.

దూతి రాధయొక్క విరహవేదనను శ్రీకృష్ణులకుఁ దెల్పుట.—(హే) శ్రీకృష్ణ= (ఓ) కృష్ణస్వామీ, ధాత్రా (యా) చన్ద్రముఖీ ధరామణ్డలే ప్రదీప కళికా చక్రే = బ్రహ్మచేత (ఏ) యిందువదన భూవలయమందు ( - మునకు) దివ్వె మొగ్గగా సృజింపఁబడినదో, తస్యాః దైవవశాత్ ప్రాయః చరమా దశా అపి సమున్మీలతి = ఆరాధకు (ఆదివ్వెమొగ్గకు) (ప్రతికూలమయిన)యదృష్టమువశమున మిక్కుటముగా కడపటి దశ (మరణావస్థ - తెగఁగాలినకొలవత్తి) సయితము ఉప్పతిల్లుచున్నది; తత్=కావున, నతేన శిరసా బ్రూమః = వంగిన తలతో చెప్పుచున్నాను (వినయముగా తలవంచుకొని

విస్మయించుకొనుచున్నాను), యథా త్రైలోక్యమ్ అన్ధం తమః న భవతి తథా సహసా తత్ర స్నేహః నిక్షిప్యతామ్ = ఎట్లయిన ముజ్జగము కటికి చీఁకటి కాకుండునో అట్లు వెంటనే ఆచంద్రముఖిమీఁద (ఆదివ్వెమొగ్గకు) స్నేహము (అనురాగము - నూనె యని దివ్వెంగూర్చినయర్థము) ఉంపఁబడును గాక. త్వరగా వచ్చి కూడి యామె ప్రాణమును గావు మని భా. విరహనివేదనము తెల్లమే.

## నాయకనిరూపణమ్.

శృఙ్గారస్యోభయనిరూప్యత్వా న్నాయకోఽపి నిరూప్యతే.

శృంగారము (నాయికానాయకుల) నిరువురంబట్టి నిరూపింపఁదగినది గావున నాయకుఁడుం గూడ నిరూపింపఁబడియెడిని.

స చ త్రివిధః పతి రుపపతి ర్వైశిక శ్చేతి.

అతఁడును ముత్తెఱంగులవాఁడు - పతి (యు) ఉపపతి (యు) వైశికుండును అని.

### పతిస్వరూపము.

విధివత్ పాణిగ్రాహకః పతిః. యథా.

యథాశాస్త్రముగా వివాహమైనవాఁడు పతి (యనం బరఁగును). ఉదా. –

త్వం పీయూషమయూఖ ముఞ్చ శిశిరస్నిగ్ధాః సుధాశీకరాం,
స్త్వం భోగీన్ద్ర విలమ్బసే కిము ఫణాభోగైః శనై ర్వీజయ,
త్వం స్వర్వాహిని కిం ఇఞ్చ సిఞ్చ సలిలైః, రఙ్గైః శిరీషోపమైః,
సేయం శైలసుతా కఠోరమహసః కాన్త్యా పరిక్లామ్యతి. ౯౯.

శివునివాక్యము.—(హే) పీయూష మయూఖ = (ఓయి) అమృత కిరణుఁడా ( = చంద్రుఁడా), త్వమ్ = నీవు, శిశిర స్నిగ్ధాః సుధా శీకరాః ముఞ్చ = చల్లని దట్టంపు టమృతంపు బొట్టులను (వలిమలపట్టిమీఁద) చల్లుము, (హే) భోగీన్ద్ర త్వం కిము విలమ్బసే? ఫణా ఆభోగైః శనైః వీజయ = (ఓయి) పాపఱేఁడా నీవు ఏల తామసించుచున్నావు? (పార్వతికి) పడగల పఱపులతో (పఱపైనపడగలతో ననుట) మెల్లగా వీవుము; కిఞ్చ = మఱియు, (హే) స్వర్వాహిని త్వం సలిలైః సిఞ్చ = (ఓ) మిన్నేటా నీవు (పార్వతిని) నీళ్ళతో తడుపుము; శిరీష ఉపమైః అఙ్గైః సా ఇయం శైలసుతా పథి కఠోర మహసః కాన్త్యా పరిక్లామ్యతి = దిరిసెనపుఁబువ్వు సాటి గాఁగల యవయవములుగలదైన యల్ల యీ కొండకూఁతురు (పార్వతి) (ఈ) దారిలో

(విశాహా పై పుట్టినింటినుండి నాయింటికి పోవునీమార్గమందు) వేఁడి వెలుఁగుయొక్క (సూర్యుని) రెండవ దయ్యుచున్నది.

పతిభేదములు.

అనుకూల దక్షిణ ధృష్ట శఠ భేదాత్ పతి శ్చతుర్ధా.

అనుకూల దక్షిణ ధృష్ట శఠు లనుభేదముచేత పతి నలుతెగలవాఁడు.

అనుకూలుఁడు.

సార్వకాలిక పరాఙ్గనాపరాఙ్ముఖత్వే సతి సర్వదా స్వీయాయా మనురక్తో ఽనుకూలః. యథా.

ఎల్లప్పుడునుంగల పరస్త్రీవైముఖ్యము ఉండఁగా ( = ఎప్పుడును పరస్త్రీవిముఖుఁడై) ఎల్లప్పుడును స్వీయయందు వలపుగలవాఁడు అనుకూలుఁడు. ఉదా.

పృథ్వి త్వం భవ కోమలా, దినమణే త్వం శైత్య మఙ్గీకురు,
త్వం వర్త్మ న్లఘుతాం ప్రయాహి, పవన త్వం స్వేద ముత్సారయ,
సాన్నిధ్యం శ్రయ దణ్డకావన, గిరే నిర్గచ్ఛ మార్గా ద్బహిః,
సీతాఽసా విపినం మయా సహ యతో నిర్గన్తు ముత్కణ్ఠతే.

శ్రీరామవాక్యము.—(హే) పృథ్వి త్వం కోమలా భవ = (ఓ) భూమీ (సీత తల్లీ) నీవు మృదువవు కమ్ము, (హే) దినమణే త్వం శైత్యమ్ అఙ్గీకురు = (ఓయి) సూర్యుఁడా నీవు చల్లఁదనమును అవలంబింపుము, (హే) వర్త్మ త్వం లఘుతాం ప్రయాహి = (ఓ) దారీ నీవు చేరువతనమును పొందుమా, (హే) పవన త్వం స్వేదమ్ ఉత్సారయ = (ఓ) గాలీ నీవు చెమటను ఆర్పుము, (హే) దణ్డకావన సాన్నిధ్యం శ్రయ = (ఓ) దండకావనమా సామీప్యమును పొందుము, (హే) గిరే మార్గాత్ బహిః నిర్గచ్ఛ = ఓకొండా దారినుండి వెలికి (అవలికి) తొలఁగుము, యతః = ఏలయన, అసౌ సీతా మయా సహ విపినం నిర్గన్తుమ్ ఉత్కణ్ఠతే = ఇదె సీత నాతోఁ గూడ అడవికి తరలుటకు ఉవ్విళ్ళూరుచున్నది. ఇందు రామునియనుకూలనాయకత్వము స్ఫుటమే.

---

దక్షిణుఁడు.

సకలనాయికావిషయసమసహజానురాగో దక్షిణః.

(తన) యందలి నాయికలవిషయమందును సమాన మైనస్వాభావికప్రేమకలవాఁడు దక్షిణుఁడు. ఉదా.

ఏతత్ పురః స్ఫురతి పద్మదృశాం సహస్రం,
మక్షిద్వయం కథయ కుత్ర నివేశయామి?
ఇ త్యాకలయ్య నయనామ్బురుహే నిమీల్య,
రోమాఞ్చితేన వపుషా స్థిత మచ్యుతేన. ౧౦౧.

(హేసఖి = ఓచెలీ), పద్మదృశాం సహస్రమ్ ఏతత్ పురః స్ఫురతి = తామరసనేత్రలయొక్క వేయి ఇదె (నా) మ్రోల విలసిల్లుచున్నది (వీరె వేగురు సుందరీమణులు నామ్రోల శోభిల్లుచున్నారు), కుత్ర అక్షిద్వయం నివేశయామి కథయ = (ఇందు) ఎవతెమీఁద కనుదోయిని నిలుపుదును (వీరిలో ఎవతెను గాంతును) చెప్పుము; (కర్తృకర్మకప్రయోగముగా టీక) - ఇతి ఆకలయ్య అచ్యుతేన నయన అమ్బురుహే నిమీల్య రోమాఞ్చితేన వపుషా స్థితమ్=ఇట్లని ఆలోచించి శ్రీకృష్ణుఁడు కనుఁదమ్ములను మూసికొని గగుర్పొడ్చిన యొడలుకలవాఁడై యుండెను. ఒకతెపై కన్నువైచిన కడమవారికి ఈసు పొడము నని ఒక్కతె నేనియుఁ గనక గగుర్పాటు దాల్చుటచే అందఱియందును సమానురాగము తోఁచుచున్నది గావున నాయకుఁడు దక్షిణుఁడు.

## ధృష్టుఁడు.

భూయోనిశ్శఙ్కకృతదోషోఽపి భూయోనివారితోఽపి భూయః
ప్రశ్రయపరాయణో ధృష్టః. యథా.

మాటిమాటికి నిర్భయముగా (కాంతకు) అపరాధము చేసినవాఁ డయ్యును, మాటిమాటికి (కాంతచే) ధిక్కృతుఁ డయ్యును, మాటిమాటికి (కాంతయెడల) వినయ మవలంబించువాఁడు ధృష్టుఁడు. ఉదా.

బద్ధో హారైః కరకమలయో, ర్ద్వారతో వారితోఽపి,
స్వాపం జ్ఞాత్వా పునరుపగతో దూరతో దత్తదృష్టిః,
తల్పోపాన్తే కనకవలయం ముక్త మన్వేషయన్వా
దృష్టో ధృష్టః పున రపి మయా పార్శ్వ ఏవ ప్రసుప్తః. ౧౦౨.

నాయికావాక్యము.—ధృష్టః = (ఆ) దిట్టరి, మయా = నాచేత, హారైః కరకమలయోః బద్ధః (అపి) = ముత్తెపుఁ బేరులలో కేలుఁ దమ్ములయందు కట్టఁబడ్డవాఁడు (అ

య్యును), ద్వారతః వారితః అపి = వాకిటినుండి తొలఁగింపఁబడినవాఁడు అయ్యును, దూరతః దత్త దృష్టిః (సన్) స్వాపం జ్ఞాత్వా పునః ఉపగతః పార్శ్వే ఏవ ప్రసుప్తః = దూరమునుండి నిగుడ్పఁబడిన చూపుగలవాఁడు (అగుచు) (నా) నిద్రను ఎఱింగి వెండియు వచ్చినాఁడు (నా) ప్రక్కనే నిద్రించినాఁడు, తల్పోపాన్తే ముక్తం కనక వలయమ్ అన్వేషయన్త్యా (మయా) పునః అపి దృష్టః = (తల్ప =) పాన్పుయొక్క (ఉపాన్తే =) అంచున (నాచేతినుండి) విడువఁబడిన (ఊడిపడిన) పసిఁడి కడియమును వెదకికొనుచున్న (నాచేత) వెండియును చూడఁబడినాఁడు. నన్ను తగులకుండ మంచపుటోరను పరుండి నిద్రించినాఁడు, నేను ఆయోర నాకయినుండి జాఱిపడిన కడియమును చేతితో వెదకుచుండఁగా, నాచేతికి తగిలినాఁడు, అంత నేను అట్లు నిద్రించుచున్నయాతని కన్ను దెఱచి కాంచితిని, అని భా. కడియము ఊడుట అతనిం దతిమినప్పటినుండి కలిగిన విరహకార్శ్యముచేత.

## శఠుఁడు.

కామినీవిషయకకపటపటుః శఠః. యథా.

కామినివిషయమందు (ఆమెకు తెలియనీయక) కపట మాచరింప జాణఁడు శఠుఁడు (నాఁబడు.) ఉదా.

> మౌళౌ దామ విధాయ, గణ్డఫలకే వ్యాలిఖ్య పత్త్రావళిం,
> కేయూరం భుజయోర్నిధాయ, కుచయోర్విన్యస్య ముక్తాస్రజమ్,
> విశ్వాసం సముపార్జయన్, మృగదృశః, కాఞ్చీనివేశచ్ఛలా
> న్నీవీగ్రన్థి మపాకరోతి మృదునా హస్తేన వామభ్రువః. ౧౦3.

మృగదృశః = నాయికకు, మౌళౌ దామ విధాయ = తలకట్టునందు పూదండ రచించి, గణ్డఫలకే పత్త్ర ఆవళిం వ్యాలిఖ్య = పలకవంటి చెక్కిటియందు మకరికాపత్త్రిముల వరుసను వ్రాసి, భుజయోః కేయూరం నిధాయ = కైదండలయందు అంగదమును పెట్టి, కుచయోః ముక్తా స్రజం విన్యస్య = పాలిండ్లయందు ముత్తెముల పేరును ఉంచి, విశ్వాసం సముపార్జయన్ = (ఇతఁ డిపుడు అలంకరించుచున్నాఁడే గాని మఱేమియు చేయఁడు, అని) నచ్చికను చక్కఁగా సంపాదించి, కాఞ్చీ నివేశ ఛలాత్ మృదునా హస్తేన వామభ్రువః నీవీగ్రన్థిమ్ అపాకరోతి = మొలనూలు పెట్టుటయనెడు మిషచేత మృదువైన చేతితో (చేతితో మృదువుగా - అనఁగా - కాంతకు తెలియనీయక) సుందరియొక్క పోఁకముడిని సడలించుచున్నాఁడు.

## ఉపపతి.

---

ఆచారహాని హేతుః పతి రుపపతిః. యథా.

సదాచారభంగమునకు కారణ మగుపతి ఉపపతి (అంకుమగఁడు). ఉదా.

శఙ్కా-శృఙ్ఖలితేన యత్ర నయనప్రాన్తేన న ప్రేక్ష్యతే,
కేయూరధ్వని భూరి భీతి చకితం నో యత్ర వాశ్లిష్యతే,
నో వా యత్ర శనైరలగ్నదశనం బిమ్బాధరః పీయతే,
నో వా యత్ర విధీయతే చ మణితం త త్కిం రతం కామినోః.

యత్ర = ఏపొందునందు, శఙ్కా- శృఙ్ఖలితేన నయన ప్రాన్తేన న ప్రేక్ష్యతే= జంకుచే సంకెలంబడిన కన్నుఁగొనచేత చూచుట లేదో (తప్పుపని చేయుచున్నా మను జంకుచేత విచ్చలవిడి భగ్నమైనందున ఒండొరులను కడకంటిచూపుల చూచుట లేదో), యత్ర = ఏపొందునందు, కేయూర ధ్వని భూరి భీతి చకితం నో వా ఆశ్లిష్యతే= అంగదముల చప్పుడువలని గొప్ప భయమువలని బెదరుచేత కవుంగిలింత యేని లేదో, యత్ర = ఏపొందునందు, శనైః అలగ్న దశనం బిమ్బాధరః నో వా పీయతె = మెల్లగా దంతములు తగులనియట్లుగా దొండపండువంటి దైనమోవి ఆస్వాదింపఁబడుట యేని లేదో, యత్ర=ఏపొందునందు, మణితం నో వా విధీయతే = రతికూజిత మేనియు చేయఁబడదో, కామినోః తత్ కిం రతమ్ = కాముకులకు ఆపొందు ఏమిపొందు (కొఱగానిపొం దని భా.) పలుగాట్లను మణితములను చేయమి వానిచే ఈపొందు ఇతరులకు తెలియు ననుభయముచేత. చౌర్యరతి గాన ఉపపతి.

ఉపపతి ర ప్యనుకూలాది భేదేన చతుర్విధః. పరం తు శఠత్వం నియత, మనియత మితరత్.

ఉపపతియు అనుకూల దక్షిణ ధృష్ట శఠ భేదముచే నలుదెఱఁగులవాఁడు. అట్లయినను శఠత్వము నియతము, ఇతరము ( = అనుకూలత్వాదికము) నియతము గాదు.

## వైశికుఁడు.

బహుళ వేశ్యోపభోగ రసికో వైశికః. యథా.

మిక్కిలి వేశ్యా సంభోగమునందు ఆసక్తుఁడు వైశికుఁడు. ఉదా.

కాఞ్చీ కల క్వణిత కోమల నాభి కాన్తిం
పారావత ధ్వని విచిత్రిత కణ్ఠ పాళిమ్
ఉద్భ్రాన్త లోచన చకోర మనఙ్గరఙ్గ
మాశాస్మహే క మపి వారవిలాసవత్యాః. ౧౦౫.

నాయకునివాక్యము.—కాఞ్చీ...కాన్తిమ్ = మొలత్రాటియొక్క యింపయిన మ్రోఁతగలదైన - మనోహరమయిన - పొక్కిలియొక్క జిగిగలదియు, పారా...ళిమ్ = పావురముల గుబాళింపుచేత (అట్టిరతికూజితముచేత) వింతదిగాఁజేయఁబడిన (=వింతయైన) కంఠప్రదేశముగలదియు, ఉ...రమ్ = చెలరేఁగిన కన్నులనెడు వెన్నెలపులుఁగులుఁగలదియు, (అయిన), (ఇవన్నియు రంగమునకు విశేషణములు), వారవిలాసవత్యాః కమపి అనఙ్గ రఙ్గమ్ ఆశాస్మహే = భోగపుమిటారియొక్క యనిర్వచనీయమయిన మదన కదనమును (మదననాట్యము నొండె) (సురతమును అనుట) కోరుకొనుచున్నాను. వేశ్యాసక్తుఁడు గాన వైశికుఁడు.

## వైశికభేదములు.

వైశిక స్తూత్తమమధ్యమాధమభేదాత్ త్రివిధః.

వైశికుఁడో ఉత్తమ మధ్య మాధమ భేదముచేత ముత్తెగలవాఁడు.

## ఉత్తమవైశికుఁడు.

దయితాయా భూయః ప్రకోపేఽప్యుపచారపరాయణ ఉత్తమః.

ప్రియ ఎంత కోపము చెందినను (ఆమెకు) సేవలొనర్చుటయం దాసక్తుఁడు ఉత్తముఁడు.

చక్షుః ప్రాన్త ముదీక్ష్య పక్ష్మలదృశః శోణారవిన్దశ్రియం,
నోచ్చై ర్జల్పతి, న స్మితం వితనుతే, గృహ్ణాతి వీటీం న వా,
తల్పోపాన్త ముపేత్య కిన్తు పులకభ్రాజత్కపోలద్యుతిః
కాన్తః కేవల మానతేన శిరసా ముక్తాస్రజం గుమ్ఫతి. ౧౦౬.

కాన్తః = ప్రియుఁడు, పక్ష్మల దృశః చక్షుః ప్రాన్తం శోణ అరవిన్ద శ్రియమ్ ఉదీక్ష్య = దట్టంపు ఱెప్పలతోడి కన్నులుగలదానియొక్క (నాయికయొక్క) కంటికొనను ఎఱ్ఱ దామర సొంపుగలదానిని చూచి (అనఁగా - కన్నుఁగొన కెంపెక్కినదని యెఱింగి, అనఁగా - ఆమె కోపగించియున్నదని తెలిసికొని), (ఆమెకు కోపమూహొచ్చు ననుభయముచేత), ఉచ్చైః న జల్పతి = బిగ్గరగా పలుకఁడు, స్మితం న వితనుతే = నవ్వును పెంపఁడు (=నవ్వఁడు), వీటీం వా న గృహ్ణాతి = వీడెము నేనియుఁ

గ్రహింపఁడు, కిం తు = మఱి యేమి చేయు ననఁగా, తల్పోపాన్తమ్ ఉపేత్య పులక భ్రాజత్ కపోల ద్యుతిః (సన్) కేవలమ్ ఆనతేన శిరసా ముక్తా స్రజం గృహ్ణాతి = (తల్ప=) పడకయొక్క (ఉపాన్తమ్=) చెంతకు పోయి గగురుపాటుచే ప్రకాశించు న్న చెక్కిళ్లయొక్క కాంతికలవాఁ (డై) మిక్కిలి వంగిన తలతో (- తలఁగలవాఁడై, అనఁగా తలను మిక్కిలి వంచుకొని) ముత్తెముల పేరును గ్రుచ్చెడిని. ఆమెఁదనుదోయి నలంకరించుట కని భా. కుపితను సేవించుటచే నుత్తముఁడు. ముత్తెపుంబేరులంచముచే విత్తాభిలాషిణి యగు వేశ్య సూచిత గావున వైశికుఁడు.

## మధ్యమవైశికుఁడు.

ప్రియాయాః ప్రకోపే కోప మనురాగం వా న ప్రకటయతి చే ష్టయా మనోభావం గృహ్ణాతి స మధ్యమః. యథా.

ప్రియ యెంత కోపించినను (తాను) కోపము నేని అనురాగము నేని చూపక (ప్రియయొక్క) చేష్టలచేత (తదీయ) మనోభావమును కనిపట్టు వాఁడు మధ్యముఁడు.

ఆస్యం య ద్యపి హాస్యవర్జిత మిదం, లాస్యేన వీతం వచో,
నేత్రం శోణసరోజకాన్తి; త దపి క్వాఽపి క్షణం స్థీయతామ్,
మాలాయాః కరణోద్యమో, మకరికారమ్భః కుచాభోగయో,
ర్ధూపః కున్తలధోరణీషు, సుదృశః సాయన్తనో దృశ్యతే. ౧౦౭.

నాయకుఁడు వయస్యునితో ఆలోచించుచున్నాఁడు.—సుదృశః = సుందరి యొక్క, ఇదమ్ ఆస్యం హాస్య వర్జితం యద్యపి = ఈ ముఖము నవ్వు లేనిది అయిన ను, వచః లాస్యేన వీతం (యద్యపి) = మాట నృత్యము లేనిది (గా నున్నను), నేత్రం శోణ సరోజ కాన్తి (యద్యపి)=కన్ను ఎఱ్ఱ దామర వన్నెగలది(గా నున్నను), (అనఁగా- నాయిక యింతకోపముగా నున్నను), తదపి = ఆ హేతువుచేత, క్షణం క్వాపి స్థీయ తామ్ = కొంచెము సేపు (ఆమెయెదుటఁ గాక నేను మఱి) యెక్కడ నేని ఉండవలసినది, (కొంచెము సేపటికి ఏల యన, ఆమెకోపము శమించి ననుటకు కారణ మగుపడుచున్న ది; ఏ దనఁగా-) సాయన్తనః = సాయంకాలోచితమైనది (ఇది ఆరంభధూపములకు సైతము విశేషణము), మాలాయాః కరణ ఉద్యమః = పూదండను గ్రుచ్చు యత్నము, కుచ ఆభోగయోః మకరికా ఆరమ్భః = చను విరువులయందు మకరికాపత్త్రములు వ్రా యు కడంకయు, కున్తలి ధోరణీషు ధూపః = తలవెండ్రుకల మొత్తములకు ధూపమి డుసన్నాహమును,దృశ్యతే = (ఒక్కటొక్కటియు) అగపడుచున్నది. క్షణ మవల నుందు నేని కోపము శమిల్లి సాయమండనము దాల్చి నన్ను కోరును, అపుడు నేను మ ఱల రాఁదగును అని భా. కుపితప్రోల నిజకోపానురాగములం బ్రకటింపక తన్

సౌభాగ్యమును తచ్చేష్టచే సెతింగినాఁడు గావున నాయకుఁడు మధ్యముఁడు. హా
స్యలాస్యములచే వేశ్య సూచితగావున వైశికుఁడు.

అధమవైశికుఁడు.

భయకృపాలజ్జాశూన్యః కామక్రీడాయా మకృతకృత్యాకృత్య
విచారోఽధమః. యథా.

భయకృపాలజ్జలు లేనివాఁడు కామక్రీడయందు ఇది చేయఁదగినది ఇది చేయరా
నిది అను విచారము లేనివాఁడు అధముఁడు. ఉదా.

ఉదయతి హృది యస్య నైవ లజ్జా,
న చ కరుణా, న చ కోఽపి భీతిలేశః,
వకుళముకుళకోశకోమలాం మాం
పున రపి తస్య కరే న పాతయేథాః. ౧౦౮.

బాలవేశ్య తల్లితో మొఱపెట్టుకొనుచున్నది.—యస్య = ఎవనికి, హృది =
హృదయములో, లజ్జా న ఏవ ఉదయతి = లజ్జ పొడమనే పొడమదో, కరుణా చ న
(ఏవ ఉదయతి)=దయయు (కలుగనేకలుగదో), కః అపి భీతి లేశః చ న (ఏవ ఉదయ
తి) = ఏమాత్రము ను భయ లేశము గాని (లేనేలేదో) (తనచెయువులకు నాకు కోప
ము వచ్చు ననుభయము ఎవనికి ఇంచుకేనియు లేదో), తస్య కరే = వాని చేతిలో,
వకుళ ముకుళ కోశ కోమలాం మాం పునః అపి న పాతయేథాః = పొగడ మొగ్గల
యొక్క బొక్కసమువలె (అనగా - దానిసౌకుమార్యాదిసర్వధనమువలె) సుకుమారియై
న నన్ను వెండియు వేయకుము. వైశికుని యధమత స్పష్టము.

మానియు చతురుండును.

మానీ చతుర శ్చ శఠ ఏ వాన్తర్భవతః.

మాని (యు) చతురుండు ను శఠునియందే అంతర్భావను పొందుదురు.

మానీ యథా.

బాహ్యోకూతపరాయణం తవ వచో, వజ్రోపమేయం మనః,
శ్రుత్వా వాచ మిమా మపాస్య వినయం వ్యాజా ద్బహిః
ప్రాత ర్వీతవిలోకనే పరిహృతాలాపే వివృత్తాననే [ప్రస్థితే,
ప్రాణేశే నిపతన్తి హన్త కృపణా వామభ్రువో దృష్టయః. ౧౦౯.

(హే ప్రియ = ఓదయితుఁడా), తవ వచః బాహ్యా అకూత పరాయణమ్ = నీ మాట (వేకువను నాకడనుండి పోవునప్పుడు మఱల వెంటనే వచ్చెద నని నీవు చెప్పిన మాట) (హృదయమునకు) వెలియయిన యభిప్రాయము ప్రధానముగాఁగలది (అనఁగా- మనస్సులోనిది గాదు, కపటము, అసత్యము), మనః వజ్ర ఉపమేయమ్ = (నీ) మన స్సు వజ్రముతో పోల్పఁదగినది (అనఁగా - అతికఠినము, కనికరము లేనిది), ఇమాం వాచం శ్రుత్వా = (సాయంకాలమున ప్రియయింటికి వచ్చిననాయకుఁడు ఆమె పల్కిన) యీ మాటను విని, వినయమ్ అపాస్య వ్యాజాత్ బహిః ప్రస్థితే (సతి) = (ఆమెను) మన్నింపవేఁడుటను మాని (ఏదో) మిషచేత బయటికి (పడకటింటినుండి) వెడలిపోయి నవాఁడు (అయి), (ఆమాట కలిగి యిలువెడలి పోయి రాత్రి ఆమెను ఎడచేసి ప్రాతః కాలమందు మఱల ఆమెయింటికి వచ్చి), వీత విలోకనే పరిహృత ఆలాపే వివృత్త ఆన నే ప్రాణేశే = మానిన చూపుగలవాఁడై (ఆమెవైపు చూడక) మానిన మాటగలవాఁ డై (ఆమెతో పలుకక) అవలికి తిరిగిన మోముగలవాఁడై (మొగమును ఆమెకు అగపడ నియట్లుగా త్రిప్పుకొని యున్నట్టి) ప్రాణనాథునిమీఁద, ప్రాతః కృపణాః వామభ్రు వః దృష్టయః నిపతన్తి = ప్రాతఃకాలమందు (మఱల ఏమాట యనిన ఎక్కడ అలిగి పోవునో యనుభయముచేత) దీనములయిన సుందరియొక్క చూపులు పడుచున్నవి, హన్త = అక్కటా! అలిగినందున మాని, వ్యాజముచేత సాధించినందున శఠాం తర్భూతుఁడు.

## చతురుఁడు.

వాక్చేష్టావ్యఙ్గ్యసమాగమ శ్చతురః.

సంభోగాభిలాషను (స్ఫుటముగా చెప్పక) మాటచేత నేని పనిచేత నేని సూచిం చువాఁడు చతురుఁడు (అనఁబడును).

ఆద్యో యథా.

వాగ్వ్యఙ్గ్యసమాగమునికి ఉదా.

తమోజటాలే హరిద న్తరాలే
కాలే నిశాయా స్తవ నిర్గతాయాః
తటే నదీనాం నికటే వనీనాం
ఘటేత శాతోదరి కః సహాయః? ౧౧౦.

నాయికతో నాయకుఁ డనుట.—శాతోదరి - శాత = సన్నని - ఉదరి = క డుపుగలదానా, నిశాయాః కాలే = రాత్రి వేళ, తమో జటాలే - తమః = చీఁకటి చేత - జటాలే = జడలుగలదైన (అనఁగా - దట్టమైన), హరిద న్తరాలే - హరిత్ =ది

క్కులయొక్క - అన్తరాళే = నడిమిప్రదేశమందు, వినిర్గతాయాః తవ = బయలువె డలినట్టి నీకు, నదీనాం తటే • వనీనాం నికటే = ఏళ్ల యొడ్డునను కానల చెంగటను, సహాయః కః ఘటేత = తోడు ఎవఁడు కలుగును (ఎవఁడును కలుగఁ డనుట); నేనే తోడు అగుదును, ప్రతియేటియొడ్డునను ప్రతికాటిచెంగటను క్రీడింతము, అని భా. అది నాయకునివాక్యమునకు వ్యంగ్యార్థ మయినది గావున అతఁడు వాగ్వ్యంగ్యసమాగ ముఁ డనుచతురుఁడు.

ద్వితీయో యథా.

చేష్టావ్యంగ్యసమాగమునికి ఉదా.

కాన్తే కనకజమ్బీరం కరే కిమపి కుర్వతి,

అగారలిఖితే భానౌ బిన్దు మిన్దుముఖీ దదౌ. ౧౧౧.

కాన్తే...కుర్వతి = కాంతుఁడు బంగారునిమ్మపండును చేతిలో ఏమో చేయు చుండఁగా (పట్టి నలుపుచుండఁగా), ఇన్దుముఖీ అగా...బిన్దుం దదౌ = చంద్రవదన (నాయిక) ఇంట (ద్వారోపాంతమున) వ్రాయఁబడిన సూర్యునియందు (సూర్యప్రతిమ యందు) సున్న ను పెట్టెను. నీచనుదోయిం దాఁకెడుభాగ్యము నా కెప్పుడు గలుగును?- అని జంబీరమర్దనమున కభిప్రాయము; ప్రొద్దు గ్రుంకినపిమ్మట నని సూర్యునిపై సున్న చు ట్టిన యభిప్రాయము. నాయకుఁడు సంగమాభిలాషను చేష్టచే సూచించినచతురుఁడు.

## పత్యాదులభేదాంతరములు.

ప్రోషితః పతి రుపపతి ర్వైశిక శ్చ భవతి.

పత్యుపపతివైశికులు ప్రోషితులు (అనఁగా - ప్రియను విడి దేశాంతరము పోయి నవారు) నగుదురు.

ప్రోషితః పతి ర్యథా.

ఊరూ రమ్భా, దృ గపి కమలం, శైవలం కేశపాశో,

వక్త్రం చన్ద్రో, లపిత మమృతం, మధ్యదేశో మృణాళమ్,

నాభిః కూపో, వళి రపి సరిత్, పల్లవః కించ పాణి,

ర్యస్యాః సా చే మరసి న కథం హన్త తాపస్య శాన్తిః? ౧౧౨.

ప్రోషితుఁడు తలపోసికొనుచున్నాఁడు.—యస్యాః = ఎవతెయొక్క, ఊ రుః రమ్భా = తొడ అరఁటిబోదియయో (అనఁగా - దానివంటిదో - అనంతర వాక్యములందును ఇట్లేగ్రహింపవలయు), దృక్ అపి కమలమ్ = నేత్రంబు ను తామ రయో, కేశ పాశః శైవలమ్ = తలవెండ్రుకల మొత్తము నాఁచో, వక్త్రం చన్ద్రః =

మొగము చంద్రుఁడో, లపితమ్ అమృతమ్ = మాట యమృతమో (=మధురమో), మధ్యదేశః మృణాళమ్ = నడుము తమ్మికాఁడయో (=సన్నమో), నాభిః కూపః = పొక్కిలి బావియో (=లోఁతో), వళిః అపి సరిత్ = ముత్తియులు ను ఏఱో (ఒక్కొక్కముడుఁతయు ఒక్కొక్కయలవలెనున్న దనుట-వళిశబ్దము వళిసముదాయపరము), కిం చ పాణిః పల్లవః = మఱియు చేయి చిగురాకో, హన్త = అయ్యో, సా ఉరసి న స్యాత్ (చేత్) తాపస్య శాన్తిః కథమ్ = ఆప్రియ ఱొమ్మున లేదేని తాపము తీఱుట ఎట్లు? (తీఱ దనుట). హృదయమును చెప్పుట హృదయము హృదయభవునితాపమునకు పుట్టుచోటు గావున ను అచట ఆతాపము అతితీవ్రముగా నుండును గావునను. ఉపమానము లన్నియు చలువపదార్థములు, అందువలన నాయికయొక్క తాపహరణసామర్థ్యము తెలియుచున్నది. స్వీయ కా దన గమకము లేనందున నాయిక స్వీయ. కావున నీప్రోషితుండు పతియే.

ప్రోషిత ఉపపతి ర్యథా.

యాన్త్యాః సరః సలిలకేళికుతూహలాయ
వ్యాజా దుపేత్య మయి వర్త్మని వర్తమానే
అన్తః స్మిత ద్యుతి చమత్కృత దృక్తరఙ్గై
రఙ్గీకృతం కి మపి వామదృశః స్మరామి. ౧౧౩.

నాయకునిమాట.—సలిల కేళి కుతూహలాయ సరః యాన్త్యాః వామ దృశః = జల కేళి తమిచేత కొలనికి పోవుచున్న సుందర నేత్రయొక్క, వర్త్మని మయి వ్యాజాత్ ఉపేత్య వర్తమానే (సతి) = దారిలో నేను మిషచేత (ఉంగరమో బంగారుమొలత్రాడో వెదకుకొనుచున్నట్లు నటించుచు) వచ్చి యుండఁగా, అన్త...రఙ్గైః కిమపి అఙ్గీకృతం స్మరామి = లోని చిఱునగవుయొక్క కాంతిచేత వింతలైన (దృక్=) చూపులయొక్క (తరఙ్గైః=) అలలచేత (అనఁగా - మాటచేతఁ గాక నవ్వుఁ జూపులచేత నే ప్రియ తెలియఁజేసిన) మనోహరమైన మరుకేళిసమ్మతిని తలపోసికొనుచున్నాను. ప్రోషితోపపతిత్వము స్పష్టము.

ప్రోషితో వైశికో యథా.

అధృత పరిగళన్నిచోళ బన్ధం
ముషితసకౌర మవక్రదృష్టిపాతమ్
ప్రకటహసిత మున్నతాస్య బిమ్బం
పురనుదృశః స్మరచేష్టితం స్మరామి. ౧౧౪.

నాయకునిమాట.—అధృత పరిగళత్ నిచోళ బన్ధమ్ = ఆఁపఁబడని వీడ్వడు చున్న పోఁకముడి (అవికముడి యని యేని చెప్పవచ్చును) కలది (యు), ముషిత నకారమ్ = దొంగిలఁబడిన వలదనుమాట కలది (యు), అవక్ర దృష్టి పాతమ్ = వంకరగాని చూపుల ప్రసారముకలది (యు), ఉన్నత ఆస్య బిమ్బమ్ = ఎత్తఁబడిన ముఖ మండల ముగలది (యు), (నయిన), (ఇవి స్మరచేష్టితమునకు విశేషణములు), పుర...రామి = ఊరియాలియొక్క (వేశ్యయొక్క) మన్మథవ్యాపారముచు (సురతమును) భావించుచున్నాను. (లజ్జ లేనిది గావున వారసుందరి సురతసమయమందు నీవి సడలించుచున్న నాయకునికి ఆటంకముగా నీవిని చేత పట్టుకొనదు, ఎట్టికామాతిరేకచేష్టితము నేనియు వల దనదు, కొరచూపుల చూడక తిన్నఁగాఁ జూచును, నిర్భయముగా నవ్వును, చక్కఁగా మొగమెత్తుకొని నాయకునివదనమును తన్మనోభావజిజ్ఞాసచే చూచును, అని సంగతి.)

అతీతవేశ్యాసురతస్మరణచే ప్రోషితవైశికత్వము తెలియవచ్చుచున్నది.

నాయకాభాసుఁడు.

అనభిజ్ఞో నాయకో నాయకాభాస ఏవ. యథా.

(ఎంతసూచన చేసినను) భావ మెఱుంగ నేరనివాఁడు నాయకాభాసుఁడు గాని నాయకుఁడు కాఁడు. ఉదా.

శూన్యే సద్మని యోజితా బహువిధా భఙ్గీ, వనం నిర్జనం
పుష్పవ్యాజ ముపేత్య నిర్గత, మథ స్ఫారీకృతా దృష్టయః,
తామ్బూలాహరణచ్ఛలేన విహితౌ వ్యక్తౌ చ వక్షోరుహౌ,
వేత్తే నాపి న వేత్తి, దూతి, కియతా యత్నేన స జ్ఞాస్యతి? ౧౧౫.

ఒకానొకతె దూతితో చెప్పుకొనుట.—శూన్యే సద్మని బహువిధా భఙ్గీ యోజితా = జనసంచారములేని యింట (అతనిమ్రోల) నానావిధమయిన చిట్టకము సలుపఁబడినది (చిట్టకము సల్పితిని, ఇట్లే ఉత్తరత్ర ఊహించుకొనునది), పుష్ప వ్యాజమ్ ఉపేత్య నిర్జనం వనం నిర్గతమ్ = (కర్త్రర్థకమున) పువ్వులకని మిష పెట్టి (అతనితోఁ గూడ) జనరహితమయిన యడవికి పోయితిని, అథ దృష్టయః స్ఫారీకృతాః = మఱియు (అతనికేసి) చూపులు నిగుడ్పఁబడినవి (-నిగిడ్చితిని), (కిం) చ = (మఱి) యు, తామ్బూ...లేన—తామ్బూల = వీడెమును - ఆహరణ = సమర్పించుటయనెడు - ఛలేన = మిషచేత - వక్షోరుహౌ వ్యక్తౌ విహితౌ=పాలిండ్లు బయ ల్పఱుపఁబడినవి- (పయ్యెదను జాఱఁజేసి పాలిండ్లను తోఁపఁజేసి రెండుచేతులలోను తాంబూలము సమర్పించితిని), దూతి=(ఓ) దూతీ, ఏతేన అపి సః న వేత్తి కియతా యత్నేన జ్ఞాస్యతి = ఇంత చేసినను అతఁడు తెలిసికొనఁడు ఎంత ప్రయత్నముచే (సిన) తెలిసికొనునో! కేవలము మొద్దు అని భా.

నాయికకుఁ జెప్పినభేదములను నాయకునికి నిషేధించుచున్నాఁడు.

న చ నాయికాయా ఇవ నాయకస్యాపి తే భేదాః సన్తీతి వాచ్యమ్; తస్యా అవస్థాభేదేన భేదాః, తస్య చ స్వభావభేదేన భేదా, ఇతి విశేషాత్. అనుకూలత్వం దక్షిణత్వం ధృష్టత్వం శఠత్వ మితి చత్వార ఏవ నాయకస్య స్వభావా ఇతి. అన్యథాఽవస్థాభేదేన యది నాయకస్యాపి భేదః స్యాత్, తదా, ఉత్క విప్రలబ్ధ ఖణ్డితాదయో నాయకాః స్వీకర్తవ్యాః; తథాచ, సంకేత వ్యవస్థాయాం స్త్రీణా మనాగమనేఽసంప్రదాయాత్ నాస్త్యనాగమశఙ్కా, ధూర్తత్వ మన్యోపభోగచిహ్నతత్వం చ నాయకానాం న తు నాయికానామ్ తాః ప్రతి తదుద్ఘాటనే రసాభాసాపత్తేః.

నాయికకుంబోలె (నాయికకు చెప్పిన)యాభేదములు నాయకునికిని కలుగును గాక యని చెప్పఁగూడదు. (ఏల యన.—) నాయికకు అవస్థాభేదముచేత భేదము లనియు నాయకునికి స్వభావభేదముచేత భేదము లనియు ఒకవిశేషము (ఉన్నందు) వలన. అనుకూలత్వము దక్షిణత్వము ధృష్టత్వము శఠత్వము నను నాలుగే నాయకస్వభావములు అని (విశదము). అట్లు గాక అవస్థాభేదమునుబట్టి నాయకునికిని భేదము కలుగు నేని, అంతట ఉత్క విప్రలబ్ధ ఖండి తాది నాయకులను అంగీకరింపవలసివచ్చును; అ ట్లంగీకరించుటకు (ఈవక్ష్యమాణ విరోధము లున్న వి:—) సంకేతవ్యవస్థయందు (సంకేతస్థలమునకు) స్త్రీలు రామి సంప్రదాయవిరుద్ధంబు గావున (స్త్రీ) రామికి కారణ మేమో యనుసందేహము (పురుషునికి) కలుగదు, (ఇందువలన ఉత్కనాయకుఁడు లేఁడు.) (మఱి) ధూర్తత్వము అన్యోపభోగచిహ్నతత్వమును నాయకులకే గాని నాయికలకు కావు, (ఏలన-) స్త్రీలకు సయితము వానిని (ధూర్తత్వాన్యోపభోగచిహ్నతత్వములను) చెప్పుట రసాభాసము గావున; (ఇందువలన విప్రలబ్ధ ఖండిత నాయకులు నిరస్తులు.)

## నర్మసచివుఁడు.

తేషాం నర్మసచివః పీఠమర్ద విట చేట విదూషక భేదా చ్చతుర్విధః.

ఆనాయకులకు క్రీడాసఖుఁడు పీఠమర్ద విట చేట విదూషక భేదముచేత నాలుగు విధములవాఁడు.

## పీఠమర్దుఁడు.

కుపితస్త్రీప్రసాదకః పీఠమర్దః. యథా.

అలిగినచెలువను అలుకదీర్చువాఁడు పీఠమర్దుఁడు. ఉదా.

కోఽయం కోపవిధిః! ప్రయచ్ఛ కరుణాగర్భం వచో, జాయతాం
పీయూషద్రవదీర్ఘికాపరిమళై రామోదినీ మేదినీ;
ఆస్తాం వా, స్పృహయాళులోచన మిదం వ్యావర్తయ న్తీ ముహు
ర్యస్మై కుప్యసి తస్య సున్దరి తపోబృన్దాని వన్దామహే. ౧౧౬.

అలిగిననాయికకు నాయకునిమిత్రుఁడు వచించుట.—(హే) సున్దరి = (ఓ) యందగత్తియా, కః అయం కోప విధిః = ఏమి యీ కోప ప్రకారము (అపూర్వము, ఇది తగదు, మాను మని భా.), కరుణా గర్భం వచః ప్రయచ్ఛ = గర్భమందు (లోప ల) కరుణగలదైన మాటను ఒసంగుము (కనికరము వహించి మాట యాడుము), (దానంజే సి) మేదినీ పీయూష ద్రవ దీర్ఘికా పరిమళైః ఆమోదినీ జాయతామ్ = భూమి అమృ త ద్రవంపు నడబావియొక్క నెత్తావులచేత తావిగలది యగునుగావుత (ఆమెయొక్క వచనము అమృతమువంటిది గావున ఆమెపలికినచో భూమియం దెల్ల అమృతసౌరభము నిం డు నని భా.); ఆస్తాం వా = ఉండునుగాక (పోనీ నీవు మాటలాడ నేవలదు), స్పృహ యాళు ఇదం లోచనం ముహుః వ్యావర్తయన్తీ (సతీ) = (ప్రియుని౯ గన) నభిలషిం చుచున్న యీ కంటిని మాటిమాటికి నెడమఱించుచున్న దాన (వై), యస్మై కుప్యసి తస్య తపో బృన్దాని వన్దామహే = ఎవనిమీఁద కోపగించుచున్నావో అతని తపః పరంప రలను కొనియాడుచున్నాము (చున్నాను), (నీకు కోపము గల్గుట - నీయొక్క ప్రే మాతిశయముచేత, అప్రేమాతిశయమునకు పాత్ర మగుభాగ్యము ఎన్నియో తపంబులవల న౯ దక్క లభింప దని భా.) అలుకతీర్చు నేర్పరి గాన పీఠమర్దుఁడు.

## విటుఁడు.

కామతన్త్రకలాకోవిదో విటః. యథా.

కామవ్యాపారశాస్త్రమందు ప్రవీణుఁడు విటుఁడు. ఉదా.

ఆయాతః కుముదేశ్వరో, విజయతే సర్వేశ్వరో మారుతో,
భృఙ్గః స్ఫూర్జతి భైరవో, న నికటం ప్రాణేశ్వరో ముఞ్చతి,
ఏతే సిద్ధరసాః, ప్రసూనవిశిఖో వైద్యోఽనవద్యోత్సవో,
మానవ్యాధి రసౌ కృశోదరి కథం త్వచ్చేతసి స్థాస్యతి! ౧౧౭.

భైరవః = (విరహిజన) భయంకరుఁడు, కుముదేశ్వరః - కుముద = తెల్లగలువలయొక్క - ఈశ్వరః = దొర (చంద్రుఁడు), ఆయాతః = ఉదయించినాఁడు, [భైరవః = (విరహిజన) భయంకరుఁడు] - సర్వేశ్వరః - (ప్రాణ మగుటచేత) సర్వ = ఎల్లవారికిని - ఈశ్వరః = ప్రభువయిన, మారుతః = వాయుదేవుఁడు, విజయతే = ఉత్కర్ష గలిగియున్నాఁడు (చక్కఁగా వీచుచున్నాఁడు), [భైరవః = (విరహిజన) భయంకరమయిన] - భృఙ్గః స్ఫూర్జతి = తుమ్మెద మ్రోయుచున్నది, ప్రాణేశ్వరః నికటం న ముఞ్చతి = ప్రాణనాథుఁడు సమీపమును వదలకున్నాఁడు, ఏతే = ఈనాలుగును, సిద్ధరసాః - సిద్ధ = తప్పకఫలించునట్టి - రసాః = రసౌషధములు (సిద్ధ = నిష్పన్నమయిన - రసాః = శృంగారరసముకలవారు, వీరు పనివడినచో శృంగారరసోత్పత్తి తప్ప దని భా.), ప్రసూన విశిఖః అనవద్యోత్సవః వైద్యః = పుష్పబాణుఁడు (అనవద్య =) భంగములేని (ఉత్సవః =) జయముకలయట్టి (చేతివాసికలయట్టి) వెజ్జు, (ఇట్టి వైద్యునికి ఈసిద్ధౌషధములకును తిరుగఁబడి), అసౌ మాన వ్యాధిః త్వత్ చేతసి కథం స్థాస్యతి=(నిన్ను బాధించుచున్న) యీ యలుక రోగము నీ మనస్సులో ఎట్లు నిలుచును? (నిలువ దనుట; ఇన్ని ప్రబలమదనోద్దీపకములు ఏచుచుండఁగా మానమును నీ వెట్లు వదలకుందువు తప్పక వదలుదువు, అని భా. వదల వేని ఈచంద్రాదులచే కడు శ్రమపడుదువు, కావున, వదలుము, అని హితోక్తి.) కామోద్దీపకత్వమును ఉపన్యసించుటచేత కామశాస్త్రపాండిత్య మగపడుచున్నది.

---

## చేటుఁడు.

సంధాన చతుర శ్చేటః. యథా.

(నాయికానాయకులను) కూర్చుటయందు నేర్పరి చేటుఁడు. ఉదా.

సా చన్ద్రసున్దరముఖీ స చ నన్దసూను
ర్దైవా న్నికుఞ్జభవనం సముపాజగామ;
అత్రాన్తరే సహచర స్తరణౌ కఠోరే
పానీయ పాన కపటేన సరః ప్రతస్థే. ౧౧౮.

చన్ద్ర సున్దర ముఖీ సా (చ) స నన్ద సూనుః చ = జాబిల్లివలె నందమయిన మొగముగలదైన యారాధ (యు) ఆ నంద తనయుఁడు (కృష్ణుఁడు) ను, దైవాత్ నికుఞ్జ భవనం సముపాజగామ = దైవయోగంబున పొద రింటికి వచ్చెను (వచ్చిరి), అత్ర అన్తరే సహచరః తరణౌ కఠోరే (సతి) పానీయ పానకపటేన సరః ప్రతస్థే = అంత లోపల సంగాతకాఁడు ప్రొద్దు తీవ్రముగా (నుండఁగా) జలము త్రాగుటయను మిషచేత కొలనికి తరలెను. తా నచట నున్నచో వారికి కలయిక కలుగ దని అవలి కేఁగెను గావున ఈసహచరుఁడు సంధానకుశలుఁడు.

## విదూషకుఁడు.

అఙ్గాదివైకృతై ర్హాస్యకారీ విదూషకః. యథా.

అవయవాదివికారములచేత నవ్వు పుట్టించువాఁడు విదూషకుఁడు. ఉదా.

ఆనీయ నీరజముఖీం శయనోపకణ్ఠం,
ముత్కణ్ఠితో ఽస్మి కుచకఞ్చుకమోచనాయ;
అత్రాన్తరే ముహు రకారి విదూషకేణ
ప్రాతస్తన స్తరుణకుక్కుటకణ్ఠనాదః. ౧౧౯.

నాయకునిమాట.—నీరజ ముఖీం శయన ఉపకణ్ఠమ్ ఆనీయ = కమల వదనను పడక దగ్గఱకు తెచ్చి, కుచ కఞ్చుక మోచనాయ ఉత్కణ్ఠితః అస్మి = చన్నుల అవికను విప్పుటకు వేగిరపాటుకలవాఁడను అయితిని, అత్ర అన్తరే = ఈ లోపల, విదూషకేణ ప్రాతస్తనః తరుణ కుక్కుట కణ్ఠ నాదః ముహుః అకారి = విదూషకునిచేత ప్రాతఃకాలపుఁ గొదమ కోడి గొంతు ధ్వని పలుమాఱు చేయఁబడెను ( = విదూషకుఁడు పలుమాఱు ప్రాతఃకాలపుఁగొదమకోడికూఁతను కూసెను; విదూషకుఁడు నవ్వించుటకై యట్టికూఁతలు నేర్చినవాఁ డని సంగతి.)

నీరజముఖి శయనమునకు రాఁగా ననక, నీరజముఖిని శయనమునకు తెచ్చి యనుటచేత, నాయిక నవోఢ, ఇంక విస్రబ్ధనవోఢ కాలేదు. దానంజేసి నాయికను సంభోగవ్యాపారములకై కైవసము సేసికొనుటకు నాయకునియత్నము వలసియున్నది: అట్లు ఈ కూఁతలకు మోసపోయి తెల్లవాఱె నను భ్రమచేత సద్యఃప్రమదవిచ్ఛేదమైనను, (విచ్ఛేదముగా నీయక ఆరాత్రిని కోలుపో నొల్లక నాయిక సులువుగా కైవసమయి సంభోగంబునం గదిరినను, ఈ రెండుపక్షంబులందును), రాత్రి యనువర్తించుచునే యుండునందున ఆకూఁతలు విదూషకవైకృతము లని తెలియుటయు అందుచేత హాస్యమయి ఆహాస్యముచేత నవోఢ విస్రబ్ధయై (ద్వితీయపక్షమున మఱియు విస్రబ్ధయై) నాయకునికవుంగిట న

నఁగి పెనఁగి పాండులం జేలుటయు ఘటిల్లును. అప్పటినుండి, ఆవైకృతము స్మృతిగోచర మైనప్పు డెల్ల హాస్యము గలుగుచుండును. తత్కారి గావున విదూషకుఁడు.

తెల్లవాఱునప్పటికూఁత వంటి దగుట - వారిని బెదరువఱచుటకు. కొదమకోడివలె ననుటచే బిగ్గఱగాను దీర్ఘముగాను అని యర్థము; అట్లు కూయుట చక్కఁగా వినఁబడుటకును ఏదో శబ్దమాత్ర మని కాక కోడికూఁతయే యని నిశ్చయము తోఁచుటకును. పెక్కులు కోళ్ళు అట నటం గూయుచున్నవి, చక్కఁగా తెల్లవాఱిపోయినది, అని భ్రమయుటకై పలుమాఱు కూయుట.

## సాత్త్వికభావములు.

> స్వేదః స్తమ్భో౽థ రోమాఞ్చః స్వరభఙ్గో౽థ వేపథుః
> వైవర్ణ్య మశ్రు ప్రళయ ఇ త్యష్టౌ సాత్త్వికా మతాః.

స్వేదః = చెమట, స్తమ్భః = మ్రానుపాటు (అవయవములు పని దక్కుట), అథ = మఱియు, రోమాఞ్చః = గగుర్పాటు, స్వరభఙ్గః = గద్గదస్వరము, అథ, వేపథుః = కంపము, వైవర్ణ్యమ్ = వర్ణము మాఱుట, అశ్రు = కన్నీళ్ళు, ప్రళయః=ఇంద్రియవ్యాపారనాశము (తెచ్చుపాటు), ఇతి అష్టౌ సాత్త్వికాః మతాః = అనునెనిమిది (యు) సాత్త్విక భావములని చెప్పఁబడినవి. సత్త్వమువలనఁ బుట్టునవి గావున సాత్త్వికములు.

> భేదో వాచి, దృశో ర్జలం, కుచతటే స్వేదః, ప్రకమ్పో౽ధరే,
> పాణ్డు ర్గణ్డతటే, తనౌ చ పులకవ్రాతో, లయ శ్చేతసి,
> ఆలస్యం నయనద్వయే, చరణయోః స్తమ్భః, సముజ్జృమ్భతే;
> తత్కిం రాజపథే వ్రజేన్ద్రతనయః కృష్ణ స్త్వయా౽౽లోకితః?

నాయికతో సఖి పలికింమట.—(నీకు), వాచి భేదః=మాటయందు గద్గదస్వరము, దృశోః జలమ్ = కన్నులయందు బాష్పము, కుచతటే స్వేదః = చనుదరియందు చెమరు, అధరే ప్రకమ్పః = మోవియందు అదరు, గణ్డతటే పాణ్డుః = చెక్కిటి ప్రదేశమందు తెల్లఁదనము, (కిం) చ = (మఱి) యు, తనౌ పులక వ్రాతః = మేనియందు పులకల మొత్తము, చేతసి లయః = మనస్సులో తెచ్చపాటు, నయన ద్వయే ఆలస్యమ్ = కను దోయియందు మాంద్యత, చరణయోః స్తమ్భః = పాదములయందు మ్రానుపాటు, సముజ్జృమ్భతే = (ఈచెప్పినది ఒకటొకటియు) అతిశయిల్లుచున్నది; తత్ త్వయా రాజపథే వ్రజ ఇన్ద్ర తనయః కృష్ణః ఆలోకితః కిమ్ = కావున నీచేత రాజమార్గమందు

గొల్లల దొరయొక్క కొమరుఁడు కృష్ణుఁడు చూడఁబడినాఁడా ఏమి? శ్రీకృష్ణుని చూచి నందునం గానిచో నీమేన సకలసాత్త్వికములు ఒక్కమాడి నేల యుదయించు నని భా. ఈశ్లోకమునకు ఈవివరించినపాఠము మకరందకారునిది; వ్యంగ్యార్థకౌముదీకారునిపాఠము ఇట్లున్నది:—

[భేదో వాచి, దృశోర్జలం, కుచతటే స్వేదః, ప్రకమ్పోఽధరే,
పాణ్డుర్గణ్డతటీ, వపుః పులకితం, లీనం మన స్తిష్ఠతి,
ఆలస్యం నయనద్రియ, శ్చరణయోః స్తమ్భః, సముజ్జృమ్భతే;
త త్కిం రాజపథే నిజామధరణీపాలోఽయ మాలోకితః?]

నిజాముఁ డని దేవగిరిప్రభువుపే రనియు, లేక, (ఇష్టార్థకల్పనాప్రతిభచేత) నిజాన్ ఆర్థీయాన్ అమతి ప్రాప్నోతి అను వ్యుత్పత్తిచే నిజాముఁ డనఁగా శ్రీకృష్ణుఁ డనియు, అర్థములు వ్యంగ్యార్థకౌముదిలో వ్రాయఁబడియున్నవి. కాని సాత్త్విక భావ సమాహారోదాహరణపరముగా నుపక్రాంత మయిన యీ శ్లోకములో ఈ పాఠముల రెంటను ఎనిమిది సాత్త్వికభావములకు పైగా ఆలస్య మను వ్యభిచారిభావము గూడ నొకటి చేరియున్నది. దానిం దొలంచుటకు ఈక్రింది యట్లు పఠింపవచ్చును:—

[భేదో వాచి, తథా జలం నయనయో, ర్బిమ్బాధరే వేపథుః,
గణ్డే పాణ్డురుచి, స్తనౌ చ పులకవ్రాతౌ, లయ శ్చేతసి,
స్వేదామ్భః కుచమణ్డలే, చరణయోః స్తమ్భః సముజ్జృమ్భతే,
త త్కిం రాజపథే నిజామధరణీపాలః సమాలోకితః?]

## శృఙ్గారరసనిరూపణమ్.

---

రతిస్థాయిభావః శృఙ్గారః.

రతి యనఁగా సంభోగవిషయకేచ్ఛారూప చిత్తవృత్తివిశేషము. అది దేనికి స్థాయిభావమో అది శృంగారము.

స ద్వివిధః సంభోగో విప్రలమ్భ శ్చ.

అది రెండువిధములు, సంభోగము విప్రలంభము నని.

---

### సంభోగము.

విలాసినోః సంయుక్తయోః దర్శనస్పర్శనాదిః సంభోగః. యథా.

కూడియున్నవా రయిన విలాసవతీ విలాసవంతులయొక్క పరస్పరదర్శనస్పర్శనాదికము సంభోగము. ఉదా.

వియతి విలోలతి, జలదః
స్ఖలతి, విధు శ్చలతి, కూజతి కపోతః,
నిష్పతతి తారకాతతి,
రాన్దోళతి వీచి రమరవాహిన్యాః. ౧౨౧.

ఇది విషయనిగరణఫక్కిచే విపరీతరతవర్ణనము.— వియతి విలోలతి (సతి) = ఆకాశము (కొను) అసియాడుచు (ఉండఁగా), జలదః స్ఖలతి = మేఘము (క్రొమ్ముడి) జాఱుచున్నది, విధుః చలతి = చంద్రుఁడు (ముఖము) కదలుచున్నాఁడు, కపోతః కూజతి = పావురము (కంఠదేశము) కూయుచున్నది (పావురపుగుబాళింపువంటిమణితములను పలుకుచున్నది), తారకా తతిః నిష్పతతి = నక్షత్రముల (ముత్తెముల) మొత్తము రాలుచున్నది (ముత్త్యాలపేర్లు పెరిఁగి ముత్తెములు రాలుచున్నవి), అమర వాహిన్యాః వీచిః ఆన్దోళతి = వేల్పు ఏటి యల (వళి) ఊఁగులాడుచున్నది (వళి నాయకునికి పైగా నున్నది గావున నేలఁబాఱు నేటియల యనక మిన్నేటియల యనుట. అందుచేత లావణ్యాతిశయము కూడ సూచితము.) బాహ్యార్థము:—ఆకాశము చలింపఁగా మేఘము జాఱినది, చంద్రుఁడు కదలసాగెను, పావురము కూయందొడంగెను, చుక్కలు రాలఁ జొచ్చినవి. గంగాతరంగము లూగులాడుచున్నవి.—అని. ఇయ్యర్థమున,ఆధార మైనయాకాశము అల్లకల్లోల మగుడు ఆధేయము లైనమేఘాదులును అట్లె అయిన వని సంగతి.

---

## విప్రలంభము.

కారణవిశేషేణ తయో ర్విశ్లేషో విప్రలమ్భః. యథా.

కారణవిశేషముచే ఆయిరువురకును ఎడఁబాపు విప్రలంభము. ఉదా.

ప్రాదుర్భూతే నవజలధరే త్వత్పథం ద్రష్టుకామాః
ప్రాణాః పఙ్కేరుహదళదృశః కణ్ఠదేశం ప్రయాన్తి,
అన్యత్ కిం వా తవ ముఖవిధుం ద్రష్టు ముడ్డీయ గన్తుం
వక్షః పక్షం సృజతి బిసినీపల్లవస్య చ్ఛలేన. ౧౨౨.

నాయకునికి నాయికదళను సఖి నివేదించుట.—నవ జలధరే ప్రాదుర్భూతే (సతి) = క్రొత్త మబ్బు ఉదయించినది (అగుచుండఁగా), పఙ్కేరుహ దళ దృశః ప్రాణాః త్వత్ పథం ద్రష్టు కామాః (సన్తః) కణ్ఠ దేశం ప్రయాన్తి = తామర ఱేకులవంటి

కన్నులుగలవాని (యాసుందరి) యొక్క ప్రాణములు నీయొక్క (నీవు వచ్చెడు) దారిని చూడఁగోరినవి (అగుచు) గొంతు ప్రదేశమునకు పోవుచున్నవి (ఈమబ్బువలన నీతోడివి రహాముసందు కంఠగతప్రాణ యై యున్నది, త్వరగా వచ్చి కాపాడుము అని భా.), అన్య త్ కింవా = ఇంక నొకవిశేషము, తవ...గన్తుమ్ = నీయొక్క ముఖచంద్రుని చూచు టకై (ఉడ్డీయ = ) ఎగిరి వచ్చుటకుఁగాను, పత్త్రం బిసినీపల్లవస్య ఛలేన పత్త్రం సృజతి = లేఁత తామరచిగురాకుయొక్క (= లేఁతతామరాకుయొక్క) మిషచేత ఱెక్క ను చేసికొనుచున్నది. తాపశాంతికై పాలిండ్లపై కప్పడముగా నుంపఁబడిన లేఁత తామరాకును ఱెక్కగా నుత్ప్రేక్షించినాఁడు.) విప్రలంభము తెల్లమే.

---

## విప్రలంభావస్థలు.

విప్రలమ్భే చాభిలాష చిన్తా స్మృతి గుణకీర్తనోద్వేగ ప్రలా
పోన్మాద వ్యాధి జడతా నిధనాని దశాఽవస్థా భవన్తి.

విప్రలంభమందు ను అభిలాష చింత స్మృతి గుణకీర్తనము ఉద్వేగము ప్రలాప ము ఉన్మాదము వ్యాధి జడత నిధనము (అని) పది యవస్థలు కలుగును.

### అభిలాష.

తత్ర సంగమేచ్ఛాఽభిలాషః. యథా.

ఆపదింటిలో అభిలాష యనునది సంగమేచ్ఛ. ఉదా.

తస్యాం సుతనుసరస్యాం
చేతో నయనంచ నిప్పతితమ్,
చేతో గురు వినిమగ్నం,
లఘు నయనం సంప్లుతం భ్రమతి. ౧౨౩.

ఆ (సుతను = ) సుందరియనెడికొలనియందు (నాయొక్క) మనస్సు కన్ను ను ప డినది (పడినవి), మనస్సు (ప్రేమభారముచేత) బరువు (గావున) మునిఁగినది, తేలిక (యగు టచేత) కన్ను తేలి యాడుచున్నది. మునుఁగుట యనఁగా మఱల నాయకునికడకు రాక అచటనే సక్తమై పోవుట, అనఁగా సదా ఆమెనే కోరుచుండుట; అటనే తేలియాడు ట యనఁగా ఆమెనే గాంచుచుండుట; కన్ను తేలిక యనఁగా, ప్రేమ మనోగతము గాని నేత్రగతము గాదు గావున ఆబరువు కంట లే దనుట; బరువులేనిది కనుక నే కొ లనిపై అన్ని ప్రక్కల తేలియాడుట. భ్రమించుచున్న దనుటచే ఆమెను ప్రత్యంగము వి లోకించుచున్న దని భా.

## చింత.

సందర్శనసంతోషయోః ప్రకారజిజ్ఞాసా చిన్తా. యథా.

సందర్శనప్రకారమును సంతోషప్రకారమును తెలియఁ గోరుట చింత. ఉదా.

మయా విధేయో ముహు రద్య తస్మిన్
కుఞ్జోపకణ్ఠే కలకణ్ఠనాదః,
రాధా మధో ర్విభ్రమ మావహ న్తీ
కుర్వీత నేత్రోత్పలతోరణాని. ౧౨౪.

శ్రీకృష్ణులవారు సహచరునితో పల్కుట.—(కర్త్రర్థమున టీక).—మయా అద్య తస్మిన్ కుఞ్జ ఉపకణ్ఠే ముహుః కలకణ్ఠ నాదః విధేయః = నేను ఇప్పుడు ఆ (పూర్వసంకేతితమైన) పొదరింటి చెంగట పలుమాఱు కోకిల కూఁతను కూయవలయును, (ఏల యన-), రాధా మధోః విభ్రమమ్ ఆవహన్తీ నేత్ర ఉత్పల తోరణాని కుర్వీత = రాధ (ఆకూఁతలను విని) వసంతముయొక్క భ్రమను దాల్చినదై (వసంతము వచ్చిన దని భ్రమపడి ఇఁకను వనవిహార పుష్పాపచయ నికుంజసురతాదులందు ఓలలాడ వచ్చును గదా యను సంతోషముచేత) కన్నుఁగలువల తోరణములను గట్టును (కలువతోరణములవంటి చూపువరుసలను నలుదెసలందు పఱపును). ఆసంతోషప్రకారమును ఆదర్శనప్రకారమును చూడఁ గోర్కి గాన చింత.

## స్మృతి.

ప్రియాశ్రితచేష్టాద్యుద్బోధితసంస్కారజన్యం జ్ఞానం స్మృతిః.

(తా ననుభవించిన) ప్రియా సంబంధి చేష్టాదులచే (తనమనస్సున) కలిగినసంస్కారమువలన పుట్టిన జ్ఞానము (అనఁగా ప్రియాచేష్టాదులను జ్ఞప్తిసేసికొనుట) స్మృతి.

రామో లక్ష్మణ, దీర్ఘదుఃఖచకితో నావిష్కరోతి వ్యథాం,
శ్వాసం నోష్ణతరం జహాతి, సలిలం ధత్తే న వా చక్షుషోః,
వాతావర్త వివర్తమాన దహన క్రూరై రనఙ్గ జ్వరైః
క్షామః కిం తు విదేహరాజతనయాం భూయః స్మరన్ వర్తతే.

సీతావియోగమగ్నులైన శ్రీరాములవారిం గూర్చి లక్ష్మణునితో సుగ్రీవాదులు పల్కుట.—(హే) లక్ష్మణ = (ఓ) లక్ష్మణా, రామః దీర్ఘ దుఃఖ చకితః వ్యథాం న ఆవిష్కరోతి = శ్రీరాముఁడు చిరమైన వియోగశోకముచేత తల్లడిల్లినవాఁడు (అయ్యును) (తన) వెతను (ధీరోదాత్తుఁడుగాన) బయలుపడనీయఁడు, ఉష్ణతరం శ్వాసం న జహాతి = మిక్కిలి వేఁడియగు నూర్పును విడువఁడు (మిక్కిలి వేఁడిగా నిట్టూర్పులు వి

డువఁడు), కింవా = మఱియు, చక్షుషోః సలిలం న ధత్తే = కన్నులయందు బాష్పము ను ధరింపఁడు (కంట తడిపెట్టుకొనఁడు), కింతు = మఱి యేమి చేసెడి ననఁగా, వాత ఆవర్త వివర్తమాన దహన క్రూరైః అనఙ్గ జ్వరైః క్షామః = గాలియొక్క సుడిచే తిరుగుడువడుచున్న నిప్పువలె బాధించునవైన మన్మథ తాపములచేత కృశించినవాఁడై, విదేహరాజ తనయాం భూయః స్మరన్ వర్తతే = విదేహరాజు కూఁతును (= సీతను) మిక్కిలి తలంచుకొనుచు ఉండెడిని.

## గుణకీర్తనము.

విరహే కాన్తావిషయకప్రశంసాప్రతిపాదనం గుణకీర్తనమ్. తద్యథా.

వియోగమందు కాంతను గూర్చిన స్తుతిని చెప్పుట గుణకీర్తనము. దానికి ఉదా.

సర్శః స్తనతటస్పర్శో, వీక్షణం వక్త్రవీక్షణమ్,
తస్యాః కేళికథాలాపసమయః సమయః సఖే. ౧౨౬.

నాయకుఁడు సఖునితో చెప్పుట.—(హే) సఖే = (ఓ) చెలికాఁడా, తస్యాః స్తన తట స్పర్శః స్పర్శః = దాని చను గట్టును తాఁకుట (యే) తాఁకుట, (తస్యాః) వక్త్ర వీక్షణమ్ వీక్షణమ్ = (దాని) మోమును చూచుట (యే) చూచుట, (తస్యాః) కేళి కథా ఆలాప సమయః సమయః = (దాని) సురత కథలను వాక్రుచ్చు వేళ (యే) వేళ.

## ఉద్వేగము.

కామక్లేశజనితసకలవిషయహేయతాజ్ఞాన ముద్వేగః. యథా.

సకలవిషయములను హేయములు (త్యజింపవలసినవి) అని మదనబాధచేత కలిగినబుద్ధి ఉద్వేగము. ఉదా.

గరళద్రుమకన్ద మిన్దుబిమ్బం,
కరుణావారిజవారణో వసన్తః,
రజనీ స్మరభూపతేః కృపాణీ,
కరణీయం కి మతః పరం విధాతః? ౧౨౭.

నాయిక బ్రహ్మను దూఱుచున్నది.—ఇన్దు బిమ్బం గరళ ద్రుమ కన్దమ్ = చంద్ర మండలము విష వృక్షముయొక్క వేరు (వెన్నెలతోఁగూడు విషవృక్షపర్ణాదిస్పర్శవలె కాల్చుచున్నదనుట), వసన్తః కరుణా వారిజ వారణః = వసంతుఁడు కనికరమనెడు తామరకు ఏనుఁగు (కనికరములేని ఘాతకుఁ డనుట), రజనీ స్మర భూపతేః కృపాణీ = రాత్రి (విరహిమారకుఁడైన) మరుఁడనెడి రాజుయొక్క కత్తి (కోసి చం

పుచున్న దనుట, ఈరాత్రి మృత్యువు తప్ప దని భా.), విధాతః = (ఓ) బ్రహ్మా, (న న్ను ముగించుటకు వీనిని చేసితివి గదా, ఇవి చాలక) అతః పరం కిం కరణీయమ్ = ఇటు తర్వాత ఏమి చేయవలసినది (చేయనున్నావు)? చంద్రాదులంగూర్చి హేయతాబుద్ధి.

## ప్రలాపము.

ప్రియాశ్రిత కాల్పనికవ్యవహారః ప్రలాపః. యథా.

ప్రియను గూర్చిన కల్పితవ్యవహారము ప్రలాపము. ఉదా.

అద్వ్యసంవీక్షణం చక్షు, రద్వ్యసమ్మేళనం మనః,
అద్వ్యసంస్పర్శనః పాణి రద్య మే కిం కరిష్యతి? ౧౨౮.

అద్వ్యసంవీక్షణం మే చక్షుః...అద్య కిం కరిష్యతి = ప్రతివీక్షణములేని నా కన్ను, ప్రతిమేళనములేని (నా) మనస్సు, ప్రతిస్పర్శలేని (నా) చేయి (యు) ఇప్పుడు ఏమి చేయును. (కన్ను ఎవరిను చూడను, మనస్సు ఎవరిని చేరను, చేయి యెవరిని తాఁకను, చెలి చెంత లేనందున ఇవన్నియు నిర్విషయ మైనవి, అని భా.) ఈయద్వ్యసంవీక్షణత్వాదికము కల్పితవ్యవహారము గావున ప్రలాపము.

## ఉన్మాదము.

ఔత్సుక్య సంతాపాది కృత మనోవిపర్యాస సముత్థ ప్రియాశ్రిత వృథావ్యాపార ఉదన్మాదః.

విలంబమునోర్వమి జ్వరము లోనగువానిచేత చేయఁబడిన బుద్ధిభ్రంశమువలనఁ గలిగిన ప్రియాసంబంధివ్యర్థవ్యాపారము ఉన్మాదము.

స వ్యాపారః కాయికో వాచిక శ్చేతి ద్వివిధః.

ఆచేష్ట కాయికము (కాయముచేత అనఁగా దేహముచేత నిష్పన్న మయినది) వాచికము (వాక్కృతము) నని యిరుతెఱంగులు. (దానింబట్టి యున్మాదంబును కాయికము వాచికము నని రెండువిధములు.) కాయికమునకు ఉదా.

ప్రతిఫల మమృతాంశోః ప్రేక్ష్య కాన్తో మృగాక్ష్యా
ముఖ మితి పరిహాసం కర్తు మభ్యుద్యతో ఽభూత్;
అథ శిథిలితవాచో మాన మాశఙ్క్య తస్యాః
స్పృశతి పులకభాజా పాణిపఙ్కేరుహేణ. ౧౨౯.

కాన్తః = నాయకుఁడు, అమృతాంశోః ప్రతిఫలం ప్రేక్ష్య = చంద్రునియొక్క ప్రతిబింబమును చూచి, మృగా...భూత్ = కాంతయొక్క ముఖము అని (అను

కాని) ఎగశాళి చేయ నుద్యుక్తుఁడు ఆయెను; అథ శిథిలిత వాచః తస్యాః మానమ్ ఆశ్ఙ్క్య = తర్వాత (మాఱు) పలుకకయున్న యామెయొక్క మానమును శంకించి (ఆ ప్రతిబింబము మాఱుపలుకమిని కాంతయే మాఱుపలుకమిగా భావించి), పులక భాజా పాణి పఙ్కేరుహేణ స్పృశతి = గగుర్పాటు పొందిన కేలుఁ దమ్మితో (ఆచంద్ర ప్రతిబింబమును) తాఁకుచున్నాఁడు. ఉత్తరార్ధమున కాయికము స్పష్టము.

వాచికమునకు ఉదా.

కిం రే విధో మృగదృశో ముఖ మద్వితీయం;
కన్దర్ప దృప్యసి దృగమ్బుజ మన్య దేవ;
ఝుంకార మావహసి భృఙ్గ తను ర్న తాదృక్;
కర్ణాంశి ధి ఙ్న పున రీదృశ మీక్షణీయమ్. ౧౩౦.

కిం రే విధో = ఏమి రా చంద్రుఁడా, మృగదృశః ముఖమ్ అద్వితీయమ్ = (నా) హరిణాక్షియొక్క వదనము సాటిలేనిది; కన్దర్ప దృప్యసి (కిమ్) మదనుఁడా గర్వించెదవు (ఏల), దృక్ అమ్బుజమ్ అన్యత్ ఏవ = (నా చెలియొక్క) కన్నుఁ దామర వేఱే (అనిర్వచనీయ మనుట), భృఙ్గ ఝుంకారమ్ ఆవహసి (కిమ్) = తుమ్మెదా ఝుంకారము చేసెదవు ఏల, తనుః తాదృక్ న = (నా చెలి) మేను అట్టిది కాదు, కర్ణాంశి ధిక్ = (మీ) పనులు ఇవి (ఏమిపాడుపనులు); ఈదృశం పునః న ఈక్షణీయమ్ = ఇట్టిది మఱి (ఎందును) గాన రాదు. నాయకునివాచికోన్మాదము స్పష్టము.

వ్యాధి.

మదనవేదనా సముత్థ సంతాపకార్శ్యాదిదోషో వ్యాధిః. యథా.
మదనబాధచేతఁ గల్గినజ్వరకార్శ్యాదిదోషము వ్యాధి. ఉదా.

కోదణ్డం విశిఖో మనోనివసతిః కామస్య, తస్యా అపి
భ్రూవల్లీ నయనాఞ్చలం మనసి తే వాసః సమున్మీలతి;
ఇత్థం సామ్యవిధౌ తయోః ప్రభవతి, స్వామిన్ స్తథాస్మిన్వ్యాతాం
తన్వానా తనుతాం క్రమా దనుతాం నైసా యథా గచ్ఛతి.

వియోగినీదూతి నాయకునితో వక్కాణించుట.—కామస్య కోదణ్డం విశిఖః మనో నివసతిః = మదనునికి విల్లు బాణము మనస్సులో వసించుట (కలవు), తస్యా అపి భ్రూ వల్లీ నయన అఞ్చలం తే మనసి వాసః సమున్మీలతి = ఆమెకును బొమ తీఁగ కనుఁ గొన నీ మనస్సులో కాపురము దీపించుచున్నది (దీపించుచున్నవి), (వింటికి సాటి కనుబొమ, కోలకు సాటి కటాక్షము, మనోవసతికి మనోవసతి యని

భా.), ఇత్థం తయోః సామ్య విధా ప్రభవతి (సతి) = ఈతీరున ఆయిరువురకు సాదృశ్య ప్రకారము నెలకొను (చుండఁగా), స్వామిన్ = ఓయేలినవాఁడా, తనుతాం తన్వా సా ఏషా క్రమాత్ అతనుతాం యథా న గచ్ఛతి తథా స్నిహ్యతామ్ = తనుత్వమును (కార్శ్యమును) పొందుచున్న యీమె క్రమక్రమముగా అతనుత్వమును (దేహము లేనిదగుటను) ఎట్లు పొంద కుండునో అట్లు(నీవు) దయసేయవలయును. ఈ యిరువురకును ఉక్తసామ్య మున్నను, ఈమె తనువు, మదనుఁడు అతనువు అని వ్యతిరేకము గూడ ఇప్పటికిఁ గలదు. ఈమెయు అతనువు (దేహము లేనిది - మృత) అగునేని అప్పటికి వ్యతిరేకము తీఱి సామ్యము సమగ్ర మగును, అట్లు మాత్రము కానీయకుము, అని యర్థము; త్వరగా వచ్చి కూడి కాంతప్రాణమును కావుము అని భా. ఇది మదనవేదనాజనిత కార్శ్యము కాన వ్యాధి.

## జడత.

విరహావ్యథామాత్రవేద్య జీవనావస్థానం జడతా. యథా.

ప్రాణ మున్న దని విరహవేదనచేతమాత్రమే తెలియునవస్థ జడత. ఉదా.

పాణి ర్నీరవకఙ్కణః, స్తనతటీ నిష్కమ్పమానాంశుకా,
దృష్టి ర్నిశ్చలతారకా, సమభవ న్నిస్పన్దనం కుణ్డలమ్,
క శ్చిత్రార్పితయా సమం కృశతనో ర్భేదో భవే, న్నో చే యది
త్వన్నామశ్రవణేన కోఽపి పులకారమ్భః సముజ్జృమ్భతే.౧౩౨.

దూతి నాయకునితో నాయికయొక్క విరహదశను చెప్పుచున్నది.—పాణిః నీరవ కఙ్కణః సమభవత్ = (కాంతయొక్క) చేయి (నిర్ రవ = ) చప్పుడులేని గాజులుగలది అయినది (కదలిక లేనందున నని భా.), స్తన తటీ నిష్కమ్పమాన అంశుకా = చను గట్టు కదలని పైఁటగలది (అయినది), దృష్టిః నిశ్చల తారకా = కన్ను కదలని పాపకలది (అయినది) (చూపు లేనందున నని భా.), కుణ్డలం నిస్పన్దనమ్ = తాటంకము నృత్తములేనిది (అయినది), కృశతనోః = (ఈయవస్థలో నున్నయా) కృశాంగికి, త్వత్ నామ శ్రవణేన కః అపి పులక ఆరమ్భః నో సముజ్జృమ్భతే యది = నీపేరు వినుటచేత అనిర్వచనీయమైన పులకల మొలచుట తెల్లముకాదేని (ఇది ప్రాణమున్నందులకు గుర్తు), చిత్ర అర్పితయా సమం కః భేదో భవేత్ = చిత్రరువున వ్రాయఁబడినదానితోఁ గూడ ఏమి భేదము ఉండును (ఏమియు నుండ దనుట).

అమంగళ మని మరణావస్థను చెప్ప లేదు.

## దర్శనము.

స్వప్నచిత్రసాక్షాద్భేదేన దర్శనం త్రిధా.

స్వప్నదర్శనము చిత్రదర్శనము సాక్షాద్దర్శనము నని దర్శనము త్రివిధము.

స్వప్నదర్శనమునకు ఉదా.

ముక్తాహారం న చ కుచగిరేః, కఙ్కణం నైవ హస్తాత్,
కర్ణాత్ స్వర్ణాభరణ మపివా, నీతవాన్ నైవ తావత్;
అద్య స్వప్నే వకుళముకుళం భూషణం సందధానః
కోఽయం చోరో హృదయ మహరత్ తన్వి, తం న ప్రతీమః.

నాయిక సఖితో చెప్పుట.—(హే) తన్వి = ఓకృశాఙ్గీ, కుచగిరేః ముక్తాహారం న నీతవాన్ = చనుగొండనుండి ముత్తెపుఁ బేరును కొనిపోలేదు, (కిం) చ = (మతి) యు, హస్తాత్ కఙ్కణం నైవ (నీతవాన్) = చేతినుండి కడియమును కొననే లేదు, కర్ణాత్ స్వర్ణ ఆభరణం అపివా న నీతవాన్ = చెవినుండి బంగారు నగను (పసిఁడికుండలమును) అయినను కైకొనఁడాయెను, (తావత్-పాదపూరణము), అద్య స్వప్నే వకుళ ముకుళం భూషణం సందధానః హృదయమ్ అహరత్ = ఈరాత్రి కలలో పొగడ మొగ్గను మండనముగా ధరించినవాఁడై (వచ్చి) (నా) మనస్సును ముచ్చిలెను, అయం చోరః కః తత్ = ఈ దొంగ ఎవరో ఆవిషయమును (తమ్ = వానిని, అనియేని చెప్పవచ్చును), న ప్రతీమః = ఎఱుఁగకున్నాము. పొగడదండను దాల్పక పొగడమొగ్గను దాల్చుట నెఱనాణెగానితనమును సూచించుచున్నది.

చిత్రదర్శనమునకు ఉదా.

నీవీం హరేత్, దురసిజం విలిఖే న్నఖేన,
దన్తచ్ఛదం చ దశనేన దశే దకస్మాత్;
ఇత్థం పటే విలిఖితం దయితం విలోక్య
బాలా పురేవ న జహార విహారశఙ్కామ్. ౧౩౮.

బాలా పటే విలిఖితం దయితం విలోక్య = (ఆ) ముగ్ధ చిత్తరువున వ్రాయఁబడిన కాంతుని చూచి, నీవీం హరేత్ - ఉరసిజం నఖేన విలిఖేత్ - (కిం) చ దన్తచ్ఛదం అకస్మాత్ దశనేన దశేత్ = (ఇతఁడు నాయొక్క) పోఁకముడిని ఊడలాగివేయును - స్తనమును గోట గీఱును - (మఱి) యు మోవిని (దన్త = దంతములయొక్క - ఛదమ్ = కప్పును) ఉన్నట్టెఉండి పంటితో కఱచును, ఇత్థం పురా ఇవ వి

హార శఙ్కాం న జహార = ఇట్లని మునుపటి వలె (ఆరమణునికడ నున్నప్పటివలె) స్మర క్రీడా భయమును వదలదాయెను.

సాక్షాద్దర్శనమునకు ఉదా.

చేత శ్చఞ్చలతాం త్యజ; ప్రియసఖి, వ్రీడే న మాం పీడయ;
భ్రాత, ర్ముఞ్చ దృశౌ నిమేష; భగవన్, కామ, క్షణం క్షమ్యతామ్;
బర్హం మూర్ధని, కర్ణయోః కువలయం, వంశం దధానః కరే,
సోఽయం లోచనగోచరో భవతి మే దామోదరః సున్దరః. ౧౩౫.

శ్రీకృష్ణుని చూచుచు నొకకాంత తనహృదయాదులతో ననుట.—(హే) చేతః (క్షణం) చఞ్చలతాం త్యజ=(ఓ) మనస్సా (ఇంచుకసేపు) చపలత్వమును మానుము (ఏకాగ్రముగా పరికింపు మనుట), (హే) ప్రియసఖి వ్రీడే మాం (క్షణం) న పీడయ= (ఓసి) నెచ్చెలీ సిగ్గా నన్ను (క్షణము) పీడింపకుము, (హే) భ్రాతః నిమేష దృశౌ ముఞ్చ = (ఓ) యన్నా ఱెప్పపాటా (నా) కన్నులను వదలుము, (హే) భగవన్ కామ క్షణం క్షమ్యతామ్ = (ఓ) స్వామీ మన్మథుఁడా క్షణము ఓర్వుము (తనివి తీఱ చూడనిమ్ము, ఈలోపల దర్శనప్రతిబంధకముగా నన్నేఁపకుము), (ఏల యీవేఁడికోలనఁగా): మూర్ధని బర్హం కర్ణయోః కువలయం కరే వంశం దధానః (సన్) అయం సః సున్దరః దామోదరః మే లోచనగోచరః భవతి = ఔదలయందు నెమలిపురిని చెవులయందు కలువను చేత పిల్లనగ్రోవిని దాల్చినవాఁ(డై) వీఁడుగో అల్లయందగాఁడు శ్రీకృష్ణుఁడు నా కన్నులకు విషయము అగుచున్నాఁడు.

సఖి, అన్న, అనుసంబోధనలచే 'నాపై చెలిమియు దయయు వహింపుఁడు' అని భా. భగవచ్ఛబ్దము జ్ఞానశక్త్యాదిసంపన్నవాచకము గావున, తత్సంబుద్ధికి 'స్వామీ, నీవు మాచిత్తావస్థ నెఱుంగుదువు, ఇదొకవరముగా వేఁడెదను' అని భా. దామోదరుఁడు అనుటచే యశోద ఈయనకడుపునకు త్రాడు చుట్టి ఈయనను ఱోటికి కట్టివేయుట లోనగునద్భుతవృత్తాంతస్మరణము సూచితము, దానిచే ఇంతకు ముందు అమితముగా శ్రవణగోచరుఁ డైనమహానుభావుఁ డని సూచన. శ్రుతపూర్వుఁడు గావుననే 'సోఽయమ్' అనుట. ఇట సాక్షాద్దర్శనము స్ఫుటమే. కవియు నిట గ్రంథాంత మంగళముగా దామోదర సాక్షాత్కారమును వర్ణించినాఁడు. ఏతద్గ్రంథరచనారూపోపాసనకు మెచ్చి శ్రీకృష్ణభగవంతుఁడు దర్శన మిచ్చినట్లు చమత్కారము.

మాధ్వీక స్యన్ద సన్దోహ సున్దరీం రసమఞ్జరీం
కుర్వన్తు కవయః కర్ణ భూషణం కృపయా మమ. ౧౩౬.

కవయః మాధ్వీక స్వాద్ద సన్ధోహా సుద్గరీం మమ రసమఞ్జరీం కృపయా కర్ణ భూషణం కుర్వన్తు = కవులు తేనె యూటికల ముత్తమువలె (అని గ్రంథ పరము - మొత్తముచేత అని పుష్పవల్లరీపరము) మనోహారమయిన నాయొక్క రసమంజరీ గ్రంథమును (రసవంతమయిన పూగుత్తిని) (నామీఁద) దయచేసి చెవి తొడవును చేయుదురుగాక (విని యానందింతురుగాక అని గ్రంథపరము, అవతంపింతురుగాక యని పుష్పవల్లరీపరము). ఎల్లజనులను చెప్పక కవులనుమాత్రమే చెప్పుట 'చర్వణే సర్వసామాన్యే స్వాదువిత్ కేవలం కవిః.' అని పెద్దలు చెప్పినట్టు కవులుమాత్రమే రసజ్ఞులు గావునను, 'అరసికేషు కవిత్వనివేదనం శిరసి మా లిఖ మా లిఖ మాలిఖ.' అన్నట్లు అరసికులకు కవననివేదనము అనభిలషణీయ మగుటచేతను. భూషణ మనుటచే ఆనందింతు రని భా. 'కృపయా' - అనుటచే పొరఁబాట్లు మన్నించి యని భా.

తాతో యస్య గణేశ్వరః కవికులాలఙ్కారచూడామణిః,
ర్దేశో యస్య విదర్భభూః సురసరిత్కల్లోల కిర్మీరితా,
పద్యేన స్వకృతేన తేన కవినా శ్రీభానునా యోజితా
వాగ్దేవీ శ్రుతి పారిజాత కలికా స్పర్ధా కరీ మఞ్జరీ. ౧౩౭.

కవి కుల అలంకార చూడామణిః గణేశ్వరః యస్య తాతః = కవిమండలికి ఆభరణమయినవారికి శిఖా మణియైన (కవిశ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడైన) గణేశ్వరుఁడు ఎవని తండ్రియో, సుర సరిత్ కల్లోల కిర్మీరితా విదేహ భూః యస్య దేశః = వేల్పు టేటి పెద్దయలలచేత (సాక్షాత్తుగాను, తమ నీటిపాయువలచే పండుపంటలకతమున వ్యవహితముగాను,) పలువన్నెలుగలదిగాఁజేయఁబడిన విదేహదేశము ఎవని దేశమో, తెన శ్రీభానునా కవినా = ఆ శ్రీమద్భాను కవిచేత, స్వ కృతేన పద్యేన = తన రచించిన శ్లోకములతో, వాగ్దే...కరీ మఞ్జరీ యోజితా = భారతీదేవియొక్క చెవియందలి యాగిమ్రాని మొగ్గతో పోటి సేయునదైన (యీ) రసమంజరీప్రబంధము కూర్పఁబడినది.

'స్వకృతేన' - నానాగ్రంథములనుండి యుదాహరణములను సంకలించి ఇతర కవులు కూర్తురు - అట్లు సేయక యనుట. 'వాగ్దేవీ...రీ' - సరస్వత్యర్పణముగా చేయఁబడిన దనియు సరస్వత్యాదరణార్హ మనియు భా. 'స్పర్ధాకరీ' - శారదావతంసస్థానమునకు పారిజాతకలికతో 'నీవు తగవు నేను తగుదును' అని వాదించుచున్నదనుట, తత్తుల్య మని యర్థము. ఈగిమ్రాని మొగ్గతో పోటిచెప్పుటచేత కవి వ్యాఖ్యాత్రుపాధ్యాయ విద్యార్థులకు బహుశ్రేయఃప్రద మని భా.

రసమఞ్జరీ సమాప్తా.

# విజ్ఞప్తి.

హిందువుల కెల్ల నైహి కాముష్మిక సర్వశ్రేయః ప్రద యగు సంస్కృతభాష వారిచేత ఈకాలమందు ఉపేక్షితప్రాయయు తిరస్కృతప్రాయయు నై జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లండు, రష్యా, యూనైటెడ్ స్టేట్స్, జపాను, లోనగు దేశాంతర ఖండాంతర ద్వీపాంతరములకు వలస పోయినవిషయము జగద్విదితముగదా. మనదేవతలభాషయు మనకర్మభాషయు మన 'యెల్లభాషలకుం దల్లి' యు నగు నీసరస్వతిని వెండియుం దెచ్చికొని హృదయాలయములందు ప్రతిష్ఠించికొని యుపాసించి తత్ప్రసాదంబున సంస్కృతభాషలో కావ్య నాటక కథా ప్రబంధంబులరసంబును ధర్మ యోగ పురా ణేతిహాస వేద వేదాం తాది విషయంబులను గ్రహించి సర్వశ్రేయంబులం బొందం గోరిక, ఇతర విద్యాభ్యాసప్రయాసచే బాల్యమందు ఈవిద్యను నేర్వని సజ్జనులకు పలువురకు జీవికార్థోద్యమములు తీఱినయనంతరము చిత్తమందు ఉదయించుచున్నది. కాని, అట్టివారికి అనేకులకు ఉపాధ్యాయులు దొరకమింజేసి ఈయభీష్టము నెఱవేఱకయున్నది. అట్టివారికొఱకును కేవలబాలుర కొఱకును ఉపాధ్యాయునితోఁ బనిలేకుండ స్వయంబోధకములుగా పెక్కుసంస్కృతగ్రంథములను, తెనుఁగున, టిప్పణముతో కొన్నిటిని, సంపూర్ణటీకతో కొన్నిటిని, ప్రకటించియు ప్రకటించుచును ఉన్నాఁడను. కారణవిశేషములచే నడుగంటుచున్న మనభాషలకొఱకైన యీయుద్యమమును దేశాభిమానులు సఫలీకరింతురుగాక.

వేదము - వేంకటరాయశాస్త్రి.

ప్రతాపరుద్రీయనాటకము—యుగంధరమంత్రి ఓరుఁగంటిప్రతాపరుద్రుని ఢిల్లీలో చెఱవిడిపించి ఢిల్లీసుల్తానును ఓరుఁగంటికి ఖైదుగొనిపోవుట. రు. 1-2 అ.

నాగానందనాటకము—శ్రీహర్షకృతికి సరియైన తెనుఁగు. సటిప్పణము. 8 అ.

గ్రామ్యభాషాప్రయోగనిబంధనము—నీచపాత్రములకు గ్రామ్యభాషను బెట్టనిది నాటకము కాదని సిద్ధాంతించుట. ... ... 8 అ.

ఆంధ్రప్రసన్న రాఘవనాటక విమర్శము—జయదేవకృతసంస్కృత మూల స్వారస్య వివరణంబును, ఇప్పటి యాంధ్రకవనములను విమర్శించుటయు. 345 పు. 2 రు.

కావ్యాలంకారచూడామణి—ఛందోలంకారశాస్త్రము. రాజరాజనరేంద్రు నిమనుమని కంకితముగా విన్నకోట పెద్దన రచించెను. ... 1 రు.

పారిజాతాపహరణము—'ముక్కు తిమ్మనార్య ముద్దుపలుకు.' 4 అ.

కథాసరిత్సాగరము—సోమదేవ కృతికి సరియైన తెనుఁగు. అత్యద్భుత నీతి వ్యవహార కథలు; స్త్రీలకు సయితము సులువయిన వచనగ్రంథము. యూనివర్సిటీవిద్యార్థులకు రచనాకౌశలమును పుట్టించును. 1092 పు. సంపూర్ణగ్రంథము. 4 రు.

[ఏతన్ముద్రణము శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరిరాజావారి పోషణచే వెలువేఁడినది.]

| ఇదే | ప్రథమ | భాగము | రు. 1-2 అ. |
|---|---|---|---|
| ,, | ద్వితీయ | ,, | రు. 1-2 అ. |
| ,, | తృతీయ | ,, | రు. 1-2 అ. |
| ,, | చతుర్థ | ,, (అంత్యము) | రు. 1-2 అ. |

---

## కథాసరిత్సాగరము.

"నిక్కమైనమంచి నీల మొక్కటి చాలుఁ
దళుకుబెళుకురాలు తట్టెడేల?"

మనుష్యమాత్రులమైనమనము ఎంత నేర్చినను ఎంత ప్రౌఢులమైనను, అన్ని సమయములలోను మనకు శ్రేయస్సే కలుగునట్లును ఇహపరసాధకముగా నడచుకొనుటకు సాధారణముగా శక్తులముగాము. అట్టి మనకు బుద్ధిమాంద్యవ్యాధిని పోఁగొట్టుటకు మధురౌషధమై సకలవ్యవహారములయందును ప్రౌఢిని గలుగఁజేయునదియైన బృహత్కథ యను నానాకథాప్రబంధము తొలుత పైశాచీభాషలో నుండినదై పిమ్మట కాశ్మీరదేశపురాణిగారియానతిచేత సోమదత్తుఁడను మహాకవిచే కథాసరిత్సాగరము అనుపేర గీర్వాణభాషలో ఒకమహాద్భుతకావ్యముగా రచియింపఁబడినది.

ఈగ్రంథము కథ, పురాణము, తత్త్వోపదేశము, రాజనీతి, లోకనీతి, శృంగారము, సకలరసమయము. ఈగ్రంథముయొక్క సారము సెఱుఁగనివాఁడు రాజమంత్రి కానేరఁడు. లోకములోఁగల యద్భుతకథలయిన యావనయామినీవినోదములు (అరేబియన్ నైట్స్ ఎంటర్టేన్మెంట్స్) మొదలయినవానిలో కథాచమత్కారమువలన ఆశ్చర్యానందములు కలుగుట వాస్తవమే గాని వానియందు సదుపదేశము అంతగా లేదు. అందు లీనమైయున్న నీత్యుపదేశము అతిగూఢమై ప్రౌఢబుద్ధులకేగాని గోచరము గాకయున్నది. ఆయావనయామినీవినోదము లేమి, మఱి స్కాట్టు, ఫీల్డింగు, రైనాల్డు మొదలయిన వారినవల లేమి చమత్కారమందుఁగాని నీతిమార్గోపదేశమందుఁగాని బృహత్కథా సుధాసముద్రములో ఒకయలయేనియుఁ గా నేరవు. మఱియు తెనాలి రామలింగయ్యగారిగడుసుఁదనము పరమానందయ్యగారిఛాందసచర్యలు, మహామంత్రులమాయాప్రయోగములు, మహానుభావుల యద్భుతకృత్యములు, యుక్తిప్రధానచరిత్రములు, మహిమప్రధానచరిత్రములు, చిన్నకథలు, పెద్దకథలు, ఈగ్రంథములో అన్నియు కలవు. మనుష్యమాత్రులు చేసినగ్రంథములను వేని నైనను సర్వజ్ఞులు చేసినయీగ్రంథముతో పోల్చుట తగదు. లోకములో ఏకాలములో ఏదేశములో ఏమహాప్రాజ్ఞులు ఏకథను కల్పించియున్నను ఇఁకను ఏకథను కల్పింపఁగలిగినను ఆకథయేగాని దానిసారాంశమే గాని ఈప్రబంధమందున్న దని నమ్మవచ్చును.

ఈమహాకథను వరరుచి కాణభూతి యనుపిశాచరాజునకు చెప్పెను. కాణభూతి గుణాఢ్యపండితునికి చెప్పెను. గుణాఢ్యకవి పైశాచీభాషయందు బృహత్కథయను పేర రచియించెను.

కాళిదాసు మేఘసందేశములో బృహత్కథలోని వాసవదత్తావత్సరాజుల యద్భుతకథలను పరామర్శించినాఁడు. ధావకుఁడు తన రత్నావళీప్రియదర్శికానాగానందములు బృహత్కథనుండియే గ్రహించినాఁడు. రాజనీతిప్రయోగమందు అసదృశమైన ముద్రారాక్షసనాటకము బృహత్కథామూలకము. బాణుని కాదంబరియొక్క కథ, దండియొక్క నితంబవతీచరిత్రమును, ఉద్దండుని మల్లికామారుతమును, భవభూతియొక్క మాలతీమాధవమును, బృహత్కథామూలములే. ఇంతకన్న రసవంతమగు కథాగ్రంథము లోకములో లేమింజేసియే మహాకవులు తమకావ్యములకు ఇందునుండియే కథను గ్రహించినారు. ఆహేతువుచేతనే ఆలంకారికులు దశరూపకాదిలక్షణగ్రంథములయందు, నాటకములకు ఇతివృత్తమును బృహత్కథనుండి గ్రహింపవలయు నని నిబంధనచేసినారు. వాసవదత్తలో సుబంధుకవి బృహత్కథను పరామర్శించినాఁడు. నలచంపువునందు కవి (బృహత్కథచేత) గుణాఢ్యుఁడు సకలజనులను రంజించె నని చెప్పియున్నాఁడు. గోవర్ధన సప్తశతియందు తత్కవి వాల్మీకివ్యాసబృహత్కథాకర్తలకు ఏకవందన మొనరించి, వ్యాసులవారితో గుణాఢ్యు

కికి అభేదము నుత్ప్రేక్షించినాఁడు. మఱియొక మహాకవి ఒకానొక రాజానుగ్ఫూర్తి "ఓరాజా నేను చిత్రార్థమైన బృహత్కథను చెప్పలేదు నీగుణబృందమును ఎట్లు వర్ణింప శక్తుఁడ నగుదును.' అని పలికియున్నాఁడు. దండ్యాచార్యులు, దశకుమారచరిత్రములో తనయపహారవర్మకు గదుగుందనములో బృహత్కథలోనికర్ణీసుతుని ఉపమానముగా చెప్పియున్నాఁడు; మఱియు తన కావ్యాదర్శమను నలంకార శాస్త్రమందు (పైశాచీభాషలోనుండు నద్భుతకథ బృహత్కథ యనఁబడును) అని దానినిగుఱించి యబ్బురపడియున్నాఁడు. మహాకవి బాణుఁడు కాదంబరిలో ఉజ్జయినీవర్ణనలో అందలివిలాసిజనులు బృహత్కథాకుశలులని చెప్పియున్నాఁడు, బృహత్కథలోని యవాంతరకథయైన కర్ణీసుతకథను ప్రస్తావించియున్నాఁడు. ఈమాత్రమేగాక అతఁడే తన హర్షచరిత్రయొక్క యవతారికలో 'బృహత్కథ ఎవనికి ఆశ్చర్యమును కలిగింపదు?' అని చెప్పినాఁడు.

ఇట్టి యీగ్రంథములోని విషయము బాల వృద్ధ స్త్రీ పురుష పండిత పామర మందబుద్ధి మహాబుద్ధులకు, తెలిసికొనవలసినది గావున ఆంధ్రభాషలో వచనరూపముగా రచింపఁబడినది.

## అ భి ప్రా య ము లు.

### మేఘసందేశము.

« తమ మేఘసందేశం బంతయుఁ జూచితిమి. ఉపాధ్యాయ నిరపేక్షముగాఁ జూడందగిన సులభశైలిగా సాభిప్రాయపద భావద్యోతకంబుగాఁ గవి రహస్యభావ బోధకంబుగా నున్నది. మిగుల సంతసించితిమి. తమవంటి రసిక పండితులవలనం గదా సంస్కృతమం దింత కవితాసారస్యం బున్నదనియు ప్రాచీన మహాకవి కాళిదాసాదు లింతటి యనుపమానప్రభావు లనియు నెఱుంగ నవకాశంబయ్యె."—శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి రాజాగారు, క. సి. ఐ. ఇ.

« కాళిదాసుమూలమునందలి యావద్రసమును, యావదర్థసౌకర్యంబును యావత్పదసౌష్ఠవంబును దెనుఁగున వ్రాయుటచే సామాన్యాంధ్రజ్ఞానము గలవారికిఁ గూడ నిది బోధపడుటకు సందేహము లేదు. దీనిం జదువుటకై గురువుగారియపేక్ష యెంతమాత్రమును లేదు. ఇందు మూలవ్యాఖ్యానములు తప్పఁ దక్కినదంతయు వేంకటరాయశాస్త్రిగారికృతము. ఇదియునుంగాక గ్రంథాదిని గాళిదాసునికవిత్వగౌరవముం గొనియాడుచు నతని ననుసరించిన పెక్కుకవుల పద్యముల నుదాహరించుచు నొకగొప్పవ్యాసము వ్రాసిరి. ఇది మేఘసందేశ సారస్యమును దెలిసికొనఁగోరు ప్రతి తెనుఁగువారును జదువవలసినదే."—పరస్వతి.

" శ్రీశాస్త్రిలవారి గ్రంథములలోఁ బదస్వారస్య మొక్కటి పిక్కటిల్లియుం డును. ఇదియ యపండితులకును బండితులకును గలభేదము. ఈ మేఘసందేశమునఁ గల 124 శ్లోకముల కన్నిటికిఁ బదస్వారస్యామృతము చిప్పిల్లుచున్నది. మేఘసందేశ మునఁ గాళిదాసు నిర్ణయించిన రసము నంతయు శాస్త్రిలవారు వెల్లడించియున్నారు. ఈగ్రంథమున కిరువది వ్యాఖ్య లున్నవఁట. ఎన్ని యున్నను నిట్టిపదస్వారస్యముం జూపు గ్రంథ మేభాషయందు నుండ దని మానమ్మకము. ఈ గ్రంథమును బ్రతిమనుజుఁడు జదివినచోఁ గాళిదాసురసజ్ఞతయును శాస్త్రిలవారి సాహిత్యరసపోషణతయును నగ పడును."—అముద్రితగ్రంథచింతామణి.

" మే మాగ్రంథమును చూచినతోడనే సంస్కృతవిద్యార్థులకు కలవుదీఱిపో యినది పో యని మిక్కిలి సంతసించితిమి. సంశయవిచ్ఛేదకముగా ఈగ్రంథమును బ్రచురించుటలో శాస్త్రిలవారు పడినపరిశ్రమ యెంతో పాఠకులకే విశదముకాఁగలదు. చాలమంది పండితులకు మేఘసందేశమున కిట్లు వ్రాయఁదలం పున్నట్లు వినుచుంటిమి గాని అది కొనసాగమి శతాధికగుణమే యని దీనిం దిలకించి యెంచనయ్యె. ఈ పుస్తక మొక్కటి శాస్త్రిలవారి టీకతో విశేషార్థములతోఁ జదివినచో గురువు నరయకయే ప్రతివిద్యార్థియు సంస్కృతమున జ్ఞానముసంపాదించుకోఁగలఁడని చెప్పుటకు సంశయము లేదు."—కళావతి.

## ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము.

"ఆంధ్రగీర్వాణములయందు తమకుఁగల సరసపాండిత్యము స్ఫుటంబయ్యె. మూలగ్రంథభావము పోకుండ నున్నయది. ఒకానొకచోట భావభేదం బున్నను దెనుంగున కయ్యది మెఱుంగు పెట్టినట్లే కానంబడుచున్నది."—శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి రాజాగారు, కె. సి. ఐ. ఇ.

"భాషాంతరీకరణము మూలము ననుసరించి, బహుశ్రద్ధతోఁ జేయఁబడియున్నది. కవిత్వధాటి గంగాప్రవాహమువలె నిమ్నోన్నతంబులులేక సమరసభరితంబును గంభీరధ్వనిప్రధానంబును నై మిగుల శ్లాఘనీయంబుగ నున్నది. ఈమహాకవికి సమంజస పద్యరచనాసౌలభ్యము కరతలామలకం బని తోఁచుచున్నది. శాకుంతల నాటకము ననేకు లాంధ్రీకరించి యున్నారుగాని యవి యింతరసపుష్టిగ నుండలేదు. వానిలోనెల్ల నిదియే మేలుబంతిగ నున్నది."—రొద్దము హనుమంతరావుగారు, ప్లీడరు, పెనుగొండ.

## ప్రతాపరుద్రీయనాటకము.

"ఇదివఱకు మేము విమర్శించిన నూతననాటకములలో నేమి యితరములలో నేమి ప్రతాపరుద్రీయమువంటి యద్భుతనాటకమును మేము కని విని యెఱుంగము. ఇంతరసపుష్టి గలిగియున్నట్టియు నింత ప్రౌఢ మగునట్టియు నాటకము తెలుఁగుండ

జ్ఞానిని మేము చూడలే దనియు విన్నవించున్నాము. ఈ కాలమున వ్రాయఁబడిన నూతననాటకములలో నిది యొక్కటియే లక్షణానుసారముగ నున్నదని ధైర్యముగఁ జెప్పఁగలము. ప్రతాపరుద్రమహారాజు తురకలచే మోసముగ ఖైదుచేయఁబడి స్వగతముగా ననుకొనునట్టి పద్యసువర్ణపరంపర సువర్ణపరంపరగాని వేఱుగాదు. ప్రతాపరుద్రమహారాజు తురకలచేఁ బట్టువడుటనెఱింగి దానింగూర్చి విద్యానాథకవి చింతించు ఘట్టములోని పద్యగద్యాత్మక మంతయు నమృత పుంజముగా నున్నది. ఈనాటకమున యుగంధరుఁడు ఢిల్లీపురిఁ జేరి వెఱ్ఱివానిరూపమును వహించి కావించిన చేష్టల నన్నిటిని వర్ణించుటకు సహస్రముఖములును వ్రాయుటకు వేయిచేతులును వలయును. దీని నంతయును జదివి యానందపడవలయునేగాని మావిమర్శమువలన సంపూర్ణముగాఁ దెలియదు. ఈపట్టునం బెక్కుపాటలును మాటలును, నీతులును, రీతులును, పద్యములును, గద్యములును, వెలయుచున్నవి. గ్రంథమునంత వ్రాయు టొకయెత్తును ఈభాగము వ్రాయుటొకయెత్తును అని తలంచుచున్నాము."—అ. గ్ర. చింతామణి.

"ఇది శాస్త్రిలవారి విద్యావైశద్యఖనింబుట్టి సానలఁదీరి మెఱయుచున్న జాతిరత్నము. కవిజనంబులపాలిటి కిది చింతామణి యనంబడు; పండితేంద్రుల యిండ్లయందుఁ జింతితార్థంబు లొసంగుచుండు. కామితార్థంబులనెల్ల నిచ్చు దీనివిలువ నింతయని చెప్పుట కెరికిని శక్యంబుకాదు. ఇందు చెకుముకిశాస్త్రి తెలివియును మంత్రియుగంధరుని నయతంత్రములును తదితరస్థలములయందలి సంగతులును చదివినవారికి తెలివియున్నయెడల ఆనందము గలుగకమానదు. ఇట్టి మంచినాటక మీయాంధ్రభాషలో ఇంతవఱకు మఱియొకటి కానరాదు."—కళావతి.

"గ్రంథమునందలి విశేష మెఱుఁగఁగోరువారు గ్రంథమును తెప్పించుకొని యెఱుంగవలయునేగాని యీవిషయమై మేము వ్రాయసమర్థులము కాము. పోనీ, యొకటి రెండుపద్యములు వ్రాయుద మన్ననో, వ్రాసినపద్యములే రసవంతమైనవనియు తక్కినవి కావనియు నేర్పడునుగాన మానినారము."—సత్త్వసాధని.

"తమరంపిన ప్రాతాపరుద్రీయనాటకము తెనుఁగు చూడఁబడియె. మిగులరసవంతముగానున్నది...కథాసంవిధానచతురతయందు అష్టమాంకము...చూడఁగా లక్షణవేత్తృతయు రసికవిద్వత్కవితయు బోధ్యమానము లగుచున్నవి."—శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరిరాజాగారు, కె. సి. ఐ. ఇ.

"తత్రభవద్భవ ద్విరచితంబైన ప్రతాపరుద్రీయ నాటకమందలి యపూర్వకల్పనాచాతుర్యమున కపారసంతోషము కలిగెను. ప్రకృతరూపకమం దెవ్వరికి నేదే దిష్టమో యద్యియది సర్వమునందు గనిపించుచున్నందున నిది సర్వజనులకు హృద్యంబును మిగుల శ్లాఘ్యంబునై యుండును. కొంచెముగానున్న కథను విపులముగాఁ బెంచి లోకోపకారముగా నానానీతులు వచ్చున ట్లీనాటకమును జేసి ధ్వన్యర్థాదులవలన హృదయోల్లాసమును

గలుగఁజేసిన మాన్యుల బుద్ధిమహిమను వర్ణింపను సామాన్యుఁడను నేనెంతవాఁడను. మఱియు దీనియం దద్భుతహాస్యరసములు మెండుగాఁ దోఁచుచున్నవి. ఇది విన్నం జదివినను బుద్ధికి చాకచక్యంబును గలిగించు ననుటకు సందియంబులేదు."—జం-సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మదరాసు, ప్రా. మి. కాలేజ్, ఆంధ్రపండితులు.

## ఆంధ్రప్రసన్నరాఘవ నాటకవిమర్శము.

"ఈ విమర్శగ్రంథముం జదివి మేము బ్రహ్మానందముం జెందుచున్నారము. భాషాలలనకు మంచికాలము వేదము వేంకటరాయశాస్త్రులవారివలన వచ్చిన దని మేము సంతోషాంబుధి నోలలాడుచున్నారము. ఈగ్రంథమును చదివినచో నిఁక నెవ్వరును గవిత్వమును దప్పులుగ వ్రాయరు."—అముద్రితగ్రంథచింతామణి.

"ఈవిమర్శము ఉభయభాషలయం దసమాన పాండిత్యముగల శాస్త్రులవారిచేఁ బ్రచురపఱుపఁబడినది. ఇది మిగుల గుణము గలదియై చెన్నారుచున్నది. ఈవిమర్శగ్రంథము భాషాంతరీకరణము చేయువారికి పఠనగ్రంథమై, ఆంధ్రభాషామర్యాద యెట్టిదో బోధపడనివారికి పాఠము చెప్పునదియై, ఇష్టానుసారము సంస్కృతగ్రంథములను పరివర్తన చేయువారికి హృదయశల్యమై, తమమిత్రులు బాగుగనున్న దనినంతమాత్రమున లోకులెల్లరు బాగుగనున్న దని తలంతు రనెడియభిప్రాయమును గొనినవారికి శస్త్రప్రాయమై యున్నది. ఇదివఱ కెన్నియో విమర్శగ్రంథములు బయలుదేఱినవిగాని యిట్టి విమర్శగ్రంథమును మే మెన్నఁడును జూడలేదు. ఇట్టిగ్రంథమువలన విద్యాభివృద్ధి యగును."
—సత్త్వసాధని.

"ఆంధ్రప్రసన్నరాఘవ విమర్శము పఠించినాఁడను. అది కవికల్పద్రుమమనియు, నీషత్పరుషవచన సహితమయినను నిష్పక్షపాతబుద్ధితోఁ జక్కఁగఁ బరిశీలించి వ్రాయఁబడినదనియు, నట్టిపొత్తమును వ్రాయను సామాన్యపండితుల కలవి గాదనియు, నాయభిప్రాయము."—శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవమహారాజుగారు, విశాఖపట్టణము.

## ఉషానాటకము.

"ఉషానాటకము సాంగముగా చిత్రింపఁబడియె. అందు ప్రథమాంకములో ౨౧ వది 'పరవిక వేడికి డస్సి' యనుపద్యము షడ్రుత్వభివ్యంజక శబ్దజాలంబులతో నుత్తరాంకార్థ సూచకాంకాస్యనామక సూచ్యలక్షణత్వ సంపన్నంబై యత్యంతరసవంతంబై యపూర్వకల్పనాకల్పంబయి యున్నయది. తృతీయాంకమందున్న పద్యము 'సంజవేళ శేఁతజాజిపొంది' యనునదియు 'చందన కాత్మబింబసదృశంబుగ' అనునదియు నీరెండు పద్యములును నసంభూతోపమాలంకారములు గల్గి యసదృశ కవికల్పనా సంప్రదాయానురూపములై హూణకవీశ్వర షేక్స్పియర్ ప్రముఖ వర్ణనా స్వభావ సంపన్నంబులై సొంపుగ సహృదయహృదయానందంబుగా నున్నయవి."—శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి రాజాగారు, కె. సి. ఐ. ఇ.